సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 40
28-5-58

Founder : K. NAGESWARA RAO

విలంబి జ్యేష్ఠ శుద్ధ దశమి బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం :
ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి
'వీరప్రతాప్' చిత్రంలో
పద్మిని

# ఏ ప్రమాణాలనుబట్టి కూచిపూడి నాట్యం సశాస్త్రీయమైనది కాదన్నారు?

తుమ్మలపల్లి సీతారామారావు

భారతదేశంలో ఆర్యులు స్థిరనివాసం ఏర్పరచుకోటానికి పూర్వమే ఇక్కడి ప్రజలలో సహజంగా కొన్ని నాట్య సంప్రదాయాలు నెలకొన్నవి. ఆర్యులు తమ సంస్కృతిని, విజ్ఞానాన్ని ప్రజలలో ప్రచారం చేశారు. బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, సంహితలు, పురాణములు, భరత నాట్యంఅన్నీ ఆర్యుల సంస్కృతికి నిదర్శనాలు. ఆర్యద్రవిడ సంపర్కంవల్ల ఇవి ప్రజలలో వ్యాపించినవి. నాట్యకళ మొదట దేవలోకంలో ఉదయించింది. దేవతలు దీన్ని ఒక ఉదాత్తమైన వినోదంగా ఉద్దేశించారు. క్రమేపి భరతనాట్యం, ఆర్యులవల్ల జంబూద్వీప వాసులైన భారతీయులకు నేర్పబడింది.

నాట్యకళకు ప్రమాణం భరతముని చెప్పిన నాట్యశాస్త్రం, ఆ వెనుక కాలంలో నందికేశ్వరుడు వ్రాసిన అభినయదర్పణం, అభినవ గుప్తుడు రచించిన భరతనాట్యశాస్త్ర విమర్శనగ్రంథం. ఈ నాట్యానికి లక్ష్య ప్రమాణగ్రంథాలు. నాట్యశాస్త్రంలో భరతమునిరసము. భావము, అభినయము, ధర్మి, వృత్తి, ప్రవృత్తి, సిద్ధి, స్వరము, ఆతోద్యము, గానము, రంగము, అనే పదకొండు విషయాలు వివరించాడు. అప్పటికి ఆలంకారికులు అంగీకరించిన ఎనిమిది రసములు, 49 భావములు, సాత్వికాంగిక వాచికాహార్యాభినయ విధానాలు, నాట్యాభినయంలో రెండు ప్రసిద్ధ సంప్రదాయములైన ధర్మి, లోకధర్మి, నాట్యాశ్రయములైన నాలుగు వృత్తులు, దేశాచారములైన అవంతి, దాక్షిణాత్య, పాంచాలమధ్యమ, ఓఢ్రమాగధి సంప్రదాయాలు, దైవసంబంధమైన, మానుషికమైనసిద్ధులు, సప్తస్వరాలు, లక్షణాన్వితమైన జంత్రవాద్యాలు, గానాలు రంగ వివరాలు ఈ నాట్యశాస్త్రంలో ఆయన స్పష్టీకరించాడు. ఇలాంటి ఉత్కృష్టమైన నాట్యకళకు ఉపాంగములైన జ్ఞాన శాస్త్రము, శిల్పము, గానము మొదలైనవి అనేకంగా వున్నవి. ఇవన్నీ విశాలము, అగాధము అయినవి. అందువల్లనే నాట్య అంత్యమును చేరటం దుర్లభమని భరతముని తెలిపాడు. సదాశివుడు, చతుర్ముఖబ్రహ్మ, శివుడు, పార్వతి, రంభ, దుర్గాదేవి, భరతుడు, ఆంజనేయుడు, అర్జునుడు, రావణాసురుడు, నందికేశ్వరుడు, కోహలుడు, దత్తిలుడు, బాణాసురుడు, ఉషాకన్య మొదలైనవారు నాట్యప్రమాణికులు. కోహలీయం, దత్తిలం, నందికేశ్వరుని అభినయ దర్పణం, స్వరరత్నావళి, కళారత్నాకరం, మారుతీయం, అనే నాట్యశాస్త్ర గ్రంథాలు, నాట్యకళకు లక్ష్య ప్రమాణాలు.

కాని పైన తెలిపిన నాట్య ప్రామాణికులు చేసిన నృత్త, నృత్యప్రయోగాలను వివరించే ప్రాచీన చిత్తరువులు గాని, శిల్పలు గాని, మనకు లభించినవి చాలా తక్కువ. వీటి వల్ల మనం తెలుసుకోగలిగిన అంశములకంటె తెలియనివే అనంతంగా ఉన్నవి. భరతుని నాట్యశాస్త్రం ప్రచారంలోకి వచ్చిన పదిశతాబ్దాల కాలంలో నాట్యకళ పొందిన పరిణామాన్ని గురించి గాని, వెలువడిన లక్షణగ్రంధాలను గురించి గాని తెలిపే నిదర్శనాలు మనకు లభించలేదు. ఏ శాస్త్రపరిణామ చరిత్రనైనా సమగ్రంగా సేకరించటానికి కృషిచేయకుండా, దాని వర్తమాన స్వరూపాన్ని నిర్ణయించటం ఎంత మేధావులకైనా అలవికాని పని. అలాంటి నిర్ణయం శాస్త్రవిహితమనీ, నిర్దుష్టమనీ చెప్పటం కష్టం.

కొన్ని వందల సంవత్సరాలకాలం, నాట్యకళ రాజులచేతను, ధనికులచేతను, ఉన్నత వంశస్థులచేతను మనదేశంలో విశేషాదరం పొంది గౌరవించబడింది. మన దేశాన్ని పాశ్చాత్యులు పరిపాలించిన కాలంలో, ఆనాటి విద్యాధికులు నాట్యకళకు నీచత్వం ఆపాదించినారు. అనువంశికంగా నాట్యకళలో శిక్షణపొందిన దేవదాసీలు దేవాలయ వృత్తులు మానుకొనినారు. రాజసభా గౌరవం పొందిన భరతశాస్త్ర విద్యాపారంగతురాలు రామభద్రమాంబ, కవయిత్రి, గాయనీమణి, ముద్దుపళని మొదలైనవారు అంతరించినారు నాట్యకళారాధకులైన దేవదాసీలలో ఏర్పడిన నైతికపతనంవల్ల నాట్యకళ హేయంగా చూడబడింది.

జాతీయ చైతన్యం అన్నిరంగాలతోపాటు నాట్యకళా పునరుద్ధరణలో కూడా కనిపించింది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన మొదటి దశాబ్దంలో మన కళాకారులు, తమవిశిష్ట పరిజ్ఞానాన్ని విశ్వజనీనం చేయాలనీ, ఈ కళలకు మానవ జీవితానికిగల సంబంధాన్నీ మానవ జీవిత ఆదర్శాన్నీ కళాసంయోగ సూత్రం ద్వారా ప్రపంచానికి వెల్లడించాలనీ కాంక్షిస్తున్నారు.

దేశంలోని విభిన్న ప్రాంతాలలో అనేక వందల సంవత్సరాల నుంచీ అనువంశికంగా అభ్యసిస్తున్న శాస్త్రవిహిత నాట్య సంప్రదాయాలను పరిశీలించి, ఒక నిర్దిష్ట ప్రమాణం నిర్ణయంచేసి, వివిధ సంప్రదాయాలలోని విశిష్ట గుణాలను ప్రస్ఫుటం చేయటానికి, సంఘటిత విధానం నిర్ణయించటానికి సంగీత నాటక అకడమీ ఇప్పుడు పూనుకున్నది. దీని ప్రత్యక్ష ఫలితంగా ఇటీవల ఢిల్లీలో డాన్సు సెమినార్ జరిగింది. ఈ సదస్సులో జరిపిన చర్చలను అనుసరించి సంగీత నాటక అకడమీ కథాకళి, కథక్, మణిపురి, భరత నాట్య సంప్రదాయాలు సశాస్త్రీయములని గుర్తించింది. ఆవెనుక అకడమీ వెలువరించిన పత్రికా ప్రకటనలో కూచిపూడి, ఒడిస్సి, భాగవత మేలాలాంటి మరికొన్ని నాట్య సంప్రదాయాలను సశాస్త్రీయ నాట్య సంప్రదాయాలుగ గుర్తించ లేదని ప్రకటించింది.

ఏ నాట్య సంప్రదాయం శాస్త్రవిహితమైనదో కాదో నిర్ణయం చేయటానికి పూర్వం సశాస్త్రీయమైన నాట్యం ఏదో తెలియాలికదా? భరతముని నాట్య శాస్త్రం ప్రచారంలోనికి వచ్చిన అనంతరం, అనేక శతాబ్దాల కాలంలో వెలువడిన నాట్య లక్షణ గ్రంధాల పరిశీలన జరుగలేదు. క్రీస్తుశకం 12వ శతాబ్దంలో రెడ్డిరాజుల పాలనలో గజసాధకుడైన జయపురి నాయకుడు రచించిన నృత్తరత్నావళి ఇప్పటికి తంజావూరు సరస్వతి మహాలులో తాటాకు పత్రాలలోనే పడివుంది. దీనిని లోకానికి వెల్లడించే కృషిని రెండు సంవత్సరాలనుంచి మద్రాసు విశ్వవిద్యాలయం చేస్తున్నప్పటికీ ఇంతవరకు ఆ గ్రంథాన్ని లోకంచూసే అదృష్టం కలుగలేదు. సశాస్త్రీయ నాట్య లక్షణాలు ఏవో, వాటి పరిణామశీలాత్మకమైన చరిత్ర స్వరూపమెట్టిదో తెలుసుకోకుండా, ఏ సంప్రదాయాలలోని ఏయే లక్షణాలనుబట్టి ఆయా సంప్రదాయాలు సశాస్త్రీయములని నిర్ధారణ చేయగలము? సర్వత్రా అంగీకరించిన శాస్త్రీయ నాట్య సంప్రదాయాలలో

# ఏ ప్రమాణాలను బట్టి?

భరతముని నాట్య శాస్త్రంలో వివరించిన లక్షణాలు, అవెనుక కాలంలో నాట్య ప్రామాణికులు అంగీకరించి స్వీకరించిన దేశీయ పద్ధతులు ఎంతవరకు వున్నవి? అకడమీ జరిపిన చర్చలలో సశాస్త్రీయమని అంగీకరించని కూచిపూడి నాట్యములోని శాస్త్ర విహిత లక్షణాలను ఉదాహరణ పూర్వకంగాను, ప్రయోగం రూపంగాను నిరూపించగల శాస్త్ర పరిజ్ఞానము, ప్రయోగ కౌశలముగల వారెవరైనను చర్చలలో పాలొన్నారా? కూచిపూడినాట్యం, సశాస్త్రీయం కాదని చేసిన నిర్ణయం, నాట్య శాస్త్రస్వరూపం తెలియనివారు చేయవలసిన నిర్ణయం.

అసలు నాట్య స్వరూపం, మరుగుపడిన పరిస్థితులలో చేసే నిర్ణయం సరి అయినది కాదు. సశాస్త్రీయ నాట్య సంప్రదాయములని సంగీత నాటక అకాడమీ గురించిన వాటిలోకంటె కూచిపూడినాట్యములో శాస్త్ర సంప్రదాయ లక్షణాలెక్కువగా కనబడుతున్నవి. కూచిపూడి నాట్య సంప్రదాయం ఎంతవరకు శాస్త్ర సమ్మతమయినదో తెలుసుకొనటానికి, రమారమి అయిదు శతాబ్దాల దేశచరిత్ర, సాహిత్యాధారములు, ప్రాచీన దేవాలయాల శిల్పములు లెస్సగా తోడ్పడగలవు. కూచిపూడి నాట్య ప్రయోగాలలో శివ సంప్రదాయలక్షణాలను నిరూపించటానికి, తౌర్యత్రికంలో వీరికిగల అసామాన్యమైన ప్రతిభను స్ఫోరకంచేయటానికి, తరంగములు, అష్టపదులు, పదములు, శబ్దాభినయం, స్వరజతులు చాలును. వీరి ఆహార్యవిధానం కూడా, ప్రత్యేక విశిష్టతను సంతరించుకొని, ఊపజ్ఞా సమన్వితమైన వీరి భూగోళ విజ్ఞానమును వెదజల్లుతూంది. ఉదాత్తగుణపూరితమైన శివతౌర్యత్రికమును కేవలం ఆహార్య ఆంగికాభినయంగా మాత్రమే ప్రదర్శించకుండా నానా భావవివయ వ్యంజితములు, నాగంగ సత్యోపేతములు, అయిన స్థాయీభావములను, సుమనస్కులైన ప్రేక్షకులు ఆస్వాదించి హర్షము పొందునట్లు చేయగలిగిన నాట్యప్రయోగమే సశాస్త్రీయమైనది.

సంగీతనాటక అకడమీ సశాస్త్రీయ నాట్య సంప్రదాయములని గుర్తించిన వాటిలోకంటె ఈ లక్షణములు కూచిపూడి నాట్యంలో ఎక్కువగా కనుపిస్తున్నవి. అంతేకాదు. కూచిపూడినాట్యమును తెలుగు దేశంలో ఈనాడు కూచిపూడి భరతనాట్యమనే పిలుస్తున్నారు. భరతముని నాట్య శాస్త్రంలో చెప్పిన లక్షణాలు శ్రద్ధాపూర్వకంగా అనుసరిసూ నందికేశ్వర ప్రోక్తమైన అభినయదర్పణాన్ని లక్ష్యంగా పెట్టుకొన్న ఈ నాట్య సంప్రదాయం శాస్త్రీయమైనది కాదని సంగీత నాటక అకడమీ చేసిన నిర్ణయం తెలుగుదేశపు నాట్యకళకు తీరని అపకారం చేస్తున్నది. ★

# న్యూఢిల్లీ లేఖ

# కాంగ్రెసువాదులకు కర్తవ్యబోధన

శ్రీ కృష్ణ
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

గత వారమంతా పత్రికలలో కాంగ్రెసు పతాక శీర్షికల కెక్కింది. వాస్తవానికి వార్తల్లో అధికభాగం కాంగ్రెసుకు సంబంధించినవే. ఎంతటివారికైనా ఆత్మవిమర్శ, హృదయ పరిశోధనా అవసరం. కాంగ్రెసువాదులు గతవారము ఢిల్లీలో సమావేశమై సరిగా ఇదేపని చేశారు. ప్రధాని నెహ్రూ తన మనస్సులోవున్న విషయాన్ని అతిస్పష్టముగా, నిర్మొహమాటంగా కాంగ్రెసు సహచరులకు తెలియజేశారు. తమ హృదయావేదనను వ్యక్తపరిచారు. దేశ సమైక్యతను సుసంఘటితం చేయాలన్నది ప్రధాని నెహ్రూ ప్రసంగాలలోని ప్రధానాంశం. కాంగ్రెస్‌లో వున్న చిచ్చుబుడ్డి మనస్తత్వం వారు కూడా ప్రస్తుత దశ పరిస్థితులపై తమ మనోగత భావాలను గబగానే వెల్లడించగలిగారు!

ఈ 'చిచ్చుబుడ్డి వర్గా'నికి చెందిన ఆవేశపరుల ధోరణిచూస్తే ఆంథోనీఈడెన్ స్థితిపై ఒకానొకప్పుడు ఒకరు వ్రాసిన పద్యంలోని చరణాలు జ్ఞాపకం వస్తున్నాయి:

"మూడు పదులు ముప్పదేండ్లు
అబ్బ! ఎంత నిరాశ! ఎంత నిస్పృహ!!
వచ్చి చావదీ పెద్దల విరమణ
అందుకేనేగా ఈ అనంత నిరీక్షణ!..."

కాంగ్రెసులోని ఆవేశపరులైన యువకుల సంగతికూడా సరిగా ఇలాగేవుంది. ఇక్కడ కూడా వారు కోరుతున్నట్లు పెద్దలు పదవుల నుంచి విరమించడం లేదు. తత్ఫలితంగా వారికి ఒకటే నిరాశ! ఒకటే నిస్పృహ!

• • •

ప్రధాని నెహ్రూ పదవీ విరమణ చేస్తాననేసరికి దేశవ్యాప్తముగా చెలరేగిన రకరకాల 'బృందగానం' లో ఆచార్య వినోబాభావే కంఠధ్వనికూడా వినిపించింది. అరవై ఏదేళ్ళ వయస్సు దాటిందీ అనగానే రాజకీయ నేతలు పదవీ విరమణ చేసితీరాలని ఆచార్య భావే సూత్రీకరించారు. ప్రధాని నెహ్రూ ఇప్పుడుకాదు మూడేళ్ళక్రితమే పదవీ విరమణ చేసి వుండవలసిందని వారు అభిప్రాయపడ్డారు. ఈ సూత్రీకరణ వినోబాజీ దృష్టిలో ఒక్క ప్రధాని నెహ్రూకు మాత్రమే వర్తిస్తుంది. భారత రాష్ట్రపతి విషయంలో వారేమీ చెప్పలేదు. పోన్లెండి—ఇదంతా వేరే గొడవ—ఇంతటితో వదిలేద్దాం.

* * *

అఖిల భారత కాంగ్రెస్ వేదికమీది నుంచి ప్రధాని నెహ్రూ అటు అతివాదులైన కమ్యూనిస్టుల మీదా, ఇటు మతవాదులైన కులతత్వపరులమీదా కూడా గట్టి విసుర్లే విసిరారు. అల్పసంఖ్యాకులకు ముఖ్యంగా ముస్లింలకు తగిన రక్షణ సదుపాయాలు కలిగించలేక పోతే ప్రజాస్వామ్యం నిష్ప్రయోజనమవుతుందని హెచ్చరిక చేశారు. దేశంలో ఉర్దూభాషకూడా సముచిత పరిగణన ఇచ్చి తీరాలని ధర్మప్రబోధం చేశారు.



ముఖ్యమంత్రి సంజీవరెడ్డి
మే 19.న వీరి 46 వ జన్మదినోత్సవం వైభవంగా జరిగింది.

ఈ సందర్భంలో మనం ఒక విషయం గుర్తుంచుకొని తీరాలి. పాకిస్తాన్ స్థాపన కోసం జరిగిన పోరాటాలన్నీ అలహాబాదు, లక్నో విశ్వవిద్యాలయాల క్రీడారంగాలలోనే జరిగాయన్నదే ఈ విషయం. అధిక సంఖ్యాకవర్గం అల్పసంఖ్యాకులను న్యాయదృష్టితో చూడలేకపోయినందువలనే, చూడడానికి నిరాకరించినందువల్లనే శాసన సభలలోనూ, ఇతరత్రాను మతసంబంధమైన ప్రాతినిధ్యాన్ని ప్రవేశపెటవలసి వచ్చింది. పార్లమెంటులోను, ఇతర శాసనసభలలోనూ నేడు అధికసంఖ్యాబలంతోవున్న పక్షం రేపు అల్పసంఖ్యాబలం కలదిగా మారిపోవచ్చు. మత సంబంధమైన అల్పసంఖ్యాక వర్గాలలో ఆ విధమైన మార్పు ఎన్నటికీ రాదు. మతద్వేషాల తమకు న్యాయం చేకూరకుండేమోనని ముస్లింలు 1910 వరకూ నిరీక్షించారు. అంతకు మించి నిరీక్షణ వారికి అసంభవమనిపించింది. అంతటితోనే మతప్రాతినిధ్యం వచ్చింది. దాని పర్యవసానంగా దేశవిభజన జరిగింది. ఈ గుణపాఠాన్ని మనం మరచిపోదామన్నా మరచి పోలేము.

అయితే, ఇక్కడ మరొకవిషయం కూడా లేకపోలేదు. అల్ప సంఖ్యాకులపట్ల అనుమాన భావాన్ని ప్రదర్శించడమన్నది అసలు ముస్లింలవద్దనే ఇతరులు నేర్చుకున్నారేమో ననికూడా అనిపిస్తుంది. వివిధ ముస్లిం రాజ్యాలలోనూ అల్ప సంఖ్యాకులైన అన్యమతస్థులు ఇదివరలో పడరానిపాట్లు పడ్డారు; ఇప్పటికీ పడుతున్నారు.

మొత్తంమీద ప్రధాని నెహ్రూ కాంగ్రెస్ సహచరుల సమక్షంలో అల్పసంఖ్యాకుల విషయమై మందలించడం మంచిదే అయింది. అల్పసంఖ్యాకవర్గాలకు న్యాయం సమకూర్చడమన్నది ప్రతి ప్రజాస్వామ్యం

# ★ న్యూఢిల్లీ లేఖ ★

లోనూ ప్రధాన లక్ష్యంగా వుండాలి; దీన్ని ఎవరూ కాదనలేరు.

* * *

భారత దేశంలో ప్రశాంతంగా వుంటున్న మహమ్మదీయులలో పాకిస్తాన్ ప్రభుత్వం నిర్హేతుకంగా కొంత కలవర పాటును, అస్థిరత్వాన్ని రెచ్చగొడుతూ వస్తున్నది. అక్కడి పాలకులకు ఇదొక అర్థంలేని రాజకీయ వినోదమయింది. ఈ ధర్మపన్నాలు చెప్పే పాకిస్తాన్ ప్రభుత్వమే పశ్చిమ పాకిస్తాన్‌లో ఒక్క హిందూ పురుగైనా లేకుండా చేసింది; ఇప్పుడు తూర్పు పాకిస్తాన్‌లో కూడా అదే పనిచేస్తున్నది. సహజ సిద్ధంగా పాకిస్తాన్‌లో తమతమ నివాసాలలో హాయిగా వుండవలసిన ఈ కాందిశీకులూ తండోపతండాలుగా వచ్చిపడేసరికి వీరి పునరావాస సౌకర్యాలు ఏర్పాటుచేయడంలో దేశం అతలాకుతలమై పోయింది! అక్కడ పాకిస్తాన్‌లో తమను ముస్లిం అధిక సంఖ్యాకులు పెట్టిన యమయాతనలను, విషాదగాథలు వినేసరికి ఇక్కడ హిందువుల మనస్సులు కూడా వికలమైపోయిన మాట వాస్తవం.

* * *

హిందువులపై పెద్దపెట్టున 'మత యుద్ధం' సాగిస్తామని పాకిస్తాన్ నాయకులు అసందర్భంగా తిరిగి ఏవేవో కేకలు, బొబ్బలు పెడుతున్నారు. అందుచేత తమ ఇరుగుపొరుగునవున్న ముస్లింల విషయమై ముస్లిమేతరులు, ముఖ్యంగా హిందువులు-జాగ్రత వహించివుండవలసిన సమయమిది.

భారతదేశంలోవున్న మహమ్మదీయులకు భారతదేశంపట్లవున్న భక్తిప్రపత్తులను శంకించవలసిన అవసరం లేకపోయినప్పటికీ, పాకిస్తాన్ నాయకులు హెచ్చరిస్తున్నట్లు మతయుద్ధాన్నే ప్రారంభిస్తే, ఇక్కడి మహమ్మదియుల వైఖరి ఎలా వుంటుందనే విషయాన్ని ఊహించవలసిందేగాని, ఇదమిత్థమని చెప్పలేము. పాక్ నాయకులు తరుచూ భారత ముస్లింల ప్రసక్తి తీసుకురావడంవల్లా, వారికి ప్రాదేశికమైన ఒక ఉపప్రతిపత్తి కలుగజేయడానికి ఆ నాయకులు ప్రయత్నిస్తుండడంవల్లా దేశంలో ముస్లిమేతరులకు ఒకవిధమైన ఏహ్యభావం కలగడం సహజం. ఇందుకు ఒక ఉదాహరణనే తీసుకుందాము భారత దేశంలోని ముస్లింల యోగక్షేమాల ప్రసక్తిని సౌదీఅరేబియా రాజు తీసుకురావలసిన ప్రమేయమేమున్నది చెప్పండి?

పాకిస్తాన్‌లో వున్న హిందువుల యోగక్షేమాల విషయమై ఏ నేపాల్ రాజో ప్రమేయం పెట్టుకున్నాడనుకోండి; అప్పుడు సంకుచిత మతతత్వ ధోరణి ప్రదర్శిస్తున్నారని వారిని ఆడిపోయమా? తమ వ్యవహారాలలో సౌదీ అరేబియా రాజు అనవసరంగా జోక్యం కలుగజేసుకుంటున్నందుకు భారతీయ ముస్లిం నాయకులు ఆక్షేపణేదీ ప్రకటించకపోవడం కొంతవరకు ఆందోళన కలిగించకపోదు.

* * *

దేశంలో వున్న కొన్ని ఉర్దూ పత్రికలు నిరాధారమైన అభూత కల్పనలను వార్తలుగా ప్రకటిస్తుంటే, పాకిస్తాన్ పత్రికలు ఆ నిరాధార వార్తలనే పునర్ముద్రించి భారతదేశంమీద దుమ్ము తూర్పారపట్టడం జరుగుతున్నది. దీన్నికూడా దేశంలో వున్న ముస్లిం పెద్దలు ఖండిస్తున్నట్లు కనబడదు. హిందూ మతసంస్థలను ఖండించడంలో కాంగ్రెస్ ఎన్నడూ సంకోచించలేదు. వాటితో పాటు అసంభవమని అనేక సందర్భాలలో జాతీయ కాంగ్రెస్ సంస్థ స్పష్టపరిచింది. ఆ కాంగ్రెసే జమాయత్-ఉల్-ఉలేమాతో (ముస్లిం మతసంస్థ) అన్నివిధాలా సహకరించి పనిచేస్తున్నది. దీన్ని ముస్లింల ఏకైక సంస్థగా పరిగణించడమే గాక దీని సభ్యులైనవారికే కేంద్ర మంత్రిమండలిలో స్థానం ఇస్తున్నది. ఈ విషయాన్ని కూడా ముస్లింలు గ్రహించి వుండాలి.

* * *

దేశభక్తి విషయంలో బ్రిటిష్ వారివద్ద మనం నేర్చుకోవలసిన విషయాలు అనేకం వున్నాయి. మన దేశాన్ని పరిపాలిస్తున్న రోజుల్లో ఇక్కడి బ్రిటిష్‌వారు బ్రిటిష్ యాజమాన్యంక్రిందనడిచే పెద్ద దుకాణాలలోనే తమకు కావలసిన వస్తుసామగ్రిని కొనుక్కునేవాళ్ళు; ఆ దుకాణాలలో మామూలు దుకాణాలలోకంటె ధరలు ఎక్కువని తెలిసికూడా వాళ్ళు ఆ విధంగా చేసేవాళ్ళు.

సరిగా ఇదేలాంటి చిన్న సంఘటన ఒకటి ఈ మధ్య జరిగింది. బ్రిటిష్ వార్తాపత్రికలు కొన్ని తమ తరఫున మన దేశంలో ప్రాతినిధ్యం వహించడానికి బ్రిటిష్ యాజమాన్యాన ఒక బ్రిటిష్ సంపాదకుని ఆధ్వర్యాన న్యూఢిల్లీనుంచి వెలువడే ఒక పత్రికలో పనిచేస్తున్నవారిని నియమించాయి. నియమిస్తే ప్రమాదమేమిటనే సందేహం వస్తుందేమో! బ్రిటిష్‌యాజమాన్యాన మన దేశంలో నడుస్తున్న ఆ పత్రిక ఇక బలీయమైన శక్తిగా తయారై తీరుతుంది. ఎందుచేతనంటే మన దేశీయుల మనస్తత్వం అలాంటిది!

దేశం స్వతంత్రం కాకముందు కాంగ్రెస్ వాదులలో కొందరు జిల్లా కలెక్టరైన ఒక ఆంగ్లేయుడు తమతో కరచాలనంచేస్తే సంతోషం పట్టలేక ఉబ్బి తబ్బిబ్బయిపోయేవారు. బ్రిటిష్‌పాలకులు నిష్క్రమించినా మనవారికి ఇంకా ఈ మనస్తత్వం వదలలేదు. బ్రిటిష్‌యాజమాన్యాన దేశంలో నడుస్తున్న పత్రికలో తమనుగురించి ఒక మంచిమాట ఎప్పుడు పడుతుందా అని వీరు నిరీక్షిసుంటారు. ఇకమీద ఈ ఢిల్లీపత్రిక మన వారికి ఇందుకు బాగా ఉపయోగపడుతుంది. దేశం స్వతంత్రమైంది; ఎవరు ఎవరినైనా తమ ప్రతినిధులుగా నియమించుకునే స్వేచ్ఛ వున్నదని మీరు వాదించవచ్చు. నిజంగా అంతస్వేచ్ఛవుంటే, 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక ఇంటర్నేషనల్ ఎడిషన్ను మన దేశంలో ప్రచురించడానికి ఎందుకు అనుమతి ఇవ్వలేదంటారు? జాతీయక్షేమందృష్ట్యా అలాంటి అనుమతి ఇవ్వలేదనవచ్చు. అయితే అన్నివిషయాలలోనూ జాతీయ క్షేమాన్ని పాటించవద్దా?

* * *

"ప్రజాస్వామ్యం న్యాయం, ధర్మం, స్వేచ్ఛ, సోదరమానవుల హక్కుల పరిరక్షణ అనే వాటిద్వారా వర్ధిల్లుతుందిగాని, పశుబలంవల్లా, దౌర్జన్యంవల్లా కాదు. ఏ దేశంవారైనప్పటికీ ప్రజాబాహుళ్యాన్ని విశ్వసిస్తానుగాని, బందిపోటు దొంగల మతాను

(56-వ పేజీచూడండి)




రాజు వెడలె రవితేజము లలరగ, రాయుడు వెనువెంటను నడవగ.

'కారు లేకపోడం బాగా లేదోయ్' అన్నాడు రాజు నాలుగడుగులు వేసి.

'మరేండి. ఏం బాగు లేదు. కొనే సెయ్యండి.'

'ఏమిటి అన్న లింకా కారు కొనలేదా నేను? ప్రొడక్షను పెట్టినా కారు కొనక పోడం ఏమిటోయ్!'

'మరేండి' అన్నాడు రాయుడు ముభావంగా.

'మాబు చేస్తారేమోనని భయంగా ఉందోయ్' అని భయపడ్డాడు రాజు పెద్ద వీధిలోకి రాగానే.

'ఏమిటండీ?'

'మాబు—అదే జనం నన్ను ముట్టడించేసి ఆటోగ్రాఫులూ అవీ కావాలంటారేమోనని...వెధవది. సినిమాలో ఉంటే ఇదే చిక్కు. స్వేచ్ఛా వాయువులూ గట్రా పీల్చలేం. ఎక్కడికెళ్ళినా—''

'టాక్సీలో పోదామండి' అన్నాడు. రాయుడు హఠాత్తుగా.

'పోదాం కాని నాకు సిగ్గు సుమీ. వెధవది టాక్సీ ఎక్కి సొంత ప్రొడక్షనుకి వెళ్ళడమా. షేం షేం డ్రిల్ల అంటారు... అదే బెంగ'

'ఏం చేస్తాం కిష్టాస్ ఫాదర్ సైజువాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాట లోగడ.'

'ఇప్పుడు మనం టాక్సీ కాళ్లు పట్టుకోవాలా?'

'ఇప్పుడు అక్కర్లేదండి. దిగేటప్పుడు డబ్బుల్లేకపోతే. దానికి చాలా టైముంటుంది' అని పకపక నవ్వాడు రాయుడు.

రాజుకి నవ్వురాలేదు. ఎందుకు రాలే దన్నట్టు చూశాడు రాయుడు.

'నీకేం తెలుసోయ్ డబ్బయి పోయిన ప్రొడ్యూసరు అవస్థ. నీకు అంతా నవ్వులాటగానే ఉంటుంది మా సమస్యలు వేరు'

'ఓరి బాబోయ్' అన్నాడు రాయుడు మెల్లిగా.

ఇద్దరూ బస్టాండు దగ్గరకు చేరి టాక్సీ కోసం నిల్చున్నారు.

రాయుడు దీర్ఘాలోచనలో బోర్లా పడిపోయాడు. రాజు సిగరెట్టు ముట్టించి దిక్కులు చూస్తూ నిలబడ్డాడు. ప్రజాభిప్రాయం వినబడింది కొంచెం అసింటా.

'బ్రదర్ గోదాలోకి కొత్తగొడ్డుదిగిందంట విన్నావా?' అన్నాడు ఒక ప్రజ. అతని పేరు గురువు. కాబట్టి రెండోవాడి పేరు లఘువు అయితీరాలి.

'ఏమిటె కథ' అన్నాడు లఘువు గుడ్లు మిటకరించి గుటకలు వేస్తూ.

"ఏమి టేమిటి! మొహం చంద్రఫుల్ గొడ్డన్నమాట. పేరు రాజుట. సుద్ద క్రాకు. వాడికి పిక్చర్ ఫినిష్ కాకుండా—అమాట కొస్తే మొదలేనా పెట్టకుండా కథ దేని గురించో, ఏమిటో చెప్పాలిట. ప్రాణాలు తీసేస్తున్నాటలే అసిస్టెంటు డైరెక్టర్లవీ వాళ్ళవిని."

'ఏవిచిత్రం. నువ్వమరీబడాయి. ఎప్పుడూ ఇలాటి నీలివార్తలే మోసుకొస్తావు. బుర్రున్న వాడెవడేనా నమ్ముతాడా?' అన్నాడు లఘువు తిప్పుకుంటూ.

గురువు నిట్టూర్చాడు. 'రైటే బ్రదర్. నమ్మడం కష్టమే. కాని అలా లఘువుగా కొట్టెయ్యకు. కావాలంటే ఇంకోటి చెబుతాను. రిహార్సలు వెయ్యమంటాట్ట. ఇది చాలా?"

'హరహరా' అన్నాడు లఘువు చెవులు మూసుకుని.

'రాయుడూ విన్నావా?'

'విన్నా.'

'మన్నా?'

'ఔనన్నా.'

'అన్నన్నా. ఎంత చిత్రం. ఎలా తెలిసింది అప్పుడే? ఇప్పుడేగా? మనం అనుకున్నాం.'

'డేగా లేదు కాకీ లేదు సార్. దాని సంగతి అంతే. పుకార్ల స్పీడు అలాగే ఉంటుంది.

రోడ్డుమీద అటూ ఇటూపోయే కార్లలో వాళ్ళంతా, వీళ్ళవంకే చూసి ఫక్కున నవ్వుకుంటున్నారు.

'ఊరంతా తెలిసిపోయిందే.'

'అటుడికినటుడికి పోతోంది.'

'హా చంద్రమతీ'

'ఏదిగతీ! బైదిబై ఎవరావిడ, యుద్రసేమి'

* * *

'టాక్సీ రాలేదు. బస్సెక్కుదామండి.'

'క్యానీ'

'కానీ ఏమటిమళ్ళీ. ఏం సందేహం?'

'అబ్బే పరే కానిమ్మన్నాను.'

'ఎందుకు మీ దగ్గర లేదా కాన్లు.'

'నీకొక్కవాలా?'

'నాకొక్కడు. మీకొక్కవాలేమోనని కానిమ్మంటున్నాగదా.'

'అదా. మరీ బడాయి నువ్వు. ఏం తెలీనట్టే.'

'ఒట్టు.'

'బస్సొచ్చింది. ఎక్కు.'

* * *

'ఇక్కడే దిగండి. ఈకాణ్ణుంచి, అర మైలు నడవాలి.'

'వాలి అంటే గుర్తొచ్చింది. వాలి సుగ్రీవ పట్టెట్టు ఎలా ఉంటుందోయ్ రాయుడూ?'

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

'బ్రహ్మాండంగా ఉంటుందండి. కాని చాలా ఖర్చవుతుంది. సెట్టింగులూ, కాస్ట్యూములూ, పెద్ద ఆర్టిస్టులూ కావాలి.'

'దానికేముంది. వాలికీ, వాడి ఆలికీ బాక్సాఫీస్ స్టార్లని పెడదాం. మిగతా రోల్సుకి, చిన్న వాళ్ళని, కొత్త వాళ్ళనీ తీసుకుందాం. రోలుకో వంద ఏభైల్ను పుచ్చుకోవచ్చు. బ్లాక్ లో 50 అడుగుదాం' అన్నాడు రాజు ఉత్సాహంగా.

'నాకు ఆశ్చర్యంలో ఏం మాట్లాడ్డానికీ తోచటం లేదుసార్. అంతేక నేనేం మాటాన్ను. మీరు చెప్పకపోండి' అన్నాడు రాయుడు ఆశ్చర్యంతో.

రాజా సంబరపడిపోయాడు. 'చెప్పేందు కేముంది. మనం ఎంతసేపూ, ఆర్టుకి అన్యాయం చెయ్యకుండా, జాగర్తగా వాలి కథను వాల్మీకి రాసినటు తీసిపారేస్తే, పిక్చరులో సెట్లు, గిట్లూ, స్టార్లూ గీర్లూ లేకపోయినా, చద్వినటూ హిట్టయి ఊరుకుంటుంది. సింపుల్' అన్నాడు.

రాయుడు ఈసారి తేలుకుట్టినట్టు తుళ్లి పడ్డాడు.

'వాట్ సార్. మీరు మరీ బొత్తిగా ఇంత అమాయకులు అనుకోలేదు. వాల్మీకివాళ్లు ఫిలిం కథలకన్న డ్రామెటిక్ రాస్తారని వాదించే గుంపులో కలిసిపోతే, మీకు భవిష్యత్తు లేదు. అసలు వాళ్ళకి ట్రీటుమెంటూ అది ఎలా తెలుస్తుందండి. అప్పటికి ఫ్రాయిడ్ పుట్టనే లేదు. సెకాలజీ అనేమాటే వినుండరువాళ్లు. అదే తెలీపోతే, ట్రీటుమెంటేం చేస్తారు. వాళ్ళని తప్పట్టటం లేదుసుమండి. మీకు స్టుడియోలో ఇద్దరు ముగ్గుర్ని పరిచయం చేస్తాను. వాళ్ళు చెప్తారు మీకు వాలికథ ఎలా తియ్యాలో. అంతేగాని సొంతంగా మీరు ఇందులో దిక్కండి. దబ్బతినేస్తారు. ఇదేం ఆర్టా మజాకానా. ఇలా అన్నానని కోప్పడకండి. మీతమ్ముళ్ళాంటివాణ్ని. మీరు నన్ను పైకితేవాలి అసలు ఐ లవ్ ఆర్ట్. వెధవది ఆదేమిటో చిన్నప్పట్నుంచీ అంతేనుట నేను. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందనుకో వచ్చునుకోండి. అయితేమటుకు నేను మరీ అన్యాయంట. చదవరా నాయనా అని మా నాయనా ఆయన నాయనా జాయింటుగా గోలెతినా, నేను ఆర్టోయ్ బాబోయ్ ఆర్టోయ్ అని పొద్దస్తమానమూ ఒకాటే గోలట. దానికోసమే మావూళ్లో నిరుద్యోగం, ఈ వూళ్ళో మా ఫ్రెండు రాలీ సైకిలూ

త్యాగం చేసి, ఇలా బతికున్నాను. నాకేడబ్బుంటేనా, పెద్ద డైరెక్టర్నయిపోయేవాణ్ణి" అన్నాడు రాయడు ఆయాసపడుతూ.

'మరేం ఫరవాలేదు ఇప్పుడౌదు గాని 'వాలి సుగ్రీవ' పిక్చరు నీకే ఇస్తాను. డోంట్ వరీ. ఆర్టంటే పడిచచ్చేవాళ్ళంటే పడిచచ్చే వాళ్ళలో నేనొక్కణ్ణి."

'బావుందండి మీరు ఒక్కరు కాపోతే ఇద్దరెలా అవుతారు. వచ్చేశామండి. స్టుడియోకి ఇక్కడ ఇద్దరు ముగ్గుర్ని పరిచయం చేస్తాను' అన్నాడు రాయడు.

*  *  *

'అయామే గ్రేట్ షోమన్' అన్నాడు ఇద్దరు ముగ్గురు.

'నాదిపూర్తిగా ఎంటర్టెయిన్మెంటాలిటీ అండి ప్రజల పాలిలా అర్థణాకి, మొహం మొత్తిపోయి వేను తీపెక్కేదాకా ఎంటర్టెయిన్మెంటు పెట్టేస్తాను. అయామే జీనియస్ అని, నా అసిస్టెంట్లూ, బంట్లూ అంతా అంటారు. నా వెనకే కాదు ఎదట కూడా ఆ ముక్కే నిర్భయంగా చెప్పేస్తారు. ఎండ్ ఐ లైక్ ఫ్రాంక్నెస్. నిర్మొహమాటంగా కుండ బద్దలు కొటినట్లు నిజం మాట్లాడే వాళ్లంటే ప్రాణం పెడతాను.' అన్నాడు ఇద్దరు ముగ్గురు ఇంకో క్షణం ఆగి.

'సరే అయితే మీరు వాలిసుగ్రీవ ఎంటర్టెయిన్మెంటాలిటగా ఫిలిం తీస్తారా' అని నిర్మొహమాటంగా మొహం పెట్టి అడిగేశాడు రాజు.

'తీస్తాను' అని అంతకన్న నిర్మొహమాటముగా చెప్పేశాడు ఇద్దరు ముగురు.

'నాకు నిర్మొహమాటం అంటే చాలా యిష్టం. పడిచస్తాను' అన్నాడు రాజు.

'నేనూ అంతే...మనిద్దరికీస్పిరిచువల్ గా అంటే ఆధ్యాత్మికంగా ఏకాభిప్రాయము కుదిరిందన్నమాట. ఇంక అన్ని అభిప్రాయాలూ ఒకటే. అంచేత మనము తీసే పిక్చరు—'

రాజు మెల్లిగా రాయడు వేపు జరిగి—'ఏమిటంటాడ్యూ?' అన్నాడు.

ఇద్దరు ముగ్గురు ఆ మాట విన్నాడు. విని వవ్వాడు. 'స్పేర్ టైములో—అంటే తీరిక వేళల్లో నేను అబిసీనియన్ ఫిలాసఫీ చదువుతానులెండి. అది నా హాబీ.'

'అయ్య బాబోయ్' అన్నాడు రాజు.

'ఔనండి. నేనసలే ఇంట లెక్చువల్ని. దానికితోడు మాడస్టీ జాస్తి. నాకు ట్రాజడీ మృత్యువు, చీకటి, శ్మశానం, ఆకుజోళ్ళు, చాలాయిష్టం. ఈసంగతి 'సినీమార్ పేపర్' నించి నన్ను ఇంట్రవ్యూ చెయ్యవచ్చిన అతనుకూడా చెప్పాడు. ఈఐదు సబ్జెక్టులమీద నేను డబుల్ డబుల్ వాల్యూమ్ క్యాలికో బైండు బుక్సులు రాస్తున్నాను. భవుశా బిమల్ రాయ్కి వాటిలో ఓదాన్ని, శాంతారాంకి వాటిలో ఇంకోదాన్ని, ఫిలిం తియ్యమని ఇస్తానని తెలుస్తోంది. వరల్డ్ రైట్సు నా రూములోనే ఉంటా యనుకోండి. ఇందాకనేం చెపున్నానూ?...మర్చిపోయాను. ఫర్గాట్. నాకిదో జబ్బండి. ఈ ఫర్గాటింగు. నాకు మగాపు వుందన్నమాట కూడా మర్చిపోతాను అప్పుడపుడు. హాయ్...హవ్వ... అబలింతలు—శిద్దడాస్త్రాళ్ళి కాబోలు... హాయ్'

'మీరు వాలిసుగ్రీవ తీస్తావన్నారు' అన్నాడు రాజు—దొరికిన ఛాన్సు వదలకూడదని.

'హమ్మయ్య వాలిసుగ్రీవ కదూ. యస్. అది నా స్పెషల్ సబ్జెక్టు మీరు ఎవర్నడిగినా నాదగిరకే పంపిస్తారు. ఓటోకాసులోంచే అది ఫిలిం తీస్తానవేవాణ్నట ... బాయ్. ప్రొడ్యూసరుగారు డబ్బులిస్తారు గానీ, గెట్ గుడ్ కాఫీ ఓ గోల్డ్ఫాక్ పెటెకూడా ... వాలికథలో తమాషా ఏమిటంటే, ... మీదగ్గిరో సిగరెట్టుందా ... వాడికీ రావణుడికీ ఒక కామనపోలిక ... ఏమిటది ... చార్మినారా. ఐలవిట్ నాకు బలేయిష్టం... చార్మినారుకీ, రావణుడికీ, అయి మీన్ వాలిక్కీ, పోలికేమిటంటే, — ఒక సైకాలజీ వుందండి. మీరు ఎప్పుడేనా చూశారో లేదోగాని. ఇప్పుడు రావణుడున్నాడా. చిన్నప్పట్నించీ హివాజ్ లవింగ్ దట్ గర్ల్ సీతా. ఆమాటకొస్తే పూర్వజన్మంనించీ అనాలి. అంటే, సీత ప్రీవియస్ బర్త్ అన్నమాట. ఏం. అలాంటపుడు, అతను ఎంత బాధపడతాడు! వాడూహ్యూమన్బీయింగే. మానవమాత్రుడే. వాడిలోను బ్లడ్ పరిగెడుతోంది. అయినపుడు దిస్ యంగ్ డెవిల్ ఆఫ్ రామా—ఈ రాములవారువచ్చి ఆపిల్లని చటుక్కున పెళ్లాడేశాడు. ఎం?"

"వాలికథ" అన్నాడు రాజు భయపడుతూ.

'వస్తున్నా. అయామ్ కమింగ్. ఇదంతా వాలి సైకాలజీయేగా ... అంచేత నాచురల్లీ రావణా గాట్ యాంగ్రీ ... సో, హీ స్టోల్ సీతా. ఆపిల్లని దొంగిలించాడు. వాలికేసు కూడా దాదాపు ఇంతే. దీనికి పార్లర్ గా ఉంది. ఇతనుకూడా చిన్నప్పట్నించి, రుమని లవ్ చేసి ఉండాలి. అందుకని పొలిటికల్ గా, రాజకీయంగా అల్లకల్లోలాలూ అపార్థాలూ వచ్చినపుడు, హిమేడ్ గుడ్. బ్రదర్ని తరిమేసి రుమని కాజేశాడు రాముడొచ్చినపుడు, సుగ్రీవుడు అడగానే ఎందుకు సాయం చేస్తానన్నాడు? జస్ట్ ఫర్ దిస్ రీజన్. ఇదే కారణం. తన భార్యని రావణుడు ఎత్తుకుపోయాడుగదా. అలాగే, సుగ్రీవుడివైపుని వాలి చెక్కేశాడు. అదీ మెయిన్ రీజన్. ఆబాధ తెలుసు కాబట్టే, సుగ్రీవుడికే సాయం చేశాడు. ఇంకోటి. రాముడు వాలిని చంపగానే మనం ఆసీను కట్ చేసి రావణాసురుడి సభని చూపించాలి. ఇలా ఈ బాణం తగిలి వాలి నేల కూలగానే అక్కడ రావణాసురుడి చేతిలో వైన్ గాసో ఏదో జారిపడిపోవాలన్నమాట. పెద్దబాగ్రౌండ్ మూజిక్. సిక్స్టీ డ్రమ్సూ థరీఫోర్ వైలిన్సూను. కామెరా సీతమీదకి పాన్. మళ్ళీ రావణుడిమీదకి కట్. టిల్ షాట్. క్లోజప్. 'ఏమిటి యపశకునము' అని డైలాగు. బ్రీఫ్ గా, పవర్ ఫుల్ గా. ఈ ఇన్సిడెంటు రావణుడి భవిష్యత్తుమీద ఫోర్కాస్టులాటిదన్నమాట. దీన్ని మనం బాగా ఎక్స్ప్లాయిట్ చేస్తే షాట్సు పడిపోతాయంతే. మన రామాయణం అపూర్వం, అనుత్తరం అయిపోతుంది." అని ఆగాడు ఇద్దరు ముగ్గురు రాజు మాట్లాడ్డానికి ఛాన్సు ఇచ్చి.

ఒక నిముషంలో రాజు తేలుకున్నాడు. "మరి మనం తీస్తున్నది వాలిసుగ్రీవకథకదండి. వాలి బ్రదర్ కి పోర్షన్ ఉన్నటులేదే... మీరు చెప్పేది రామాయణం ట్రీటుమెంటులావుంది."

ఇదిరుముగురు జాలిగానవ్వి, రాజు భుజం తట్టాడు. 'మరేం భయపడకండి. వాలి కథే తియ్యాలని మనకి శాసనం ఏమిటి. ఎవడా శాసించే వెధవ. డొక్క చీల్చి డోలుకట్టి ఆర్టైహాల్లో పెట్టిస్తాను. అంతగామనంతీసేది చివరికి రామాయణంగా తయారైతే పేరు మార్చేద్దాం. రామాయణం అనే పిలుద్దాం. వాటిజ్ దేర్. వాటిజ నేనేమ్. నాకు పేర్లలో నమ్మకం లేదు. అయామ్‌ది గ్రేటెస్ట్ షోమాన్ నా అసిస్టెంట్లన్నట్టు. ఆల్మోస్ట్ ఏజీనియస్. పూర్తి జీనియస్నని పబ్లికున ఒప్పేసుగోపోడానికి కారణం మాడెస్టీయే నంటే నమ్మండి. నిర్మొహమాటం అంటే ఉన్న అభిమానం కొద్దీ ఈ కాస్తేనా చెబుతున్నాను...ఇప్పుడు చూడండి. నేను వాలి కథ మొదలుపెట్టి రామాయణంలోకి జారిపోయానంటే, ఎంత పరాకో మీరే చూసుకోండి. ఎవడేనా అలాచేసాడాఅని. అసలు రామాయణానికీ వాలిసుగ్రీవులకీ ఏమైనా సంబంధం ఉందా. అదేమిటి? విశ్వైవరు? అయినా నేను పరాకున ఇందులోకి జారిపోయానంటే, జీనియసువల్ల వచ్చేనష్టం మీరు గ్రహించగలరు."

"అదేమిటిసార్ అలా అంటారు. వాలి సుగ్రీవులకి రామాయణానికి సంబంధంలేపాతే ఇంకేముందండి" అన్నాడు రాజు కొంచెం తటపటాయించి.

ఇద్దరు ముగ్గురు మళ్ళీ భళ్లున నవ్వాడు. 'అదటయ్యామాట! సంబంధం లేదంటే లేదనా. అన్నిటికీ అందరికీ ఎప్పుడూ ఏదో ఓ సంబంధం ఉంటూనే ఉంటుంది. రామా

(56 వ పేజీ చూడుడు)

# అంతర్భావాలు

శేఖరం సిగరెట్టు ముట్టించి నిలుచున్నాడు.

సిగరెట్టు పొగలు నిట్టూర్పు ఆవిరులతో కలిసి మలయమారుతంలో తేలి లీనమౌతున్నాయి. గచ్చు అరుగుల బస్సు స్టాండు గోడ కానుకున్నాడు అలసిపోయి. ఎదురుగా నిలుచున్న బాదం చెట్టు పచ్చి పండు ఆకులు రెపరెపలాడుతూ హృదయవైకల్యం కలిగించే భావాల్లా అలజడి చేస్తున్నాయి. ఏదో పనిమీద అఫ్జల్ గంజివైపు వచ్చిన శేఖరానికి ఆమె కనిపించడంతో ఎంతో ఆనందం కలిగింది స్నేహితులతో ఏదో మరచిపోయిన వస్తువు తెచ్చుకోడానికై కాలేజీలోకి వెళ్ళిన ఆమె తప్పకుండా ఆబస్సుస్టాండు దగిరికి రావచ్చనే ఆశ అతనిలో ఉదయించింది. నాలుగైదు పేటలవైపు పోయే రకరకాల బస్సులు తమ సాండుల వద్ద పందెం పరుగుకు సిద్ధమయిన యువకుల్లా నిలుచున్నాయి.

గడిచిన క్రొత్త సంవత్సర దినం నాడు అందుకున్న అభినందనల కార్డు జ్ఞప్తికి వచ్చింది. సుందరమయిన కొలనులో ఈదుతున్న బాతులతో సరసాలాడుతూ ఒయ్యారంగా కూర్చుని చూస్తున్న బొచ్చు పిల్లలు, చుట్టూ అందమయిన ప్రకృతి దృశ్యం, హృదయం మీద చెక్కిన ప్రేయసి రూపంలా నగిషీ చేసిన ఏడక్షరాల నామధేయం, ప్రేమతో ఉప్పొంగిపోయిన హృదయంలా వారపత్రిక అంత సైజులో ఆమె పంపిన అభినందల కార్డు వెనకాల ధ్వనిస్తున్న భావం ఏమిటి? తన్మయత్వం చెందాడు శేఖరం.

ప్రక్కనే వున్న పుస్తకాల షాపువైపు పచారుచేశాడు. ఏదో పుస్తకం కొనేవాడిలా రెండుపత్రికలు తిరగవేశాడు. వాలుగా దూరంగా కనిపించే ఉస్మానియా ఆస్పత్రి, హైకోర్టు, గోపురాలవైపు సాలోచనతో పరీక్షగా పరిశీలిస్తూ నిలుచున్నాడు. అర్జంటు పనిలో నిమగ్నమైనవాడిలా చేతిలోని లెదర్ బేగ్ లోని కాగితాలు పరికిస్తూ నిలుచున్నాడు.

బస్సులు బర్రుమని ధ్వని చేసుకుంటూ ఎదురుగా పోతున్నాయి. బాదం చెట్టు క్రింది చెప్పుల దుకాణంలో ఇనుప సుత్తి తోలు చెక్కలను బాదుతోంది. 'పాలిష్! బాబూ!' ఒక కుర్రాడు వెంటబడ్డాడు.

ఆమె కిలకిలలాడుతూ స్నేహితులతో వచ్చింది.

కాలరు సద్దుకుని, గొంతు సవరించుకున్నాడు శేఖరం. ఏదో మాట్లాడాలని ఆత్రుతతో.

సిగరెట్టు దమ్ములు వేగంగా వదిలేడు.

స్నేహితుల గుంపులో ఉన్న ఆ అమ్మాయితో ఎలా మాట్లాడాలో అని తటపటాయించాడు శేఖరం.

ఎదురుగా గోడమీద పర్బత్ ఫోటో కనిపించింది. సుకుమార యౌవనవతి ఒయ్యారంగా పర్బత్ గ్లాసు, సూటు వేసుకుని ఠీవిగా కూర్చుని నవ్వుతున్న ఒక యువకుడికి అందిస్తోంది. ప్రేమించిన ఆ అమ్మాయితో అటువంటి ఘట్టము తనజీవితంలో లభిస్తుందా? శేఖరం నవ్వుకున్నాడు.

స్నేహితులను విడిలించుకుని ఆ అమ్మాయి ప్రక్కగా ఏదో ఆలోచనలో నిలుచున్న శేఖరం దగ్గరకి వచ్చింది.

## పోతుకూచి సాంబశివరావు

“నమస్కారం!” ఆనందంగా ఒయ్యారంగా హాయిగా లీలగా నవ్వింది ఆమె.

శేఖరం ఉరకలెత్తే సంతోషంతో ఆమె వైపు ఎదురుగా తిరిగి మందహాసం చేశాడు.

“మీరు...” కంగారుగా ముఖం చిట్లించుకొని బాధగా చిత్రంగా చూసింది ఆమె శేఖరంవైపు.

“అవును... నేను శేఖరాన్ని!” ఆమె తొట్రుపాటు అర్థం చేసుకునే ముఖం దించుకున్నాడు శేఖరం.

“ఏమిటిది?” చేతితో ఆశ్చర్యంగా పెకలించుకున్న నోరును వొత్తుకుంది ఆమె?

శేఖరం నిర్లక్ష్యంగా నవ్వాడు.

ఒక వైపునుంచి చూస్తుంటే శేఖరం వదనం గుర్తుపట్టగలిగినా మరోవైపు కమిలిపోయి ముడతలతో, కుట్లతో, గాయపడిన కన్నుతో జిగురు మాంసపు ముద్దలా ఉన్న దవడ ఆమెలో విచిత్రమైన భావాలు కలిగించాయి. శేఖరం మొదటి పరిచయం కలిగాక అతన్ని గురించి అనేక తలపులు ఆమెలో ఉదయించి హృదయంలో ఎంతో సన్నిహితం ఏర్పడింది. పాలబుగ్గల పసిమి వదనం గుండ్రంగా తిరిగింది ఒత్తుకురులుజుట్టు గాలిలో ఆడితేలింది. అతని వదనంలో నిప్రశాంతత, ఆ ప్రశాంతతలో దాగి గుండెల్లో మండే విప్లవవంతమైన కళా చైతన్యం ఆమెను ఆకర్షించాయి. శేఖరంగురించి ఎక్కువగా విన్న ఆమెకు ఒకసభలో అతని పరిచయం కలిగింది. ప్రథమ పరిచయంలోనే శేఖరాన్ని ఆమె విపరీతంగా ఆకర్షించింది. ఆ పరస్పర హృదయగత ఆకర్షణ చిహ్నంగా తటస్థించిన క్రొత్త సంవత్సరం అభినందనల కార్డుల ద్వారా వారిని దగ్గరకు తెచ్చింది. ఒకటి రెండుసార్లు తిరువాత కలుసుకున్నా, హృదయంలో ఉప్పొంగే ఆత్మీయత, సంచలనం గొంతు నదిమి వేసేది వారిని. ఎంతో మాట్లాడాలనుకుని. ఏవో కొద్దిగా మాట్లాడుకుని, సందడిగా చుటూ తిరిగే సంఘానికి భయపడి విడిపోయేవారు. తరవాత బాధపడి యిల్లా మాట్లాడితే బాగుంటుందేమో అని ఊహాగానాల్లో తేలేవారు.

శేఖరం తన స్నేహితులు నిర్వహిస్తున్న పెద్ద చిత్రకళా ప్రదర్శనలో పాలొనాలని బొంబాయి వెళ్ళేడు ప్రదర్శన ప్రారంభించబడింది. అతని చిత్రాలు ఎంతో మంది మెచ్చుకున్నారు ఆ ఆనందంలో హుషారుగా స్నేహితులతో కలిసి సర్కసు చూడడానికి వెళ్ళాడు ఒకరోజు. గుర్రాలు పరుగెత్తాయి. దొరసానులు మొగ్గలు వేశారు. కోతులు అల్లరిచేశాయి. గంధోళిగాళ్ళు నవ్వించారు. మేజిక్ జరిగింది. ఏనుగులు ఎగిరి నమస్కారం చేశాయి. పులులు సింహాలు బోనుల్లో ఎదురుగా కనిపించాయి. ఒక పులి గాండ్రుమని అరిచింది. తొలుక్ర ఘుకుక్కుమంది. ఒక పొడుగాటి నల్లకోటు తొడుక్కున్న వానిచేతిలో ఆకొరడా చళుక్కులతో, పులి సింహాలు మెల్లిగా ఊచలకోటలో తిరుగుతున్నాయి. పులిని పడుకోబెట్టపోయాడు నిర్వాహకుడు. మళ్ళీ భయంకరంగా అరిచింది కొరడా దెబ్బకు. కొరడా దెబ్బలు ఎక్కువయ్యాయి పులి, అహంకారం పెరిగింది ఊచలకోట ద్వారం త్రోసింది. ఎదురుగా ఉన్న ప్రేక్షక జనంలోకి దూకింది. శేఖరం పులి పంజా దెబ్బకు ఆహుతి అయ్యాడు. దవడ మీది మాంసం ఊడివచ్చింది. కన్ను గాయపడింది. జనం గాభరాతో గందరగోళంగా పరుగెత్తారు. మరి కొందరిని పులి గోళ్ళతో చీరింది. రక్తాలు కారాయి హాహాకారాలు నిండేయి. బరువైన కంబళీ పులిమీద విసిరాడు. నిర్వాహకుడు. పులిని చాకచక్యంగా బోనులోకి దూర్చాడు.

శేఖరం స్నేహితులు గబగబ అతన్ని హాస్పిటలుకు చేర్చారు. ఆస్పత్రిలో నెల్లాళ్ళు గడిచాయి. ముఖంలో ఒక భాగం పూర్తిగా అందవికారమైపోయింది. ఒక కన్ను పూర్తిగా గాయపడింది. విధి వైపరీత్యానికి విలపించాడు శేఖరం. అమితమైన బాధతో హృదయం కంపిస్తేగాని తన కళాత్మక జీవితానికి నిండురాదేమో అనుకున్నాడు. తన జీవితంలోని యీ అంగవైకల్యం తలచుకుని శేఖరం కుమిలిపోయేడు.

ఆరునెలలు గడిచాయి. శేఖరం ఆమెను నిత్యం తలుచుకున్నా, తన అందవికారం తన జీవిత సుఖానికే భంగం కలిగిసుందని నమ్మాడు శేఖరం. ఆమె కాలేజీవైపు రావడం మానేశాడు. అయినా మితిమీరిన తలపులు పెరిగి, హృదయంలో పెరిగే కోరిక అణచుకోలేక ఆమె కాలేజీవైపు ప్రయాణమయ్యాడు. ఆమె కనిపించింది. ఆనందపడ్డాడు. అంతలోనే ఆవేశంతో బాధపడ్డాడు. ఆమె వదనంలోని భావ పరివర్తన చూసి.

కాని మళ్ళీ నిర్లక్ష్యంగా నవ్వాడు శేఖరం.

ఆ అందవికారియైన శేఖరంతో ఆత్రుతగా పరుగెత్తుకొచ్చి మాట్లాడే ఆమెను చూసి ఆమె స్నేహితులు నవ్వుకుంటున్నారు. వారి కలకలలు ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయి. ఆ హేళనలు హృదయాన్ని తొల్చినట్లనిపించాయి. ఆమె కొయ్యబారిపోయి ఆశ్చర్యంతో, సిగుతో, తనమీదే తనకే అసహ్యం కలిగి, వెనుకంజవేసింది. కాని తక్షణం వెళ్ళిపోతే బాగుండదని, తన్నెరుగని మనిషి ఎవరో ప్రక్కను నిలుచున్నట్లు ముఖం ప్రక్కకు త్రిప్పుకుని తన స్నేహితులను దగ్గరికి పిలిచింది.

"ఇంకా చదువుతున్నారా?" శేఖరం అడిగాడు ఏదో పలకరించాలనే సరదాతో.

"అవునండి!"

"క్రిందటేడే మీ చదువు అయిపోవాలిగా!"

శేఖరం సంభాషణ పొడిగించాడు.

"పరీక్ష పోయింది!"

ఆమె వదనం విచారంతో తొణికింది.

పరీక్ష ఎందుకు పోయింది? బొంబాయి వెళ్లాక శేఖరం మళ్ళీ కనిపించలేదు. అతన్ని కలుసుకోవాలని ఆమె తపించింది. ఏవో పనులు మిషగా పెట్టుకుని బజారుల్లో తిరిగింది అతను కనిపిస్తాడేమో అని. ఎక్కడైనా సభలైతే, ఆహ్వానితురాల్లా వెళ్ళి కూర్చునేది. తన పుట్టినరోజు తేనీటివిందుకు రమ్మని ఆహ్వానించింది. శేఖరం కనిపించలేదు. పరీక్షలముందు ఏర్పడిన మనో సంచలనం అనురాగ పరంపర ఆమెను వికలం చేసింది. ఆ భావాల వేగంలో, మనసు చెదిరి పరీక్ష చదువులమీద ధ్యాన్నం తప్పింది. పరీక్షలో ఏది రాద్దామన్నా సరిగా జ్ఞాపకం రాలేదు. పరీక్షలో తప్పింది.

శేఖరాన్ని చూడగానే ఆమెలో కొంత పశ్చాత్తాపం కలిగింది. తన పూర్వ మనో వైకల్యానికి అంత బాధపడి, అంత ఆలోచించి, పరీక్ష పోగొట్టుకున్నది ఎవరికోసం? ఒక కురూపికోసం! తనమీద తనకు కోపం వచ్చింది ఆమెకు, ఆకోపంలో అతని అందవికార కారణమైనా అడగాలనిపించలేదు ఆమెకు.

శేఖరం ఆమెను దినాలుగా పరికించాడు. ఆమెముఖం ప్రక్కకుత్రిప్పుకు తనస్నేహితులతో సంభాషణలో లీనమైపోయింది. ప్రక్కన శేఖరం ఉన్న సంగతి పూర్తిగా మరిచిపోయినట్లు;

ఆమె క్రొత్తగాపెట్టుకున్న కళ్ళద్దాలు ఆమెచూపుల్లో నూత్నత్వం ఏర్పరిచాయని పించింది.

సికింద్రాబాదు స్టేషనుపోయే బస్సువచ్చి ఆగింది.

ఆమె స్నేహితులందరితో కలిసి బస్సు

ఎక్కింది. ప్రక్కనఉన్నా శేఖరంనుంచి పిలవుకూడా తీసుకోలేదు.

చేతిలోని సిగరెట్టు ఆఖరయి శేఖరం వ్రేలు కాల్చింది

శేఖరం ఒక నిమిషం ఆలోచించాడు ఆమెలోని పరివరన అసహజంగా అతనికి తట్టకపోయినా, ఊహించినట్లే జరిగినందుకు అతని మనస్సు బాధతో కుమిలిపోయి విచారించాడు ఆమెను ఏమిటో యింకా చూడా అనిపించింది ఆత్మీయత కలిగిన మనుష్యులు, పలకరించపోయినా, నేత్రాలతో చూచుకోడంలో కొంత హృదయ సంతృప్తి ఉందని నిశ్చయించుకున్నాడు శేఖరం. ఆమె తనగురించి మనస్సు మార్చుకోవడం తథ్యమయినా, తాను ఆమెగురించి ఆలోచనలు మార్చుకోవడం కష్టమనిపించింది.

ఆమె బస్సు దిగేవరకైనా చూడాలనే కుతూహలంతో బస్సు ఎక్కాడు శేఖరం.

తన ఎదురుగా సీటులో అందవికారంతో కూర్చున్న శేఖరాన్నిచూసి ఆమె స్నేహితులు తమలో వ్యంగ్యంగా నవ్వుకున్నారు.

ఆమె కుపితురాలై స్నేహితుల హేళన భరించలేకపోయింది. ఎవరో రాక్షసుడు తన్ను వెన్నంటినట్టు బాధపడింది ఏదో బాధతో తల తిరిగినట్లయింది. శేఖరం మాత్రం వారినుంచి తప్పించుకోవాలనిపించింది. అతను ఆసక్తితో ఆమెవైపు చూడడం ఆమెకు చిన్నతనమనిపించింది.

హఠాత్తుగా లేచి స్నేహితులతో సైగా చెప్పకుండా, ఆమె బస్సు దిగిపోయింది ఆమె తెల్ల సిల్కుచీర శరీరంమీద మేఘంలా కదలింది. మబ్బుల్లో చంద్రబింబంలా ఆమె అదృశ్యమయింది

శేఖరం ఆమె మనోభావాలు అర్థం చేసుకున్నాడు. ఆమె తన హృదయాంతరంలో చూపే అసహ్యత శేఖరంకు ఆవేదన కలిగించింది ఆ ఆవేదన శరీరాన్ని కలతపెట్టింది కన్నీటికొలకుల్లో వేడి బాష్పాలు రెండు నిండాయి బస్సు కిటికీఅద్దంవైపు మొహం పెట్టుకుని జేబురుమాలుతో కళ్లు తుడుచుకున్నాడు.

బస్సు వేగంగా హుస్సేన్‌సాగర్ కంతెవ మీద వడిచింది.

పడవలు రెండు నిర్మల మైన నీటిలో పచారుచేస్తున్నాయి. దూరాన కొండలమీద అల్లుకున్న చెట్లగుంపుల రంగు పూవుల సుందరదృశ్యం ప్రశాంతంగా కనిపించింది.

అటువంటి సుందరదృశ్యంతో కూడిన అభినందనలకొర్కు యీఏడుకూడా తప్పక వస్తుందని శేఖరం కలలుగన్నాడు, ఒకనాడు ఈ కంతెనమీద బెంచీపై కూర్చుని. కాని అది అసంభవమనిపించింది.

ప్రకృతిలోని సౌందర్యం అంతర్భాగంలో ఏవగించుకునే కురూపవస్తుజాలం, కుళ్ళుదుర్గంధంకూడా ఉంటుందని అర్థంచేసుకున్నాడు శేఖరం. ఋతువుల మార్పుతో వాతావరణం మారేటట్లు, వాతావరణం మార్పులో జీవితంకూడా నిర్మోహమాటంగా రంగులు మారిపోతుందనిపించింది శేఖరానికి.

వీధిలో రిక్షామువ్వలశబ్దం వినిపించింది. శేఖరం కంటిముందు మెదిలింది ఆమె బస్సుదిగి అవమానించబడిన అహంభావంతో ముఖం చిట్లించుకుని రిక్షాలో పోతున్నట్లు. శేఖరం ఒక నిట్టూర్పువిడిచాడు. ★



"ఇవ్వై విదుందు"—ప్రతి శుక్రవారము రేడియో సిలోన్ 41.72 మీటర్ల మీద సాయంత్రం 6-30 నుండి 6-45 వరకు విని ఆనందించండి.



# విధి విధానమ్

(నాటిక)

కొంపెల్ల మాణిక్యాంబ



[రంగము 1]

[సమయము: సాయంత్రము. దృశ్యము: రోడ్డు పక్కని పెద్ద మేడ కనిపిస్తూంటుంది. మేడకి చుట్టూతా పువ్వులతోటుంటుంది. రోడ్డు మీంచి ఒక హైస్కూల్లో చదువుకునే అమ్మాయి పుస్తకాలు పుచ్చుకుని వస్తూంటుంది. ఆ అమ్మాయికి 18 సంవత్సరాల వయస్సుంటుంది. అందంగావుంటుంది. చురుకైంది. తెలివైందే కాని, ఎదటివారితో మాట్లాడేటప్పుడు ఎక్కువ ఆలోచన లేకుండా మాట్లాడేస్తుంది. పువ్వులతోట సమీపానికొచ్చేటప్పటికి చప్పట్లు వినిపిస్తాయి. తలెత్తి నాలుగువైపులకీ చూస్తుంది. మేడమీద కిటికీలోంచి ఒక అమ్మాయి చెయ్యూపి రమ్మని పిలుస్తుంది. రోడ్డుమీద అమ్మాయి సందేహంగా చూసి, తర్వాత వస్తున్నానన్నట్టు తలూపి, పువ్వులతోట దాటి ఇంట్లోకి వెడుతుంది.

ఆ ఇంటి ముందరి భాగంలో నే వుంది పెద్ద హాలు. హాల్లో 7, 8 కుర్చీలుంటాయి. ఒక పెద్ద టేబులుంటుంది. గోడలకి రెండు పెద్ద బుక్ షెల్ఫులుంటాయి. హాలు శుభ్రంగావుంటుంది. కాని, నీటుగావుండదు. హైస్కూలమ్మాయి లోపలకొచ్చేసరికి, మేడమీంచి పిల్చిన అమ్మాయికూడా హాల్లోకొచ్చింది. వయస్సు 20 సం. లు దాటుంటుంది. చాయ రంగులో చూడ్డానికి బాగానే వుంటుంది. మంచి తెలివైంది. నెమ్మదయినది.]

హై. అమ్మాయి: మీరేనాండీ పిలిచారు? (అంతలో జ్ఞాపకం వచ్చి) మీ పేరు రాజేశ్వరాండీ?

రా: అవునండీ. నా పేరు రాజేశ్వరి. మీ పేరేమిటో అడగవచ్చునా? (ఒక కుర్చీ ముందరికి లాగి) ఇల్లా కూర్చోండి. మీరీ వూరు కొత్తగా వచ్చేరుట కదూ? (ఇద్దరూ చెరో కుర్చీలోనూ కూర్చుంటారు.) మా చెల్లెళ్ళుకూడా హైస్కూల్లో చదువుతున్నారులెండి. వాళ్ళు స్తమానం మిమ్మల్ని గురించి మాట్లాడుతూంటారు. మిమ్మల్ని ఒకసారి కలుసుకుంటే బాగుండుననిపించేది. ఈ వేళ మీరు రోడ్డుమీదనుంచి వెడుతూంటే పిలవకుండా వుండలేక పోయాను. అల్లా పిల్చినందుకు నన్ను క్షమిస్తారా?

హై. అ.: అబ్బే దానికేంలెండి. మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకూ సంతోషంగానే వుంది. ఆమాటకొస్తే మిమ్మల్ని కలుసుకునేందుకు నేనూ ఎంతో కుతూహలపడుతున్నాను. మా ఇరుగు—పొరుగు వాళ్ళు మిమ్మల్ని గురించి తప్పితే ఇంకేం మాట్లాడరు.

రా: (ఆశ్చర్యంగా) నన్ను గురించా? ఏం మాట్లాడతారండీ? (అంత ఆతృత చూపించడం బాగుండదనిపించి) అన్నట్టు మీ పేరేమిటన్నారూ?

హై. అ.: నా పేరు సుమిత్రండీ, మీకు. మీకంటే మీకే కాదనుకోండి-మా ఇంట్లో వాళ్ళకి తప్ప విడిచి, మిగతావాళ్ళందరికీనూ. నా పేరసలు బాపమ్మ. అందుచేత నే నాకు నచ్చినపేరు సుమిత్రగా మార్చుకుందుకు అవకాశం కలిగింది.

రా: సుమిత్ర. మీకు మల్లే పేరుకూడా చాలా, బాగుంది. అయితే, మీకు ఈ వూరూ, స్కూలూ అన్నీ బాగున్నాయాండీ?

సు: ఏదో వున్నాయి. నాకింతకంటే పట్నాల్లో వుండడం ఇష్టం. ఇక్కడంతా అనాగరికపు మూక. ఉత్త కబుర్ల పోగులు. చాలామందికి అక్షరజ్ఞానమైనా లేదు.

రా: అయితే, అస్తమానం ఏం విషయాలు మాట్లాడుతారంటారు?

సు: ఓ. దానికేంవుంది, వూరు పెరుగుతోంది.

రా: అంటే మీ ఉద్దేశం వూళ్ళోవాళ్ళ కష్ట-సుఖాలన్నీ వారికే నంటారా?

సు: కాక? చదువూ, సంధ్యా, పనీ-పాటలు లేని వీళ్ళందరికీ రోజు గడిచేదెల్లాగా? ఊళ్ళోవాళ్ళందర్నీ ఆడిపోసుకుని వాళ్ళు రోజు గడుపుకుంటారు.

రా: ఆడిపోసుకోవడం అంటున్నారేం?

సు. లేకపోతే వాళ్ళు తెచ్చే వార్తలన్నీ నిజాలంటారా?

రా: (పెదవి విరిచి) ఏమో, నాకంటే మీకే బాగా తెలిసుండాలి.

సు: (కుర్చీలోంచి లేచి) నే వెళ్ళి వస్తానండీ, నా కోసం మా అమ్మ ఎదురు చూస్తూంటుంది. మరోసారి తీరుబడిగా కలుసుకుందాం.

రా: తప్పకుండా. (కుర్చీలోంచి లేస్తుంది) మీతో పరిచయం చేసుకున్నందుకు చాలా సంతోషంగావుంది.

[సుమిత్ర వీధిలోకి వెళ్ళిపోతుంది. ఇంతలో రాజేశ్వరి తండ్రి రామారావుగారు వచ్చి ఒక కుర్చీలో కూర్చుని ఒక వుత్తరం చదువుకుంటారు. రామారావుగారంటే పిల్లలకి భయభక్తులెక్కువ. పనివుంటేతప్ప అంతెక్కువగా ఎవరూ మాట్లాడరు. రాజేశ్వరి లోపలకెళ్ళిపోవడానికి ఇటుదిరిగి, ఆగి తండ్రిగారికేసి చూస్తుంది.]

రా: నాన్నగారండీ, ఆ వుత్తరం అన్నయ్యదగ్గిర నుంచాండీ?

రామ: అవును. (తిరిగి వుత్తరం చదువుకుంటారు. విశేషాలు చెప్తారని రాజేశ్వరి అక్కడే నిల్చునుంటుంది. రామారావుగారు




"చిలుక పలుకు"

—రాధేమోహన్, గుంటూరు]

# ★ విధివిధానమ్ ★

పుస్తకం చదివి మడిచేసి, రాజేశ్వరికేసి చూస్తూ) రెండ్రోజుల్లో అన్నయ్యొస్తున్నాడు. ఎవడో స్నేహితుణ్ణి కూడా వెంటబెట్టుకొస్తున్నాడుట. వీడికిదో దురలవాటు. మనవారికి శ్రమ కలిగించడం వాడికిష్టం లేదుట. అందుచేత వాళ్లిద్దరూ వాడి గదిలోనే వుంటారుట. అయితే, ఇంక మనకేం శ్రమ లేనట్టు!

రా: ఎప్పుడొస్తున్నాడండీ?

రావు: ఊఁ?...రేపు. వెళ్ళి మీ అమ్మనొకసారిలా పిలుస్తావా, మాట్లాడాలి.

రా: ఊఁ. (లోపలికెళ్లిపోతుంది.)

[తెర పడిపోతుంది.]

* * *

[రంగము 2:]

[రెండు వారాల తర్వాత అదే హాలులో రాజేశ్వరీ, సుమిత్రా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూంటారు.]

రా: మీ పరిచయం ధర్మమా అని చాలా విషయాలు తెల్సుకున్నాను. అయితే, మీకు స్కూలు పుస్తకాలు వదిలేసి ఇవన్నీ చదవడానికెక్కడ తీరుబడి వుంటుందండీ? నేను స్కూల్లో చదివే రోజుల్లో, రోజంతా వాట్లతోటే......

సు: ఆఁ. స్కూలు పుస్తకాలు రోజంతా ఎవళ్ళు చదువుతారండీ ఈ రోజుల్లో! ఇంతకీ అంత చదివితే వచ్చింది మర్చిపోయి, ముందు చదివేది అర్థంకాకుండా పోతుంది. స్కూలు పుస్తకాలు విసుగ్గా తోస్తే సరి అవో దిక్కున పడేసి, ఏ చలం పుస్తకాలో తీస్తాను.

రా: ఎంత అదృష్టమండీ, స్కూలు, చదువుతోటే జనరల్ నాలెడ్జి కూడా సంపాదించడం! మా నాన్నగారికి సంస్కృతమంటే ఇష్టం అందుచేత, నేను మీడియమ్, తెలుగు మానేసి సంస్కృతం తీసుకున్నాను. సంస్కృతం రాలేదు కాని, తెలుగులో ప్రవేశం లేకుండా పోయింది.

సు: (ఉత్సాహంగా) అందుకు మీకేం విచారించకండి. మీకు కావల్సిన ఇన్ఫర్మేషన్ నేనిస్తాను. మీకు చలం పుస్తకాలు సరిపడవు కాని......

రా: (మధ్యలో ఆపుతూ) అలా అనకండి చలంగారి అభిప్రాయంతో ఏకీభవించని వారు కూడా వారి పుస్తకాలు చదివి ఆనందించగలరు. అదే వారి రచనల్లో వుండే ఆకర్షణ!

సు: (అవమానం జరిగినట్టుగా) ఐతే మీరు చదివేరన్నమాట! తెలుగులో ప్రవేశం లేదంటే అసలే లేదేమో అనుకున్నాను.

రా: తెలుగంటే నా ఉద్దేశ్యం ఒక్క చలంగారి పుస్తకాలనే కాదు. ప్రబంధాలు, ఖండ కావ్యాలు, గేయాలు వగైరాలు.

సు: ఓ అదా మీ ఉద్దేశం. అన్నీ ఎవరూ ఒక్కసారి ఆపోశన పుచ్చుకోలేరు.

రా: అయితే మీరేదైనా లైబ్రరీలో చేరేరా?

సు: స్కూల్లో లైబ్రరీలో పుస్తకాలు తీసుకుంటూంటాను. కాని, అదేమంత లెక్కలేదు. నా ఫ్రెండ్సెవరిదగ్గరన్నా మంచి పుస్తకం కనిపించిందంటే చాలు, అది తెచ్చి చదివేస్తానన్నమాటే!

రా: ఒకవేళ వారివ్వకపోతే?

సు: (బడాయిగా) పెద్దలు చెప్పిన చతురోపాయాలున్నాయి కదూ, వాట్లనుపయోగించుకుని తెచ్చుకు చదివేస్తా.

రా: (నవ్వుతూ) మీరిప్పటి కాలానిక్కి బాగా సరిపడతారు.

సు: (దృఢనిశ్చయంతో) ఏ కాలానికి ఎవరేనా సరిపడొచ్చు, కాలాన్ని తమ కనుగుణంగా తిప్పుకోడం తెలిస్తే; కాలానికి లొంగిపోతే ఏ కాలమైనా వెగటుగానే వుంటుంది. అది సరే కాని, మిమ్మల్నో

ప్రశ్నడగాలనిపిస్తోంది. సమాధానం మీకిష్టం లేకపోతే చెప్పొద్దు. మీరు పెళ్ళిచేసుకో దల్చుకో లేదుటకదూ ?

రా: (విర్విణ్ణురాలై) నేనా ? అల్లాని ఎవరన్నారు? హిందూ సాంప్రదాయంలో స్త్రీలు పెళ్ళిచేసుకోవడం చేసుకోకపోవడం అని రెండు పద్ధతుల్లేవే! పుట్టిన ప్రతీ ఆడపిల్లకీ పెళ్ళయితీరాలి కదా!

సు: (ఉత్సాహం దెబ్బతిన్నట్టుగా) అదే వచ్చె మాటలెండి. ఈరోజుల్లో ఆడపిల్లలు పెళ్లి చెసుకోననిబోలెడంత పేచీపెడుతున్నారు. చదువుకున్న వాళ్ళూ, భాగ్యవంతులఇంట్లో పుట్టినవాళ్ళూ ఏమన్నా చాలావరకూ చెల్లితీరతాయి కదా! ఇంతవరకూ మీకు పెళ్ళికాకపోతే, జనం అల్లా అనుకుంటూంటే విని, నిజమే నేమోనని అడిగేను.

రా: మీ ఇరుగు—పొరుగువారు అస్తమానం నన్నుగురించే మాట్లాడుతూంటారన్నారు; ఇటువంటివేనా ? (దయగా) ధనవంతుల ఇంట్లో పుట్టిన ఆడపిల్లలమీద మీకు చాలా దురభిప్రాయాలున్నాయండీ. సినీమాల్లో చూసి, పుస్తకాల్లో చదివి మీరు అపోహపడుతున్నారు. వాట్లకీ, నిజజీవితానికీ ఎక్కడా సంబంధంలేదు. నేను మా తలితండ్రులకి ఒక్కతెనే గారాబు బిడని కానండి. నాముందూ-వెనకా చాలామంది పిల్లలున్నారు. మా నాన్నగారిముందు నిలబడి మాట్లడ్డానికే మాకెవరికీ ధైర్యం వుండెదు, ఒక్క మా అన్నయ్యకి తప్ప.

సు: (ఆలోచనగా) అయితే ఒకవిషయం అడగవలసొస్తోంది-భాగ్యవంతులు; కట్నాల బాధలు మీకుండవుకదా, మరి మీరింతవరకూ పెళ్ళెందుకు చేసుకోలేదూ ?

రా: (ఆశ్చర్యంగా) నేనా ? నేనెల్లా చేసుకుంటానండీ? అది తల్లిదండ్రులు చెయ్యాలసిన పనికదా?

సు: (నిరుత్సాహంగా) ఊఁహుఁ.

రా: మీవూహాలన్నీ చెదరగొట్టేస్తున్నానుకుంటా. అందుకు విచారిస్తున్నా. కాని మీ వూహాలు-అపోహాలు-కనక వాటిని చెరిపేసి, ఆ స్థానంలో నిజాల్ని ప్రవేశపెటడం నయం. మీకోమాట చెప్పనా? మా నాన్నగార్కి నచ్చినవరుడు దొరికితే-అంటే, ఈ అబ్బాయికి మా అమ్మాయి సరిపడుతుంది అని తోస్తే-నా పెళ్ళి చేసేస్తారు. నాకు నచ్చడం, నచ్చకపోవడం ఏమీ అడగరు. నిజానికి, మా నాన్నగారు ఎన్నికచేసిన సంబంధం మీద, నాకేం అభ్యంతరం వుండదు కూడానూ. ఇంక పెళ్ళైన తర్వాతంటారా నాకు దొరికిన భర్త ఎటువంటివారైనా, వారిని సంతోషపెట్టి, నేను సంతోషంగా గడపడవేఁ నా ఆశయం. నాకూ అందరి స్త్రీలకిమల్లే అన్ని కోరికలూ వున్నాయి.

సు: (దీర్ఘంగా నిట్టూర్చి) నేను గొప్పగా భావించే ఆశయాలు వట్టి వూహాలయి పోయాయి! మీరు నిజంగా నా వూహాల్ని చెదరగొట్టేశారండీ!

రా: (శాంతంగా) నాకు తెల్సు నా విషయం, అందుకు మీరు క్షమించాలి. అసలొకప్పుడు నాకూ మీకుమల్లే లోకాన్నే లెయ్యాలనీ, కాలాన్నే మార్చెయ్యాలనీ పిచ్చికోరికలూ, వుత్సాహం వుండేవి. నా ఆశలూ, అభిప్రాయాలూ ఒకరూపం చెందకుండానే, నా ఉత్సాహాన్ని లోకం నాశనం చేసింది.

సు: (ఉత్కంఠతో) ఏమయిందేమిటండీ? ... (తమాయించుకుని) అంటే నే నడగవచ్చునా ?

రా: (నవ్వుతూ) మీరడగవచ్చును. కాని, నే సమాధానం చెప్పకపోవచ్చును.

సు: ఓహ్ ! నాకు బాగా బుద్ధి చెప్పేరు.

రా: అబ్బే లేదండి. సరదాకన్నానంతే. అప్పుడేమయిందంటే (ఆలోచనగా) నాకప్పటికి 15 సంవత్సరాల వయస్సుంటుంది. లోకం ఎంతో వింతగానూ, అందంగానూ కనిపించేది. నేను మిగతా వాళ్ళకంటే ప్రత్యేకమైనట్టనిపించేది. నాకున్న తెలివితేటలూ, విజ్ఞానం ఎవరికీ లేనటూ ఊహించుకునేదాన్ని.

సు: (మొహమాటంగా) నాకూ అలాగే వుంటుంది. నేనింకా వూహించుకుంటూనే వున్నాను. (భయంగా) ఈ అనిపించడం ఒట్టి ఊహామాత్రమే నంటారా?

రా: (నిరుత్సాహ పరచడం ఇష్టంలేక) అబ్బే, కేవ నేదీ...(ఇంతలో మేడమెట్ల మీద చప్పుడౌతుంది. ఇద్దరూ ఎదురుకుండా కనిపించే పక్కగదిలోని మేడమెట్లకేసి చూస్తారు. రాజేశ్వరి తమ్ముడు 6 సం॥రాల కుర్రాడు గోపి, రాజేశ్వరి అన్నగారి స్నేహితుడు 25 సం॥ అబ్బాయి వెంకట్రావూ, ఇద్దరూ సినీమాల్లో కత్తియుద్ధానికి మల్లే రెండు చీపురుపుల్లలతో యుద్ధంచేసుకుంటూ వస్తారు. గోపి చటుక్కున నేలమీద పడుక్కుని యుద్ధం చెస్తూ, లేచేసి కుర్చీ యెక్కి చేస్తాడు. అంతలో పుల్ల విరిగిపోతుంది.)

గో: (ఆత్రంగా) ఇంకో రెండు పుల్లలు తేనాండీ?

రా: (కోపంగా) ఏమిట్రా అదీ? ఎవరు పడితే వారితో టేనా ఇంక నీకత్తి యుద్ధం!

గో: మరి మీరెవళ్ళూ చెయ్యరు కానీ, ఆయనెంచక్కా చేస్తారు.

రా: మరే, నీతో కత్తియుద్ధం చెయ్యడవేఁ పనిమాకు పోయి చదువుకో. (లాలనగా) అమ్మ తాయిలం చేయిస్తోంది తెలుసునా.

గో: తాయిల్లవ్వేం కాదు, జంతికలు. ఇదిగో కావలిస్తే (అని జేబులోంచి ఓడబ్బా తీసాడు).

రా: నాకేం అక్కర్లేదు. ఇంటోకి పో వెధవా లేకపోతే అన్నయ్యని పిలుస్తా.

గో: నాకేం భయంలేదు అసలు అన్నయ్యే నేర్పేడు నాకు.

రా: అల్లాగే అల్లాగే చెబుతూండు కబుర్లు నాన్నగారొచ్చి, నీపని అన్నయ్య పనీ కూడా చెబుతారు.

వెం: (కలగచేసుకుంటూ) మీర నవసరంగా గోపిని కేక లేస్తున్నారు...

రా: లేందడి కోతివాళ్ళని చూస్తే వాడికసలు ఒళ్ళు తెలవదు మీరు లోకువిస్తే వాడు బొత్తిగా నెత్తెక్కి పిండికొడతాడు!

వెం: అసలు నాకిష్టవేఁ నండిగోపి...

సు: నెత్తిమీద పిండి కొటించుగోవడమా? (పగలబడి నవ్వుతుంది.)

వెం: (నవ్వుతూ) ఊహుఁ మీరు నామాట పూర్తి చెయ్యనిచ్చేరుకాదు. నేనంటూన్నది అతనలరీ చెలాకీతనం నాకు నచ్చుతాయని.

గో: (ఆశగా) అయితే మళ్ళీ రెండు చీపురు పుల్లలు తేనాండీ అడుకుందాం?

వెం: ఇప్పుడు కాదు ఇప్పుడు నువ్వెళ్ళాడుకుంటే రేపునీతో ఒకగంటసేపు కత్తియుద్ధం చేస్తాను.

గో: ఒట్టు?

వెం: ఒట్టు సరే. (గోపి లోపలకెళ్ళిపోతాడు) భలే సరదా అయినవాడు. అతనితో ఆడుతూంటే నాకూ కూడా బోలెడుత్సాహమొస్తుంది.

# ★ విధివిధానమ్ ★

రా: వాడి అల్లరి కొంతమందికి చిరాకు కలిగిస్తుంది. అందుకని నాకు భయం. (సుమిత్రకేసి తిరిగి) మేడమీదకెడదాం వస్తారా? ఈ వేళ రేడియో లో ఆడవారి కార్యక్రమం వుంది విందాం?

వెం: (సందేహంగా) నేనొచ్చేసుకదాని వెళ్ళిపోవడం లేదుకదాండీ. (ప్రభాకరం వున్నాడేమోనని వచ్చానంతే. అతనలా ఎక్కడికో తీసువెడతానన్నాడు. అతనుంటే....

సు: అదేవిటండోయ్. మేవేవంత పల్లెటూరి బైతులంకాదు. మొగవాళ్ళని చూసి పారిపోవడానికి. (రాజేశ్వరికేసి తిరిగి) ఇక్కడే కూర్చుందామండీ. నేనింటికెళ్ళే వేళకూడా అవుతోంది.

రా: (అంత ఇష్టంలేనట్టుచూసి మర్యాద కోసం) సరే అయితే. ఇప్పుడే వస్తానుండండి. (లోపలకెడుతుంది)

వెం: (అలిడవెళ్ళిన వెంపుకే చూస్తూంటాడు)

సు. (అతనికేసి చూస్తూంటుంది.)

((ప్రభాకరం లోపలనుంచి హాల్లోకి వస్తాడు. ఇంచు-మించు వెంకటరావు ఈడుంటుంది. చాలా చురుకైనవాడు.)

ప్ర: నువ్వు నాకోసం చూస్తూన్నావని మా చెల్లెలు చెప్పేదాకా, నేను సినీమామాటే మర్చిపోయాను. త్వరగావెళ్ళాలి. ఎందుకో తెలుసా? ఈ సినీమా మొదట్లో ఒక అసభ్య ఘట్టంవుందిట! అది మిస్సవకూడదు.

వెం: అదిమానే మనకేం ఒరిగిందిలెద్దూ.

ప్ర: ఆనందం! అదేవిటోయ్ అంత స్వార్థం!

సు: మీరెంత పొద్దుపోయి వెళ్ళినా, మీకేం మిస్సవదులెవండి.

వెం: ఏవిటా విశేషం?

ప్ర: ఏంలేదు. ఈవూళ్ళో ఆట ప్రారంభం ప్రజలమీద ఆధారపడుంది. చాలామంది జనంవస్తే పెందలాడే ప్రారంభించేస్తారు. లేకపోతే, మారుమూలల్లోని మనమందరమూ వచ్చేదాకా ఎదురుచూస్తూనే వుంటారు. అంచేత మనంవెళ్ళి చాలామంది జనం వచ్చినట్టు హడావిడి చేసేద్దాం. (లోపలగదిలోకి చూసి) చెల్లాయ్. ఇల్లారా. (రాజేశ్వరి వస్తుంది) మేమల్లాతిరగడానికి కెడుతున్నాం. కొంచెం ఆలశ్యమవుతుందేమో ఇంటికొచ్చేసరికి.

రా: సినీమా కెడుతున్నారా?

ప్ర: అబ్బ! నీ కెందుకే ఆ గొడవంతానూ. (మెల్లిగా) ఊఁ. అదే ఉద్దేశ్యం. (గట్టిగా) ఒక స్నేహితుణ్ణి చూడ్డానికి వెడుతున్నాం. కభుర్లసందడిని రావడం కొంచెం ఆలశ్యమవచ్చు.

రా: ఆ సంగతి ముందరే తెలిస్తే, కభుర్లసందడిని పడకుండా చూసుకోరాదూ?

ప్ర: నిజంగా, నాకా విషయం ముందరిలా తెలుస్తుంది చెప్పు. అనక నాన్నగారొకవేళ నేను కనిపించలేదే వనడిగితే నువ్వు, నాన్నగారికి అలా చెబుతావని ((ప్రభాకరం, వెంకట్రావూ బయటికెళ్ళిపోతారు.)

సు: నా కింటికెళ్ళిపోయే వేళయిందండీ మీ రిందాకా అదేదో సగం-సగం చెపూ మానేశారు. అది తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా వుంది. నేనే అడుగుతూన్నందుకు మన్నించాలి. కాని, మీ రసలు మొదలెట్టకపోతే....

రా: (నవ్వుతూ) అదేం ఫరవాలేదులెండి. (ఆలోచనగా) మరే, అవి నేను ఫోర్త్‌ఫామ్ చదువుతూండే రోజులు. నాకేది పెద్దసమస్యగా తోచేదేకాదు. భలే వుత్సాహంగా వుండే వారోజులు. తెల్లారకట లేవడం, నాన్నగారి దగ్గిర పాఠాలు చెప్పించుకోడం, ఆ తర్వాత మేం అందరం కూర్చుని హోమ్ వర్క్ చేసుగోడం, స్కూలు టైమ్‌కి లేచి నీళ్ళు పోసుకుని, భోజనంచేసి స్కూలుకి పోవడం.

సు: (అసూయగా) ఎంత అదృష్టమండీ పొద్దున్నే లేచి మా అమ్మకి బోలెడు పని సాయం చేస్తేనేకాని నాకు చదువుకుందుకు కుదరదు.

రా: ఆ రోజుల్లోనే మా పాత సంస్కృతం మేష్టారు రిటైరయ్యేరు. ఆయన వెళ్ళిపోయేముందు, ఆయనకు సెన్ ఆఫ్ ఇద్దామని, స్కూలు పిల్లలంతా వుత్సాహపడ్డారు. మొగపిల్లల్లోంచి ప్రకాశం అనే అబ్బాయి నా దగ్గరకొచ్చి, ఆడపిల్లల తరఫున ప్రాతినిధ్యం వహించడానికి నాకేమన్నా అభ్యంతరం వుంటుందా, అనడిగేడు. నాకు చాలా సంతోషం వేసింది. అంతక్రితమెప్పుడూ ఇటువంటి వాటిని గురించి వినడమేకాని, చూడలేదు.

సు: మీ రప్పటికి చిన్నవారుగదా, మీకంటే పెద్దవాళ్ళు చాలామందుంటూంటే.

రా: అట్టేలేరు. సంస్కృతం చదువుకుందుకు అట్టే ఎవరూ వుండేవారుకాదు. ప్రకాశం అన్న అతడు మామావయ్య అత్తారికి దగ్గిరచుట్టం. పైగా మా నాన్నగారికున్న పేరూ, అప్పుడు నేను అన్నింటిలోనూ మంచిమార్కులు తెచ్చుకునేదాన్ని. దానా దీనా నేమో నన్నడిగుంటాడు. నేను నాన్నగార్నడిగి చెబుతానన్నాను.

సు: మీ నాన్నగారేమన్నారు?

రా: నాన్నగారొప్పుకున్నారు. అంతే కాకుండా 25 రూపాయలెట్టి వెండిపళ్ళెం కూడా కొనిచ్చారు, ఆయనకి బహుమతీ ఇవ్వడానికి. నేను మిగతా వాళ్ళు చందాలు వెయ్యగా వచ్చిన డబ్బుపెట్టి ఒక పుస్తకం కొన్నాం. ఈ సందర్భంలో నేను ప్రకాశం అన్న అబ్బాయితో తరుచు మాట్లాడవలసి వచ్చింది. మేష్టారికి సెన్డ్‌ఆఫ్ ఇచ్చేరోజు వచ్చింది. మేమందరం స్కూలు కెళ్ళేం.

సు: స్కూలంతా మహా హడావిడిగా వుండుంటుంది.

రా: అవును. ప్రకాశం అన్న అబ్బాయి వెళ్ళి మేష్టారి మెళ్ళో దండవేసి, బహుమతీ ఇచ్చి, ఆయన్ని గురించి మాట్లాడి వచ్చేశాడు. అప్పుడు నేను వెళ్ళి మేళ్ళో దండవేసి. బహుమతీ ఇచ్చి ఏదో కొంచెం మాట్లాడేను కాని, జనం చప్పట్లు తెగకొట్టేస్తున్నారు ఆగకుండా, చాలా సంతోషం, కొంచెం సిగ్గూ వేశాయి. వెనక్కి వచ్చేశాను.

సు: (ఉత్సాహంగా) అబ్బ! సినిమాలో హీరోయిన్‌లాగా జరిపించారన్నమాట! నేను కూడా వుండాల్సింది!

రా: కాని, ఆతర్వాతేమంత వుత్సాహంగా లేదు.

సు (ఆలోచనగా) కాని, ఆ తర్వాత ఏంకేంవుంది జరగడానికి?

రా: అసలు జరిగిందంతా ఆతర్వాతే. ఆ మర్నాడు ప్రొద్దుటి కార్యక్రమమంతా అయి స్కూలు కెళ్ళడానికి తయారవుతున్నా. ఇంతలో నాన్నగారొచ్చేరు. నాన్నగార్ని చూసేసరికి నాపై ప్రాణాలు పైకిపోయాయి. చీవాట్లువేశారు. నాన్నగారన్నమాటలు నాకొక్కటీ అర్థంకాలేదు. ఎక్కెక్కి ఏడిచేస్తున్నా. నా చదువునీ, స్నేహితుల్నీ తెగతిట్టి పోస్తున్నారు. అసలు మా నాన్నగారికి నేనంటే ఎంతో ఇష్టం. ఎప్పుడూ కేకలెయ్యలేదు. ఈ వేళ ఎందుకిలా వేస్తున్నారో అర్థంకాలేదు.

సు: ఎందుకు వేశారు?

రా: ఇంతలో మా అమ్మవచ్చి, నాన్నగార్ని ఊరుకోమని నన్నుతీసుకుని ఇంకో గదిలోకెళ్ళింది. అప్పుడమ్మ చెప్పింది. ఏం జరిగిందీ: మా వీధి గోడలనిండా నా పేరూ, ప్రకాశం పేరూనుట! ఇంక ఎన్నిరకాల బూతులు రాశారో చెప్పలేనంది.

సు: ఎవ్రరాశారంటారు? స్కూలు వస్రాళ్ళా?

రా: మరెంకెవరు? వాళ్ళే. నాన్నగారు స్కూలు మానిపించేస్తానన్నారు. ఇంటిదగ్గిర నుంచి స్కూలుకెళ్ళే దారంతా ఇవే. ఇంక స్కూలు గోడలమీద మాట చెప్పనే అక్కర్లేదు ఆవారం అంతా నేను స్కూలు మానేశా. ఆ ప్రకాశం అన్న అబ్బాయొచ్చి నాకు చాలా అన్యాయం జరిగిందనీ, అందు

(55-వ పేజీ చూడండి)




## 31

రోజూ యెలా జరుగుతుందనే బెంగతో పుల్లయ్య పుల్లలా అయిపోయాడు. ఓ రోజు కూలి దొరుకుతుంది. ఓ రోజు ఏమీ ఉండదు-ఒకనాడు ఓడలో సరుకులు దింపటానికి వెళ్ళాడు, రెండు బస్తాలు ఒక్కసారే మోసీయాలని వుబలాట పడ్డాడు కాని ఒక బస్తా దించేటప్పటికే ఎంతో కష్టమైంది. మరో రోజు పనిలేదు. తన బలమంతా యేమై పోయిందనిపించింది—

ఎక్కడో పని దొరుకుతుందని కాగితం రాయించి రిజిష్టరు చేయమని యెవడో చెప్పాడు. ఒకరోజంతా కష్టపడి నోరు కట్టుకొని కాగితం రాయించి రిజిష్టరు చేయిసే జబాబే రాలేదు. 'ఈ వేళ వస్తాది-రేపు వస్తాద'ని చూచి చూచి విసిగెత్తి పోయాడు. "ఏం పట్నం-తెల్లార్లేస్తే పైసా లేకపోతే జరగదు. మా వూరేనయం—యెలిపోతే బాగున్ను—ఏ కర్రలమ్మో—ఏ కాయలమ్మో బతికిపోదును- కానీ యిలాగైతే అందరూ నవ్వరా? ఉన్నూరులో బతకలేనోడు పొన్నూరులో బతికి చచ్చినాడని యిదివరకే అన్నారు. ఆలాంటోలు పుల్లలాంటి పుల్లయ్యను చూసి గేలీ సెయ్యరా? ఏదో సంపాదించి మూటకట్టి యెకరా పొలం నాదీ అని గడించానంటే...కాలు మీద కాలేసి బతికేస్తాను...ఎలాగొస్తాది - బతుకే భారమైపోనాది—కడుపే సంవత్సరం అయిపోనాది—యీ పాడు కడుపుకి తెల్లారితే పరగడు పెందుకో?"

ఇలా విలపించి గింజుకున్నాడు. ఈ విచారం ఒక జబ్బులా అంటి పెట్టుకుంది. ఒక రోజు బుట్ట పట్టుకొని బజారుకి వెళ్ళాడు. అక్కడంతా పిల్లలు ముసలమ్మలు వాళ్ళ మధ్యకు కూలికి వెళ్ళటానికి సిగ్గువేసింది. అయినా తెగించి వెళ్ళే కుర్రవాళ్ళంతా "సిగ్గు లేదా! పోతులావున్నావన్నారు" సిగ్గువేసింది. కాని ఆకలితో మలమలమాడే బదులు యేదో ఒక పని—ఏం చెయ్యడం? తన కొడుకు కంటె రెండేళ్ళు పెద్ద పిల్లలు కూడా కూలి చేసుకుంటున్నారు. అయ్యో? నా కొడుకుని యీ పని చేయనిస్తానా? వద్దు వద్దనుకున్నాడు. ఇలా నాలుగైదు రోజులు కూలికి వచ్చాడు. సాయంత్రం సరికి ఓ రోజు పది అణాలు—ఓ రోజు అర్ధ రూపాయికి టేది—ఒక్కొక్క రోజు రూపాయ పైన దొరికేది—అనాడైనా తనకు సంతోషం లేదు. కూలి డబ్బులయేం డబ్బులు—ఒకనాడు యెందరికి చేతులతో కూలిచ్చానో అనుకున్నాడు.

నీలి, యీ లేమిలోనూ చెయ్యి కట్టుకో లేదు ఒకనాడు బూచోడికి గంజిపోసింది వాడు సాధారణంగా ఎవర్నీ అడగడు—ఎవరిచ్చినా పుచ్చుకోడు — రెండు మూడు రోజుల కొకసారి యెవరింటి దగ్గరకో వెళ్ళి నిల్చుంటాడు—చాలామందికి వీడిలో ఏదో మహాత్యం వుందనే నమ్మకం వుంది—వీడికి చాలా వేదాంతం తెల్సునని కొందరు అంటారు. బూచోడొకనాడు ఇంటి యెదరకు వచ్చి అడిగాడు. నీలి తనకోసం వుంచుకున్న నాలుగు మెతుకులు, గంజీ పోసింది. త్రాగాడు నవ్వాడు — వాడేం మాటాడుతున్నాడో నీలికి అర్థం కాలేదు.

చివరకు పుల్లయ్యకు బజారులో కూలివాడుగా ఉండటం కష్టమనిపించింది. పిల్లలు వాడి వెంటపడి నానా మాటలాడేవాళ్ళు. పుల్లయ్యగడ్డాం గిరజాలను చూచి పిచ్చివాడనేవారు. తను పిచ్చివాడా? "నాగేరా గిరజాలు ... ఆ రోజుల్లో సుట్టుపట్టు వున్న యెన్ని వూళ్ళకి పేరు పడ్డాయి...!"

ఒకనాడు ఒక ముసలోడు కూలికి పిలిచాడు. ఆ గాడిద బరువు కుర్రవాడైతే మోయలేడని పుల్లయ్యను పిలిచాడు. బేరమాడలేదు. చాలాదూరం. వెంట నడుస్తూ వున్నాడు. ముసలాడు యేవో తన యింట్లో గొడవలు చెప్పుకుంటున్నాడు. పుల్లయ్యకు ఆశ్చర్యం వేసింది. ఇంత సిరిసంపదలతో వున్న మనిషికీ గొడవలున్నాయా అని! గోలువెళ్ళ మదెలతో చెప్పుకున్నట్లు చెప్పక చెప్పక తనలోనా చెప్పుకోవాలి! నే నెవ

# ★ దగాపడిన తమ్ముడు ★

రికో చెప్పుకోను—ఇంటి గుట్టు లంక చేటు అంటూ అంత పెద్దమనిషి నాలాంటి కూలోడుతో చెప్పుకుంటున్నాడే — మంచి మనిషిలాగున్నాడు! డబ్బుకి కటకటలాడుతున్నానంటాడు — మేడ స్వంతంది వుందట—కొడుకు గడిస్తున్నాడట—అంతా అబద్దాలు కాకపోతే యీ యాలకి డబ్బు కష్టమేంటి? ఒక్కొక్క ఆడపిల్లకి పదివేలుంటే కాని చెల్లరట—పదివేలే—నాకు రెండువేలుంటే బతికేద్దును! ఏంటో యెంత సెట్టుకంతగాలంటారు!—

ఊక్రొట్టూనే యిలా అనుకున్నాడు. ఒక మేడ దగ్గర చాలా జనాన్ని చూచి "అక్కడెందుకు అంతమంది మూగినారు బాబో?" అన్నాడు. కొడుకు వాళ్ళ వేపు చూపించి "అయ్యా అయ్యా" అన్నాడు.

"ఎంప్లాయిమెంటు ఆఫీసు — అక్కడ పనులిస్తారు!"

"అలాగా బాబో — యీ వూరిలో యిలాంటిదొకటి వున్నాదని నాకు యెవరూ సెప్పినారు కాదు... దినాలు బాగులేక తెలిసిందికాదు!"

"అక్కడికెళ్తే దినాలు బాగైపోవురే!" అన్నాడు కాస్త వేళాకోళంగా పులయ్య యీ మాటలు వినిపించుకోలేదు. యెంత వేగిరం తిరిగి వస్తావని పరుగు నడక సాగించాడు. ముసలాడి యింటిలో సామానులు పడవేసి యిచ్చింది మారుమాటాడకుండా తీసుకొని గబగబ తిరిగి వుద్యోగాలిచ్చే ఆఫీసుకు వచ్చాడు!

"ఎంతమంది!" అనుకున్నాడు. బుట్టకెట పెట్టి చేతులు కట్టుకొని నిల్చొని యెవర్ని అడుగుదామని చూస్తున్నాడు. చాలామంది తెల్ల తెల్లటి బట్టలు ఖరీదైన బట్ట వేసుకున్నవారున్నారు. తనలాంటి వారున్నా అందరిలోనూ తనే అసహ్యంగా వున్నాడు.

"నాకు పనిప్పించరా!" అన్నాడు ఒక మనిషినిచూసి.

వాడు చిన్న నవ్వు నవ్వి "లోపలికెళ్ళరా" అన్నాడు.

గదిలో కాలుపెట్టేసరికి బంట్రోతు "బయటికి పోవయ్యా!" అన్నాడు.

పుల్లయ్య గతుక్కుమని అడుగులు వినయంగా వెనక్కి వేస్తే కొడుకూ సరిగ్గా అలానే వేసాడు.

అంతలోనే బయటకువస్తూ "యెల్లెల్లు-అలాగున్నావుకదా నీకెంపని?" అన్నాడు.

"నీ పున్నెం వుంటాదయ్యా! తూరుపోడ్ని. పిల్లలు గలోడ్ని ఒకప్పుడు పెద్ద బతుకు బతికాను-దొరబాబుతో సెప్పి నివ్వేదో నెలజీతం పని యిప్పిస్తే-నీ మేలు మరచిపోతానా? ఏదో ఆకో పాకో యిచ్చుకుంటాను."

ప్రతిమాలుతూ అభినయంతో పులయ్య విన్నవించుకుంటూ ఉంటే చుట్టూ వున్న వాళ్లు నవ్వుకుంటున్నారు. బంట్రోతు కస్సుమంటూ "అలాంటి లంచాలు మాటలాడక! సూడు చుటూ సూడు యెన్ని బోర్డులున్నాయో! నీకు సదువు రాకపోతే యెవర్నని అడుగు!"

"తెలీదయ్యా! నా మాటలతో నిన్ను కష్టపెటాను. నాకేదో పనిప్పిస్తావా నీపాదాలకి సెప్పులా ఉంటాను!"

బంట్రోతు ఆఫీసరులానే ముఖంపెటి "వెళ్ళవోయ్! నీకేం పని! పెద్ద పెద్ద యమ్. ఏ. లు బియ్యేలు సదివినోలికే లేకపోతే... వెళ్లు వెళ్లు" అని లోపల బెల్ వాగడంతో వెళ్లిపోయాడు.

పుల్లయ్య చాలా సేపు చూసాడు. తనన్నెవరూ పిల్వలేదు. అలా ఆ వరండాలో బుట ప్రక్కనుపెట్టుకొని కూర్చుండిపోయాడు. మల్లు అయ్య ప్రక్కన నిల్చొని వుండీ వుడిగీ ప్రశ్నలు వేస్తున్నాడు. మధ్యాహ్నం కావొస్తోంది. రద్దీ చాలవరకు తగ్గింది. మల్లుకు చిరాకెత్తిందో లేక ఆ లేత హృదయానికి అయ్యబాధ నాటిందో గబగబ గదిలోనికి తొంగిచూసాడు. ఎవరో మనిషి కుర్చీ మీద కూర్చున్నాడు. ఆడే అయ్యకి పనియిప్పిస్తాడు—మా అయ్యలాంటి మంచి మనిసిలేడు. మా అయ్యకు ఎందుకు పనిదొరకదని అనుకొని గబ గబ గదిలోనికి వెళ్లాడు. ఆ ఆఫీసరు యెదురుగా నిల్చొని "మా అయ్యకి పని యిప్పావా లేదా?" బంట్రోతు గబగబావచ్చి బయటకు యీడ్చేస్తుంటే మరీ గట్టిగా "మా అయ్యకు పని యివ్వకపోతే సూడండి—కుక్కపిల్లను తెచ్చి కరిపించేస్తా!"

అక్కడ ఉన్నవాళ్ళు పకపక నవ్వుతున్నారు బంట్రోతు ధాటీగా "పోతావా మెడపట్టుకొని గెంటాలా!" అని పుల్లయ్యను గద్దించాడు. మలు కొర కొర ఆ బంట్రోతు వైపు చూస్తుంటే "ఉల్లిపాయంత వున్నాడు గానీ వూరంతా గడబిడ చేసేస్తున్నాడు!" అని బంట్రోతు విసవిస లాడాడు.

పుల్లయ్య యీ వేళ యేదో ఒకటి తేల్చుకోనిది కదలకూడదనుకోవటంవల్ల ఆ బయట నిల్చున్నాడు. కొడుకు బుట్టలో కూర్చొని ఆఫీసువైపే చూస్తున్నాడు. ఇంతలో ఒక మనిషి—చాలా మంచిమనిషిలా వున్నాడు. వెళ్లిపోతూ వెళ్లిపోతూ "యేవూరోయ్ నీది!" అన్నాడు. పులయ్య గబగబ తనవెంటపడ్తూ బాబూ! మాది తూరుపు—నవిరి. జరగక పట్నంవచ్చాను బాబూ!"

"అలానా పాపం!" అంటూనే ముందుకు సాగిపోతున్నాడు.

"పాపం అని కనికారం చూపిస్తున్నాడీ బాబు—యీ బాబుకు యీ ఆఫీసులోనే పని—పని చూపిస్తాడన్న ఆశతో ఆయన వెంట పడ్డాడు.

అతని యిల్లు ఆ దగ్గరలోనే వుంది. ఇంట్లో కాలుపెట్టూ "లాభం లేదు - వెళ్ళిపో" అన్నాడు. తలుపు వేసుకున్నాడు. కాని పులయ్య ఆ గుమ్మం కదలలేదు. భోజనం చెసీక తలుపు తీసేసరికి పుల్లయ్య అక్కడే వుండటంచూసి "ఏమోయ్! నీలాంటి వాళ్లకి వుద్యోగం దొరకడం కష్టం."

"బాబూ తమలాంటి పెట్టిన మారాజులే మొండిసెయ్యి సూపిస్తే మాలాంటోలము బతకాలా! నాకిక్కడెవరు గతిలేరు తమరు తప్పించి—బిచ్చం పెట్టక పోతే సచ్చిపోతాను—."

ఈ ప్రాధేయమైన గొంతుకవిని ఆయన కుర్చీమీద కూర్చొని లోనికి రమ్మన్నాడు. వినయంగావచ్చి నేలకూర్చొని కొడుకుచేత కూడా దండం పెట్టించాడు.

"ఏదో నేను చేసేస్తానని దేముడుని నమ్మినట్లుగా నీవు నమ్ముతున్నావు. కానీ నా చేతిలో యేమీ లేదు. నీపేరు ఆ రిజిష్టరులో వేయగలనేమో—"

"అంతేసాలు బాబూ ఈ యాళ కాకపోతే రేపియ్యరా!"

"అందులో వ్రాసినంతమాత్రాన వుద్యోగం రాదు. నిన్నెక్కడైనా పంపించడానికి యిదివరకు యే గవర్నమెంటులో పని చేసావో చూస్తారు. అందులో పేరున్నమాత్రాన నీకేం లాభంలేదు."

పుల్లయ్య కాస్త వెలిగినముఖం మళ్లీ

విచార గ్రస్తమైంది—అయినా మనసులో యీ బాబు తప్పక తనకు పని చూపిస్తాడన్న విశ్వాసంతో "బాబూ! మీ రేమన్నా మీ పాదాలు యిడిసిపెట్టను. ఈడిముఖం సూడండి. మంచిరోజున పెద్దోడు పుటుక్కొచ్చాడు బాబూ! ఈడు పుట్టేన్నాడు చినుకులు జలజల రాలినాయి నాకేదో తమరు పనిస్తే నా కొడుకు పెద్దోడవడా? నీతి నిలపడా? దొంగల్ని పట్టే దొరవడా? మీ లాంటి మా రాజులు యింటారనేకదా మా లాంటి పేదోల్లం కష్టాలు సెప్పుకుంటాం. చూడండి—బట్టముక్క తిప్పి కట్టకోడానికి లేదు. తిండికే లేనప్పుడు బట్ట లెక్కడొస్తాది? నోరు కట్టుకొని పనికి కాగితం పంపించాను—ఏమీ వానిమీద రాలేదు. ఈ కాలా? ఒకపూట వుంటే యింకోపూట లేదు-నా మాట అటుందండి. పిల్లలు కడుపు చుట్టుకుపోతుంటే యెలా సూడమంటారు? ఈ పూట తాగితే రేపు యీ యేలకి! అందరు సూసి నన్ను జబ్బు మనిషనుకుంటారు—తిండికి లేకపోవడమే జబ్బు! మా రాజులు మీ లాంటి పుణ్యాత్ములు లేపినారు!"

"నేనేం చెయ్యలేనోయ్. నిజంగా చెపుతున్నాను" పాపం ఆయన తన నిజ పరిస్థితి యీ అమాయకుడు తెలుసుకోవాలని నొక్కి చెప్పినా పుల్లయ్య విడిచిపెట్టలేదు. నిముష నిముషానికి తనలో యేదో ఆశ, విశ్వాసం హెచ్చిపోతోంది మరి కొంత దైన్యస్వరంతో "బాబూ! చేసేవాళ్లెప్పుడూ అలాగే అంటారు. ఒకరికి నాను దుర్మార్గం తలంచలేదు. నా పెళ్లంసంగతి మీకు తెలీదు. దానిదగ్గర ధర్మం, న్యాయం వున్నాది. అదంటే నాకు జడుపు! దానిమంచి నాకు యీ రోజు కాకపోతే రేపే నా కొస్తాది. ఆ బగమంతుడు నా లాంటోల్లకే కష్టాలు పెట్టేస్తాడు—ఆకరికి ఆ తండ్రే కనికరంతో మీ లాంటి మా రాజుల్ని సూపిస్తాడు. తినేందుకు కూడు లేదు—మేడలూ మిద్దెలూ కోరలేదు—మూరడు గుడ్డ, పిడికెడు మెతుకులూ దొరికితే సాలు బాబూ—పని సెయ్యనోడ్ని కాను—దొంగతు తినోడ్ని కాను—ఈ దశలో మిమ్మల్ని ఆబగమంతుడు సూపించాడు—మీకు పదివేల నమస్కారాలు బాబో-నాకింత ఆదరువు యిప్పించండి" అని పుల్లయ్య సాష్టాంగ పడిపోయాడు. కొడుకు తండ్రి ననుసరించాడు. ఎదురుగా కుర్చీమీద కూర్చున్న మనిషి కళ్లు చెమ్మగిలిపోయాయి. వంటయింటినుంచి వింటున్న అతని భార్య కళ్లనుంచి బిందువులు రాలిపోయాయి.

ఆయన లేవనెత్తాడు. ఏమనడానికీ తనకు తోచలేదు ఆ నిముషంలో తను యింకేమన్నా పుల్లయ్య హృదయం పగిలిపోతుందేమోననిపించింది. రేపు పది గంటలకల్లా ఆఫీసుదగ్గరకురా నేనుంటానని పంపించివేసాడు. మళ్లీ వెళ్ళిపోతున్నవాడ్ని పిలిచి "నీ పేరేమిటోయ్?" అన్నాడు.

"పుల్లయ్య బాబూ!"

"ఇంద యీ అర్ధరూపాయితో నీ కొడుక్కేదో కొనియ్యి?"

సంతోషంగా పుచ్చుకొని "మీ ఋణం యేంచేసినా తీర్చుకోలేను బాబూ...యేదో పని సెప్పండి-కర్రలున్నా యీ కొట్టేస్తాను-ఈ సుట్టుపటవున్న గత్తరయెత్తి పారేస్తాను!"

అన్నిటికీ బదులే-మధ్యాహ్నం అయిపోయింది. యింకోసారి చేద్దువుగాని అని పంపించివేసాడు. పుల్లయ్యను పంపించివేసాక "పాపం! అలాంటి బాధపడేవాళ్లని ఒక కంట చూడండీ" అని భార్య అందుకుంది. వెంటనే జబాబులేదు. తరవాత అన్నాడు. ఏదైనా చేద్దాం అన్నవాళ్ళకి చేసే అధికారం వుండదు. నేను ఒక గుమస్తాను. ఇదివరకే మా ఆఫీసంటే ప్రజల్లో నానా అపోహలూ వున్నాయ్. ఏదో తంటాలుపడి వాడ్ని వుద్యోగంకోసం పదిమందితో పంపిస్తాను-కానీ తీసుకునేవాడ్ని నేను కాదుగా!"

పుల్లయ్యతో చెప్పామనుకున్నది భార్యతో చెప్పేకాడు. ఆ మరుచటిరోజు అతికష్టం మీద పేరు రిజష్టరయ్యింది. ఆ వేళ సాయంత్రం యింటిదగ్గర పుల్లయ్యకు తంతంతా బోధపర్చాడు. ఎక్కడైనా ఖాలీలు వస్తే ఒకసారి పంపించే పూచీ నాది తరవాత నీ అదృష్టం అని చెప్పాడు. అంతా విన్నాక పుల్లయ్య కృతజ్ఞత చూపిస్తూ "ఆ మాత్రం చేసిన మా రాజులెవరి బాబూ! ఈ రోజుల్లో ఆకలంటే అన్నం యెవరు పెడ్తారు? అలాగని దార్ఢ్యం చేసే యెవరూరుకుంటారు? ఇక్కడా అక్కడా పెద్దల్లో మా కష్టమెరిగి మారాజులుండబట్టే లోకం యింకా మునిగిపోలేదు. నేడా అంటే యీ సంవత్సరం యీ లోకాన్ని మంచిదా బాబూ?" అన్నాడు.

ఒకవారం పదిరోజులు వరకు అప్పుడప్పుడూ వచ్చి కనిపిస్తున్నాడు. ఒకనాడు అతను చెప్పాడు "ఇదిగో కాగితం—సరిగా యీ వేళటిరోజు పదిగంటలకు ఆఫీసుకురా!-ఇలాగ వచ్చావంటే, లాభం లేదు. ఒక నిక్కరు మంచి షర్టు వేసుకో. చూడు-ఆ గడ్డం యేంబాగులేదు-ఆ గిరజాలేంటి అసహ్యంగా వున్నాయ్. అవి తీసి మామూల్గా క్రాపింగు వుంచుకో! చూడ్డానికి అసహ్యంగావుంటే ఉద్యోగం యెవుడిస్తాడు చెప్పు? నేను చెప్పినట్లుచేసి అక్కడకువెళ్లు-

(22-వ పేజీచూడండి)

# ఆనవాయితీ

మహోత్సవం జరుపుకోలేదు కాని షష్టి పూర్తి మాత్రం అయిపోయింది జగన్నాథానికి. ఉద్యోగంనుంచి విశ్రాంతి తీసుకోమన్నారు ప్రభుత్వంవారు. అతడు పని చేసినది ఆర్థికశాఖలో. తన యౌవనాన్ని ఉత్సాహాన్నీ కవిత్వాన్నీ సంగీతాన్నీ అభిరుచుల్నీ అన్నింటినీ భయభక్తులతో ఆ ఉద్యోగానికి అర్పించిన త్యాగధనుడు జగన్నాథం.

అవకాశం దొరికితే ఒక రచనను వ్రాసి నాలుగు డబ్బులు చేసేసుకుంటాడు. సంగీతాన్ని వినేస్తాడు. భార్య జడలో మల్లె చెండును పిల్లిలా వెనకచేరి ఆఘ్రాణించేస్తాడు. పిల్లవాడికి బ్రతుకు తెరువుల్ని పథ్యతనీ బోధించి మంచి మార్గంలో పెట్టేస్తాడు. కాని ప్రభుత్వం అతడి కంతకంటె గౌరవమైన-అంటే గురుతరమైన బాధ్యతల నప్పగించింది. ఇందుకు జగన్నాథం వంటి స్వార్థత్యాగధనులే అవసరం.

జగన్నాథం తన ఇరవైయో పడిలోంచి యాభయ్యో పడి వరకూ ప్రభుత్వ సేవలో గడిపి మళ్ళా జీవితంలో ప్రవేశించాడు. ఇన్నాళ్ళదీ జీవితమో మరేమో అతడ్ని అడిగినా చెప్పలేడు. తీరుబాటు చేత ఇప్పుడిప్పుడు సంగీతమునేది ఈ లోకంలో ఉందనీ తన బాల్యంలో ఎంతగానో అనుభవించి ఆనదించే వాడనీ గుర్తిస్తున్నాడు.

ఉద్యోగంలో ప్రవేశించిన కొత్తరికంలో గిజగిజా తన్నుకు పోయేవాడు. అభిరుచులను తీర్చుకోవడానికి క్షణమైనా తీరిక లేక పోయిందని టైముంటే విచారించే వాడు. రచనలు టేబిలుమీదనుంచీ బెంచీమీదికీ బెంచీమీదనుంచి కిందకూ దిగి ఒక్కదాటులో చెత్తకాగితాల బుట్టచేరి ఎప్పుడు అమ్ముడు పడ్డాయో తెలియనే లేదు. బాడ్మింటన్ రాకెట్ విరిగి ముక్కలై పెంటకుప్పను అలంకరించింది. "అన్నట్లు అదేమైంది" అని జ్ఞాపకం వచ్చినప్పుడొకసారి ఝూం మనబోయేవాడు. కాని - భార్య "మీకేమన్నా తీరుబాటా ఇవన్నీ చేయటానికి" అనడంతో 'ఔను' అనుకున్నాడు. కొడుకుమాత్రం నాన్నగారిగదిలో ప్రకృతి దృశ్యాలకూ ఆయన తీసే కూనిరాగాలకూ ముచ్చటపడే వాడు. 'తన కుమారుణ్ణి మంచి విద్యావంతుడుగా సంస్కృతి గలవాడిగా చేయాలి. తనగతి తప్పని సరిగా డెబ్భైనాలుగు జీతంలోకి ప్రవేశించింది. కొడుకుని మాత్రం కనీసం ఏ లెక్చరరుగానో చేయాలని' అనుకునేవాడు.

పిల్లలు పెరిగారు. సంసార బాధ్యతలు చుట్టుముట్టాయి. అవసరాలు హెచ్చాయి. అవసరాలు హెచ్చినంత వేగంగా ఆదాయం హెచ్చవలేదు. కాబట్టి తగ్గినట్లు కనిపిస్తోంది. రాత్రి ఏ తొమ్మిదికో వచ్చినా పెదవాడు మేల్కొనే ఉండేవాడు. వాడిపైనే ఆశలన్నీ పెట్టుకున్నాడు జగన్నాథం. ఏ పుస్తకం అవసరమన్నా - మాష్టరుగారు ఫలానా సినీమా చూడమన్నారని అన్నా - వెంటనే ఆ కోరిక తీర్చేవాడు. పెదవాడు పెద్దవాడై తనను సుఖపెడతాడని నమ్మకంలో ఉండేవాడు. ఆ పట్టుదలతోనే చదువుకు ఎక్కడా అంతరాయం కలగకుండా తను ప్రయత్నించాడు. అయినా కలిగింది. ఏం చేస్తాడు! స్కూల్ ఫైనలు పూర్తిచేయడం బ్రహ్మాండం తలక్రిందు లయింది. ఆ యేటి కాయేడు సంసారాన్ని నడపడం కష్టతరమౌతూంది. తక్కిన పిల్లల చదువులూ నిత్యావసరాలూ మరి యివన్నీ - ఎక్కడి నుంచని వీటికి తేవడం?

అలాంటి తరుణంలో పెదవాడు కళలనీ నాటకాలనీ కొత్త తెలియజెప్పి చెప్పకుండానూ తిరుగుతున్నాడు. చెప్పే విధంగా జగన్నాథం చెప్పిచూశాడు. ఏదో స్కూల్ ఫైనలు అయిందనిపించాడు పెద్దవాడు. ఇంకా చదువుకోమని వేధించుకు తింటారేమో అని బెంగటిల్లాడు. ఇంక ఇంతలో విడిచిపెడితే బాగుండు ననుకున్నాడు. పరిస్థితులన్నీ చూసి తనచదువింకా చెప్పించడం వీల్లతరం కాదని ధైర్యం చెందాడు.

జగన్నాథం రిటైరవడంతోనే కొన్ని ఆలోచనలూ తర్జన భర్జనలూ జరిగాయి. ఏదైనా కుటుంబ భవిష్యత్తు బాగుపడాలంటే తన కొడుకు విద్యాధికుడవాలని జగన్నాథం పట్టుదల. ప్రస్తుతపు ఇబ్బందులకు వెరిచి ఏ గుమాస్తాగానో ప్రవేశపెడితే జీవితమంతా తనలాగే విచారించవలసి వస్తుందని ఆలోచించాడు. సాధ్యమైనంతవరకూ తన సంతానాన్ని ఉన్నతోద్యోగాలకు వెళ్ళేట్లు తయారుచేయాలని నిశ్చయించాడు. పెద్దవాడి ఇష్టాయిష్టాల అవసరం లేకుండా నే

కాలేజీలో ప్రవేశపెట్టాడు, ప్రావిడెంటు ఫండు నాలుగురాళ్ళున్నాయని ధైర్యంఒకటి వుంది.

కాలేజీలో చదువుతున్నాడు కాబట్టి పెద్దవాడికి అరుచెప్పులకు బదులు బూట్లూ, షెరాయీలకు బదులు పాంట్లూ మార్చవలసి వచ్చింది. ఖర్చు అనుకోకుండా పెరిగింది. కళాశాలవిద్యార్థి కావడం పెద్దవాడి కళాసేవకి సాంఘిక చైతన్యానికీ మరింత తోడ్పడి అవకాశాల్ని అర్హతని చేకూర్చింది. కాలేజీ చదువుకి డబ్బు మంచినీళ్ళలా ఖర్చు అవుతోంది.

అమ్మాయికి మంచి సంబంధం వచ్చింది. అయిందనిపించమంటున్నారు బంధువర్గమంతాను శ్రేయోభిలాషులు చెవినిల్లుకట్టుకొని పోరుతున్నారు. కట్నం హెచ్చువి ఆలోచిస్తే ఇలాటిసంబంధం మరి దొరకదని భార్య హెచ్చరించింది. చివరకు ఆయేడు పెళ్లి చేయడానికే నిశ్చయించుకున్నాడు.

ఆ పెళ్ళి జరిపించానని తృప్తి మిగిలింది కాని కానీడబ్బు మిగల్లేదు జగన్నాధానికి.

పెద్దవాడి రెండేళ్లి ఇంటర్ చదువుకు వెచ్చించిన డబ్బంతా బూడిదలోపోసినపన్నీరయింది.

ఇంటి వ్యవహారం నడవడం దినదినం బరువవుతోంది. రెండోవాడు తనతో ఎన్నో పాట్లు అన్నాడు. కాని తనకు మహాబాధగా ఉంది—అంత చిన్నవయస్సులో ఆయేడే స్కూల్ ఫైనల్ పాసయిన చిన్నవాడు అప్పుడే ఉద్యోగంలో ప్రవేశించడమా అని. వాడి భవిష్యత్తు పాడవుతుందని భయం. అలాగని వాణ్ణింకా చదివించగలవనే ఆశ కూడా లేదు. చిన్నవాడికి వాళ్ల తల్లిపోలిక. ఇంట్లో పరిస్థితులు చూసి ఆగలేకపోతున్నాడు. అన్నయ్యను పడచీవాట్లు పెట్టేవాడు. 'ఇన్ని వేలు దండగచేసినందుకు ఇకనైనా ఏదోఒక ఉద్యోగం చూసుకో' మన్నాడు.

జగన్నాధం ఆవేళ ఉదయం సంసారయాత్రకు ఏమీ మార్గంతోచక ఆలోచిస్తూ కూర్చున్నాడు. పెద్దవాడు సంతోషంగా వచ్చి చెప్పాడు: "నాన్నా ఉద్యోగం దొరికింది." జగన్నాధం తటాలున "జీతమెంత?" అని అడిగాడు. "డెబ్భైనాలుగు" అన్నాడు పెద్దవాడు. జగన్నాథం కుంగిపోయాడు ఇక మాట్లాడలేక పోయాడు.

సంసారాన్ని ఈదడానికి కొంతవరకూ మార్గం లభించింది. కాని రెండో పిల్ల అప్పుడే పెళ్ళి కావాలన్నట్టు ఎదిగికూర్చుంది. వివాహార్హతవచ్చి రెండేళ్లయినా జగన్నాధం తలపెట్టనైనా తలపెట్టలేక పోయాడు. ఎంతమంది వరుల్ని చూచినా మార్కెట్ ధరలు దుర్భరంగా కనిపిస్తున్నాయి. రెండువేలు కట్నమైనా పట్టుకుంటేగాని మగవాడ్ని పోలిన 'చిన్న గుమాస్తా వరుడు' కూడా




లభించడు "ఎక్కడివి రెండువేలు?"...

"మరెలాగండీ" అన్నది జగన్నాథం భార్య.

"సర్దుకొని మిగల్చుకోలేమా" అన్నాడు పెద్దవాడు.

"అంతసులభంగా ఉందా సర్దుకోవడమంటేను. నీ జీతానికి రెండు రెట్లు ఆదాయముంటే మరి రెండేళ్ళపైమాట" అన్నాడు జగన్నాథం.

చిన్నవాడు ఇదంతా విన్న నాలుగు రోజుల్నుంచీ తెగతిరగడం ఆరంభించాడు. వారంరోజులు పోయాక నాన్నగారి ఎదుట తిన్నగా కూర్చొని "నేనుకూడా ఉద్యోగంలో ప్రవేశించాను నాన్నా" అన్నాడు.

జగన్నాధం ఆశ్చర్యపోయాడు. చిరాకుపడ్డాడు. అంతకంటె ఏమీ చెయ్యలేక పోయాడు.

"గుమాస్తాయేనా" అన్నాడు ఒకగడియ ఆగి.

"ఏదోఒకటి. ఆ రెండేళ్ళు దాటాకనైనా చెల్లిపెళ్లి చెయ్యాలంటావా? అందుకు ఇప్పుడే ఉద్యోగంలో ప్రవేశించాను. ఇంతకంటె గత్యంతరం లేదు." అన్నాడు చిన్నవాడు.

"గొప్పపని చేశావు" అన్నాడు జగన్నాధం అర్థరహితంగా.

జగన్నాధం తల పట్టుకొని కూర్చున్నాడు. చిన్నవాడిమాటల్లో సత్యాసత్యాల పరీక్ష చేయలేదు.

జగన్నాధం భవిష్యత్తువైపు చూస్తున్నాడు.

ఎటుఎదుట ముడుతలుపడిన శరీరాలతోనూ, నిర్జీవమైన కళ్ళలోనూ—చిరుగు చొక్కాలను పాతకోటు వెనక కప్పుకోడానికి ప్రయత్నిస్తూ—యిద్దరు కొడుకులూ కనిపిస్తున్నారు.

జగన్నాధం ఏదో గొణుక్కున్నాడు. ★

# ★ దగాపడిన తమ్ముడు ★

(19-వ పేజీ తరువాయి)

వాళ్లు యేది చెయ్యమన్నా చేసెయ్య్- భయపడకండా బాబు చెప్ప-లోపలికి వెళ్ళగానే యిలాగ సెల్యూట్ కొట్టు!" అన్నీ మరీ మరీ చెప్పాడు.

ఆరోజు వచ్చింది. గిరజాలు తీయించేసాడు. బట్టలు పొడుగు జేబుదొంగను యెరువు అడిగితే యిందులో నా వేవీ కావనేసాడు. తనలా పుల్లయ్యనూ చెయ్యమని సలహా యిచ్చాడు-ఆ సలహా ప్రకారం చాకలివాని దగ్గర ఒక కాకీ నిక్కరు కమీజు అద్దెకు తెచ్చాడు. ఎంత తయారయినా మనిషి సన్నంగానే కనిపించాడు. గిరజాలు తీసేయటంవల్ల డాంబికం తగ్గిపోయింది. అది తీస్తున్నప్పుడు చాలాకష్టం అనిపించినా విధిలేక కళ్ళుమూసుకొని కత్తిరించడానికి మన సిచ్చేడు. ఆ పనిచేస్తుంటే మల్లుమంగలాడి మీద కోపం అయిపోతుంటే తండ్రి వారించాడు. తనపాలం పోయిన్నాడుకూడా తనకు అంతకష్టం అనిపించలేదు. ఏనా కడుపు ముందా యిది ముందా అనుకున్నాడు.

ఇంటర్వ్యూకి మరో పాతికమందితో సహా తనూ వెళాడు. ఆ స్థలం వూరికి అయిదు మైళ్ళ దూరంలోవుంది. ఎండలో నడిచి వెళేసరికి అలసిపోయాడు. అక్కడ యిద్దరు ఆఫీసర్లు వచ్చినవాళ్లకి తనికీచేస్తున్నారు. పుల్లయ్యకు ఆకలి వేస్తోంది. డబ్బు దగ్గర లేదు. ఉన్నమటుకు బట్టల అద్దెకు వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళినా కడుపునిండుతుందనిలేదు ఉండగా వుండగా చివరకు తనపేరుపిల్చారు. ఆకలి-నడవడానికి శక్తి లేనట్లుంది. కాని వుత్సాహం తెచ్చుకున్నాడు. ఆ గదిలో కాలుపెట్టేసరికి కాళ్ళు గజగజలాడిపోసాగినయ్. అటువంటి పెద్దవాళ్ళని తను యిదివరకు చూడలేదు. ఒకాయన తెల్లగా పొడుగ్గా వున్నాడు బెంగాలీ మనిషి రెండోవాడు నల్లగావున్నా పెద్దముఖం కళ్లద్దాలుతో గంభీరంగా వున్నాడు.

"నీ పేరు..." బెంగాలీ ఆఫీసరు హిందీలో అంటే పులయ్య గాబరాపడిపోయాడు. ప్రక్కనున్న అరవ ఆఫీసరు "నీపేరేమబ్బా!" అనగానే ఆ గొంతుక విని గతుక్కుమన్నాడు ..పుల్లయ్య అని గొణిగేసి దీనంగా "బాబూ! మీరు కనికరం చూపించండి. తూయిపోడ్ని—పిలలు గలోడ్ని—ఒకప్పుడు గొప్పబతుకు బతికాను...అన్నంలేక నానూ పిల్లలూ సచ్చిపోతున్నాం..."

బెంగాలీ ఆఫీసరు "వాడేం అంటున్నాడని" అం.. ఆఫీసర్ని అడిగాడు. కొద్దిగా తెలుగు తెలిసిన ఆ ఆఫీసరు తనకు తెలీదని అనే బదులు వాడేదో గొప్పగా బ్రతికిన పాత్రబతుకు గురించి చెప్పుకుంటున్నాడు అని చెపుతూ పుల్లయ్యవేపు ముఖం త్రిప్పి "అదంతా ఎవరికావాలబ్బా! పేరు—నీ పేరేమి!"

"పుల్లయ్య!"

బెంగాలీ ఆఫీసరు "ఏదేనా చుట్టుపట్టున్న దేముడు పేరా" అన్నాడు ఇంగ్లీషులో.

వెంటనే తను ఇదివరకు తెలుగు తెలుసని చెప్పిన మాట నిలుపుకోడానికి... "కాదు. పుల్ల అంటే పులుపు—పులుపు మనిషి అని ఇంగ్లీషులో చెప్పాడు.

వెంటనే ఆ ఆఫీసరు అలా కనిపిస్తున్నాడులే!" అని ఇంగ్లీషులో అంటూ, అక్కడవున్న పెట్టెను ఎత్తమని చెప్పాడు సైగతో! పుల్లయ్య అసలే ఆకలితో వున్నాడేమో ఆ పెట్టె యెత్తుకోడానికి కొంత గుంజాటన పడ్డాడు. ఆఫీసరు ఇంగ్లీషులో "ఖాడి కాప్రజ్ఞ లేదు" అని చెప్పాడు. ఆ పెట్టె తిరిగి క్రింద పెట్టాక కొంత ఆయాసంతో వణికిపోతూ నమస్కరించి దీనాతి దీనంగా "సాలా కష్ట పడిపోతున్నాను. ఈ బట్టలూ అద్దెకి తీసుకొచ్చాను బాబూ! తిండిలేక నాకేకాదు పిల్లలూ సీపురుపుల్లల్లాగ అయిపోయినారు. పదిపూటలు కడుపునిండా తిండిపడితే ఇలాంటివి రెండు పెట్టెలు రెండు సేతుల్లో ఎత్తేసాను బాబూ!" ఇలా అంటూంటే కళ్లల్లో నీరు తిరిగిపోయాయి.

అరవ ఆఫీసరు "పెళు! ఎక్స్చేంజి వాళ్లు సెప్పుతారు!" అనగానే పుల్లయ్యకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. పని దొరికినట్టే అనుకున్నాడు. ఇంటికి ఆగి ఆగి నడిచివెళ్లేసరికి చీకటి పడిపోయింది. అలా గడపలో మూర్ఛపోయినట్లు చారబడిపోయాడు. నీలి అర్ధణా యిచ్చి గోంగూరకొని నీటిలో వుడకపెట్టింది. ఆవీధిలోనే ఒకమ్మ దగ్గర రూపాయికి నెలకి పావలా వడ్డీకి ఒక రూపాయి తెచ్చిందేమో కడుపు నిండగానే పుల్లయ్య తెప్పరిల్లాడు.

ఆ మరుచటి రోజు ఆబాబును కలుసుకొన్నాడు. జరిగినదంతా చెప్పేశాడు. పనిలోకి యెప్పుడు రావాలో మీతో సెప్తానన్నారు బాబూ అని చెప్పాడు ఆ ధైర్యం నాలుగు రోజులు దకదకా యిక్కడకూ అక్కడకూ పనిపాట్లు కోసం వెళ్ళడం యేదో కొద్దో గొప్పో కడుపుకు జరిగిపోడానికి అవకాశం యిచ్చింది.

ఆరోజున ఆయన చెప్పాడు "వాళ్ళు నిన్ను తీసుకోలేదు. నేనేం చేస్తానుర్!" అని పుల్లయ్య నడుం విరిగిపోయింది. అక్కడే కూలబడిపోయాడు. ఏడుపుకూడా వచ్చేసింది. గట్టిగా బావురుమని యేడ్చేద్దామనుకున్నాడు—కానీ కొద్ది సేపటి వరకు నోట మాటరాలేదు...చివరకు శోకమయమైన గొంతుకతో—"బాబూ! ఈ గిరజాలని మాని మాసుట్టుపక్కల వూళ్లలో... మూపురేకుల పాపలు మురిసిపోయే వోరు... నాకు అవి పేణంకంటే హెచ్చు బాబో... అన్నంముద్ద నోటి దగ్గరకు వస్తాదని...మన సుకట్టికత్తిరికి యిచ్చీపాను—నోటికొచ్చిన ముద్ద జారిపోయినాది! నన్ను కనీకొవ్వరుడు తిప్పుతుంటే మీ రేంసేస్తారు బాబూ!" అంటూనే మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ దారితెన్నూ చూడకండా అలా వెళ్ళిపోయాడు! 

(ఇంకా వుంది)




[ఉద్యోగపర్వమునుండి]

తే. పట్టి యీతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు, దిగులు పుట్టింత మంతటఁ దెగక యెత్తి
వచ్చి రేనియు నిర్జింప వచ్చుఁ గోఱ, లెల్లఁ బుచ్చిన నురగంబు లేమి సేయు.

వ. అని విచారించె నిట్లు దుష్కార్యాలోచనంబు సేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులగు దుష్టచతుష్టయంబు మొదలుగాఁ గల యవినీతులు దైతేయమర్దను మర్దింప నిశ్చయించి రయ్యవసరంబున

చ. అడఁకువ లేమి నక్కఱ యురియాడుట నొండొరుఁ గూడ కుండుటన్
బుడిబుడి మాటలాడుటను బోవుచు వచ్చుచుఁ గ్రందు గ్రమ్మఱం
బడుటను దెల్ల మైన మును పన్నగఁ దాఁ బరికించి యున్కి న
ప్పుడు హరిఁ బట్టునంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్.

తే. బఱటికొనిపోయి కృతవర్మఁ బన్నఁ బనిచె, నీవు బలమును వాకిట నిలువ మేను
లోపలికి నెల్లఁ జాలుదుఁ బాపబుద్ధు, లన్న దెసఁదప్పి రని నిర్భయముగఁ జెప్పి

వ. ఇట్లు పరమాప్తుం డగు హార్దిక్యు నట వుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ జనుదెంచి జనార్దనునకు సత్తెఱం గెల్ల నెఱింగించి తదనుమతిం గౌరవేశ్వరబాహ్లిక భీష్మ విదురులతో ని ట్లనియె

మ. అదె కౌరవ్యు లశక్తదుర్జనత సేయం బూని పైఁ బాఱఁ జూ
చెద రమ్మెయ్మె దమచేతఁ దీఱునె జయశ్రీకాంతు దైత్యాంతకుం
బొదువం దారు దలంచు టెల్ల ననలంబుం జీర బంధింపఁగా
మది నూహించినయట్ల కాక తమ దుర్మంత్రంబులం బోవునే.

వ. అనిన విదురుం డదరిపడి వైచిత్రవీర్యున కి ట్లనియె

ఉ. భూవర నీతనూభవులు పుణ్యు నగణ్యపరాక్రముఁ హరిం
గేవలమర్త్యుఁగాఁ దలఁచి కిట్టినఁ బట్టినఁ దారు మంటపై
వావిరిఁ గ్రమ్మ నాశలభవర్గముచాడ్పున గ్రుందిపోరె కా
లావధి యయ్యెఁ గావలయు నక్కట వారికి వారివారికిన్.

వ. అనుటయు గోవిందుం డందఱు విన నంబికానందనున కి ట్లనియె.

ఉ. రోషము నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింత సేత నం
తోషమ నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని
ర్దోషత నేను నోపుగతి దోర్బలదుర్జయు లైనవారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీవర యింతక పోయి వచ్చెదన్

క. అనుడు ససంభ్రమముగ న, జ్జనపతి దుశ్శాసనాది సకలపరిజనం
బును నాదుర్జనునిం దో, డ్కొని రమ్మని విదురుఁ బనుచుడుం జని యతఁడున్.

వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుం డి ట్లనియె.

చ. అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీ డొనరింప నీవు నీ
తులువలు నుత్సహించితిరి దుర్మతులార నమీరు మీకుఁ జోఁ

కలవడి పట్టవచ్చునె మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా
నలుఁ జమరంగ శక్యమె వినాశముఁ బొందెద రేమి సేయుదున్.

ఆ. అనిన విదురుఁ డిట్టు లను సుయోధనుతోడ, బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ
డిచట నెచట నెవ్వరెవ్వరి నేమేమి, సేసె వినవె యేల చెడియె దిట్లు.

వ. అనియె నట్టియెడఁ గట్టెదుర నున్న యక్షురుపతి కుమారుం జక్కంజూచి యే నొక్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబు సేసి తనుచు దరహాసంబు సేయ వాసుదేవుని ఫాలప్రదేశంబున బ్రహ్మయు వక్షంబున విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్యమరుద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి. హలగాండీవమండిత బాహు లగు బలదేవార్జునులు సవ్యదక్షిణభుజంబులను నిజాయుధహస్తులగు యుధిష్ఠిర భీమనకులసహదేవులు వీఁపునను వివిధప్రహరణపాణులగు యదువృష్ణిభోజాంధక వీరు లూరులను బ్రభవించిరి జనిత నానాహస్తవిన్యస్తంబులయి శంఖచక్రగదాఖడ్గ శక్తిశార్ఙ్గప్రముఖనిఖిల సాధనంబులు వెలింగె నేత్రశ్రోత్రనాసావివరంబుల సధూమధూమకేతుజ్వాలాజాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణికిరణనిభప్రభలు వెడలె నిట్లు దుర్నిరీక్ష్యం బగు నత్తేజోరూపంబుఁ గనుంగొనంగోలమిగాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయానకరసంబుల జొత్తిల్లు చిత్తంబులతోడం గదల కుండ నప్పుండరీకాక్షుండు నారదాది మహామునులవలనను భీష్మవిదురద్రోణసంజయులయందును గరుణాతరంగితం బగు కటాక్షవీక్షణంబొలయ వారలకు దివ్యదృష్టి యొసంగిన నా పుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలుచుండి రయ్యవసరంబున.

తే దేవదుందుభివ్రాతంబు దివిరెఁ గల్ప, వృక్షపుష్పధారామయ వృష్టి గురిసె
సిద్ధసాధ్యవిద్యాధరశ్రేణి భక్తి, నిచ్చుజయజయశబ్దంబు లెసఁగెఁ జదల.

వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు విష్ణుని దివ్యవిజృంభణంబు గావలయునని యూహించి.

క. కరుణింపుము సంశ్రితభయ, హరణధురీణా సహింపు మజ్ఞానంబున్
శరణంబు వేఁడెద భవ, చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే.

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగు నప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య
జ్జనపతి కద్భుతం బడర సమ్మదపూరము గ్రమ్మ నాతఁడుం
గనుఁగొని భక్తి మ్రొక్కి నినుఁ గంటిఁ గృతార్థుఁడ నైతి నింక నొ
ల్ల నొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ సంహరింపవే.

క. అనినపలుకులకు నచ్చటి, జను లెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనుం
గొను చుండి రపుడు దమనె, మ్మనమ్ము లాశ్చర్యరసనిమగ్నంబులు గాన్.

వ తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతని కన్నులెప్పటియట్ల కావించి నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి మునీంద్రుల నామంత్రణంబు సేయ నమ్మహాత్ము లంతర్ధానంబు సేసిరి దానును సముత్థానంబు సేసి యంతకు మున్న సన్నిహితులైయున్న కృతవర్మకరంబును సాత్యకి హస్తంబును నవలంబించి యూరక వెడలె నని చెప్పిన

ఆ ఈవ్విధమునఁ గృష్ణుఁ డేఁగినపిదపటి, కథ వినంగ నాకుఁ గౌతుకంబు
మనము నిండి గడలుకొనుచున్న యది వివరించి చెప్పు మునివరేణ్య యనుడు.

ఉ భక్తమనఃప్రమోదకరపాదసరోజవికాస చేతనా
శక్తిమయప్రభావ మునిసంస్తుత సాత్యవతేయభారతీ
ప్రోక్త నిగూఢసంప్రకటభూమసమాశ్రయ వత్సలత్వసు
వ్యక్తకృపాభిరామ గుణవర్జన నిష్కల నిత్య పుష్కలా.

క. అవ్యయ నిర్మలవిభవా, దివ్యప్రభవా సుఖైకదీప్తానుభవా
నవ్యత్వనిత్య యతినం, సేవ్యసుసాంగత్య లోకజీవనకృత్యా.

మాలిని. రవిశశిమయనేత్రా ప్రస్ఫురత్కాంతిహృద్యా, నవజలరవికారన్యాసలీలానవద్యా
వివృతనిగమశాఖా విశ్రుతాగ్రైకవేద్యా, వివిధ నియతచర్యావిత్తచిత్తప్రసాద్యా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున యుద్యోగపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.

## ఉద్యోగపర్వము, చతుర్థాశ్వాసము.

శ్రీమత్తులసీపల్లవ, దామచ్ఛవిలబ్ధమరకతప్రతిమత్వో
ద్దామప్రభాస్థిమాలా, శ్యామాయితవిపులవక్ష హరిహరనాథా.

### కృష్ణుండు గుంతియింటికిం జని యామెతో మాటలాడుట

వ దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ గృష్ణుం డత్తెఱంగున వెడలిన విస్మితయై గాంధారి యభ్యంతర మందిరంబున కరుగం గౌరవు లెల్లను బంధుమిత్ర సహాయసహితంబుగాఁ దనతోడన వెడల మొగంబు గంటుపెట్టి కొని కక్ష్యాంతరంబులు గడచినప్పుడు దారుకుండు తేరినొగలపైనుండి పొడుసూపి కేలు మోగిడ్చి ఫాలభాగంబునం గదియించినం దత్ప్రదేశంబున నిలిచి వారలదెస మరలి చూచి మీ రింక నిలువుండని పలికిన నంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి.

ఉ. వీరును బాండుపుత్త్రులును వేరము దక్కి పొసంగి మన్కికై
పోరిత మాడి యే నటులు బుద్ధులు సెప్పిన భంగియుం గులా
చారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర నీదుసన్నిధిన్.

వ అని వెండియు.

తే. నీకు శుద్ధుండ నగుటయ నిఖిలబంధు, మిత్రగురుజనకోటికి ధాత్రి కెల్ల
నంబుజాక్ష నిర్దోషుండ నగుట గాన, నాతెఱంగు నీవెఱుఁగుట నాకుఁ జాలు.

వ అనిన విని యచ్యుతుండు బాహ్లికభీష్మద్రోణకృపప్రముఖనిఖిల విశిష్టజనంబుల నాలోకించి.

తే ఇప్పు డీసభఁ బుట్టిన యింతవట్టు, మీరుఁ దెల్లంబు గాదె యీమేదినీ వి
భుండు దానేమిటికిని ముఖ్యుండఁ గాను, దప్పు దనదెస లేదని చెప్పి విడిచె.

వ కావున నాకు నియ్యెడం దడయం బనిలేదు పోయి వచ్చెద ధర్మపుత్రునకు నింతవృత్తాంతం బెఱింగింపవలయునని పలికి వారల నామంత్రణంబు సేసినవాఁడై రథారోహణంబు సేసి ధృతరాష్ట్రుండును నచటి జనంబులును వెనుకం జనఁ జని కుంతీగృహద్వారంబున నరదంబు డిగ్గి.

క వారందఱుఁ దనతోడన, గారవమున నరుగుదేరఁ గాఁ జొచ్చి మహో
దారుఁడు గుంతీచరణాం, భోరుహముల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్.

క. కౌరవసభఁ దా నాడిన, గౌరవవాక్యములుఁ గార్యఖడ్గక్రమవా
క్స్ఫారములు సుయోధనుడు, ప్రారంభము నల్పవచనపద్ధతిఁ జెప్పెన్.

వ. ఇట్లు ధృతరాష్ట్రు కొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి కెఱింగించి మాధవుండు మఱియును.

తే కురుకుమారులు దమయంతఁ గుడిచి క్రొవ్వి, మీఁదెఱుంగరు మాకేమి మేలకాక
నాలుకలు గ్రోయు నర్జునానలము దఱిసి, యెరగొనం గని సంతృప్తిమెనకమెసఁగు.

వ. పాండుకుమారులపాలికిం బోయివచ్చెద వారికిం దగినబుద్ధు లానతిమ్మనిన నద్దేవి విక్రమోపజీవు లయిన ముచుకుందుడును సృంజయుండును నను తొంటి నరపతుల చరిత్రంబులు సెప్పి యుధిష్ఠిరుండు వీరిని వినండొ కాక యని పలికి యెల్లవారును వినుచుండ వెండియు నిట్లనియె.

ఉ. రాజుల కెందు నారయఁ బరాక్రమజీవనవృత్తి దక్కనొం
డోజ నిషిద్ధ మంద్రు మును లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు బుద్ధివిహీనులు వానిఁ దక్కని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా.

క. నీవియ్యంబులు సంధియు, కావింపం బడిరి వీరిఁ గలయుట కష్టం
బావెరవు దప్పుటయ మే, లై వచ్చెం బొమ్ము విడువు మనుమానంబున్.

మ. నిజవంశోచిత వీరవృత్తమున కున్మేషంబుగా నాకపి
ధ్వజుఁ డుత్సాహము సేయ కున్న నకటా దైన్యంబు వాటిల్లదే

భుజదర్పోద్ధతుఁ డైనభీమునకు నీపాం డొప్పునే నీవు న
ర్వజగన్మాన్యుఁడ వింతె కాఁదగునె దైవం బిట్లు దప్పించునే.

వ. అని యంత నిలువక కొంతి యిట్లనియె.

క. మఱచిరె కొలువున ద్రౌపదిఁ బఱచిన బన్నంబు ధర్మపథము దొఱంగన్
వెఱచుట కప్పటి కిది దగుఁ, జెఱచినవో వెదకవలదె చిరతరకీర్తిన్.

## శ్రీకృష్ణుఁడు కర్ణుఁ దనరథం బెక్కించుకొని కొన్ని రహస్యోక్తులు పలుకుట

వ. అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొని యచ్యుతుండు మ్రొక్కిన దీవించి యేను సుఖం బున్నదాన నని పాండవులకుం జెప్పుము చేతులలావునం గనిన జీవనంబున బ్రదుకుం డనుము పోయి రమ్మని వీడుకొల్పిన సింహగమన సుందరంబుగా వెడలి తనతోడన గదలివచ్చిన ధృతరాష్ట్రాదుల నిలువం బనిచి రథారోహణంబు సేసి గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్న వి చి వత్తుగాని రమ్మని కరంబుసాఁచి చెయి వట్టి తనయరదం బెక్కించికొని సాత్యకి వేసరి నెక్కి కెలనం జనుదేరం గదలి చని యనుప వచ్చిన కృతవర్మ నుచితప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యరుగునవసరంబునం బౌరలోకంబు.

ఉ. అక్కట వాసుదేవు పను పాదరణంబునఁ జేయ నైరి వీ
రెక్కడిబుద్ధిమంతు లని నిందును నందును లోక మెల్లఁ బే
రుక్కున మ్రగ్గుటం దలఁప నొల్ల కపాయము సేసి రట్టె యీ
యుక్కివు లెందునుం గలరె యొప్పరు వో ధృతరాష్ట్రనందనుల్.

వ అని మఱియు ననేకు లనేక ప్రకారంబుల బలుకుచు నిరుగెలంకులం జూచుచుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె నిట ధృతరాష్ట్రుండును మగిడి కొలువుకూటంబునకు వచ్చి యెప్పటివారలు పరివేష్టింపనుండ కృష్ణునిపలని మాటలాడుచున్న సమయంబున సుయోధనులో భీష్మద్రోణు లి ట్లనిరి

చ. పలుకునె యిట్లు కొంతి విని బమ్మెరపోయితి మింత బెట్టిదం
బు లగునె మాట లయ్యుమయుఁ బుణ్యుఁడు కృష్ణుఁడు కార్యవాదముల్
పలికెడువార లిట్లు దెగఁ బాఱిరి ధర్మజవారిరాశికిం
జెలియలికట్ట వాసె మనచే నగు కర్జముచంద మెట్టిదో.

వ అని పలికి వెండియు.

శా. మాకుం జూడఁగఁ బోలు కార్య మిది ధర్మప్రీతి నీ వేఁగి సు
శ్లోకుం డైన యుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతి మై
నీకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యే పొప్ప దెందుం దుదిన్
శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా.

వ ,అనిన విని దుర్యోధనుండు మొగంబు రాఁజుచుండ నూరకుండె గాంగేయుండును గురుండును దిగ్గన లేచి యతని నవలోకించి.

క. కురునృప విను సంసారము, దరి ద్రొక్కిన వార మింకఁ దలఁకెదమే సం
గరమునకు నేము నీకై, పొరలితి మెల్లిన నగును బోయెద మనుచున్.

క. అరిగిరి రాజును సభ్యం, తరమునకుం జనియె రాజతనయుండు బహిః
పరివారముఁ బొమ్మని మిత్ర, పరిజనుఁడై యేఁగె నాత్మభవనంబునకున్.

తే. అంత నక్కడ నచ్యుతు, డరిగి యరిగి, యధికసంప్రీతి దలఁకొన నర్కతనయు
నాననంబు వీక్షించి యి ట్లనియె నెమ్మి, నన్యు లెవ్వరు వినకుండ నతనితోడ,

సీ. నీవు వృద్ధజనోపసేవివి ధర్మసంవేదివి తెలియంగ వినుము సిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమునఁ గన్నియతఱి గొంత గన్నవాఁడ
వగుటఁ బాండునృపాలు నగ్రసుతుండవు ధర్మమార్గం బిది ధర్మతనయుఁ
డాదిగాఁ గల తమ్ము లందఱు నాచేత నెఱిఁగి నీయడుగుల కెఱఁగి సకల 

# కరుణాస్వరూపిణి కనకమహాలక్ష్మి

కంచే చేనుమేస్తే కాచేదెవరు? పురమేలే పురపాలకులే ప్రజలకిక్కట్టులుకల్పిస్తే అడ్డుకునే దెవరు? సర్వరక్షకుడు, సృష్టికర్త అయిన ఆదిదేవుడే అడ్డుకోవాలి, కాని దేవతకే అపచారం జరిగినప్పుడు? చేసిన తప్పులు క్షమించమంటూ చెంపలువేసుకుని చేతులు జోడించాలి. నిజాతే జరిగిందికూడా.

1919 సంవత్సరంలో విశాఖపట్నం అంతా ప్లేగు వ్యాధితో నిండిపోయింది. వూరు వదలిపోయినవాళ్లు పోగా, ఇంకా కొంతమంది మాత్రం విధివశులుగా వుండకతప్పిందికాదు. అలావున్నవాళ్లకి వ్యాధి సోకకుండావుండేందుకు పురపాలకులు ఎన్నిరకాల రక్షణ చర్యలో తీసికొన్నారు. కాని లాభంలేకపోయింది. ఆఖరికెలాగయితేనేం వూళ్లో మిగిలిన చిన్నా పెద్దా అంతా కలిసి 'ఇది దేవతా ప్రభావంవల్ల వచ్చిందే కాని మరొకటి కాదని తలంచేరు; ఏటా జాతర్లు చేస్తామని, నిలువెత్తు నగలు పెడ్తామని, పుటినపాపలకి ఆ తల్లిపేరు పెడ్తామని మొక్కుకున్నారు.

దేవత కరుణించింది. వ్యాధితగ్గుముఖంపట్టింది. అలా కరుణించిన దేవతే శ్రీ కనకమహాలక్ష్మి అమ్మవారు!

విశాఖపట్నం బురుజుపేటలో ఇప్పుడు అమ్మవారివిగ్రహం వున్న స్థలానికి ఎదురుగా వున్న ఇంట్లోవున్న నూతిలో కనకమహాలక్ష్మి వెలిసింది. నాటి రాత్రి ఆయింటి యజమానికి స్వప్నంలో కనుపించి తాను నూతిలో వెలిసినట్టు, తనని పైకితీసిఆయింటి ఎదురుగా వీధిలో నిలపమని, తనకి గుడి గోపురాదులు అక్కర్లేదని చెప్పింది.

వెంటనే ఆ యింటి యజమాని తన బంధుమిత్రులందరికీ ఆ సంగతి చెప్పి తట్టలూ, తాళ్లూ వగైరా పరికరాలతో నిలువెత్తు విగ్రహాన్ని నూతిలోంచి పైకితీసి రోడ్డు మీద నిలిపారు.

నిజానికి అప్పుడది ఏమంత వెడల్పుగల రోడ్డు కాదు; ఒక చిన్న సందు. అప్పట్లో బురుజుపేట కొండని పగలగొట్టి, అక్కడ వెడల్పయిన రోడ్డు వేద్దామని పురపాలకవర్గంవారు నిశ్చయించుకున్నారు. అందుకోసం అమ్మవారి విగ్రహాన్ని స్థానం కదిపి మరొకచోట వుంచారు. కానీ తెల్లవారేసరికి అమ్మవారు యథాస్థానంలో వుంది. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించినా అంతేజరిగింది. దాంతో అమ్మవారు ఆగ్రహించింది. ఆ ఆగ్రహకారణంగా వూరంతా ప్లేగువ్యాధి ముంచెత్తింది. చివరికెలాగైతేనేం వూరి జనుల మొక్కులతో అమ్మవారు శాంతించింది. ప్లేగువ్యాధి నిమ్మళించింది. పురపాలకులు కూడా అమ్మవారి విగ్రహం ప్రక్కనుంచే దారి వెడల్పు చేసి రోడ్డు వేసేరు. అప్పుడు అమ్మవారి విగ్రహాన్ని కదిపేందుకు ప్రయత్నించిన పురపాలకోద్యోగి కీ॥ శే॥ ఆతీ క్రిష్టారావు పంతులుగారు. ఆయనకూడా అమ్మవారికి మొక్కుకుని తనకూతురికి ఆతల్లిపేరు పెట్టుకున్నాడు.

వూళ్లోవున్న ధనవంతులందరూ చందాలు వేసుకుని అమ్మవారికి ఏడువారాల నగలూ చేయించారు. ఆ వీధిలో వున్న కుటుంబాలవాళ్లందరూ చందాలు వేసుకుని గ్రామ సంతర్పణ చేయించేరు. ఆ ఏడు మార్గశిర మాసంలో నాలుగు లక్ష్మివారాలూ అమ్మవారికి తిరునాళ్ళు జరిపించేరు.

అప్పటినుండీ ప్రతి సంవత్సరం మార్గశిర మాసంలో వచ్చే ప్రతి లక్ష్మివారం (గురువారం) అమ్మవారికి వుత్సవం చేస్తూవుండడం విశాఖపట్నం ప్రజలకి ఆచారం అయింది.



"కనకమహాలక్ష్మి"
—ఫొటో: పోడూరి దివ్యప్రభాకర్, విశాఖపట్టణం]

కనక మహాలక్ష్మి అమ్మవారికి గుడిగోపురాలుగాని అర్చకులుగాని లేనందున అపాదికవర్ణాల వారూ స్వయంగా కొబ్బరికాయ కొట్టి అమ్మవారికి అభిషేకం చేసుకోవచ్చును. ఒక్క ఉత్సవం రోజున మాత్రం విగ్రహాంచుట్టూ వెదురుకర్రలతో దడికట్టి, అమ్మవారువెలసిన ఇంటితాలూకువారు అర్చకులుగా నిలబడుతారు.

మార్గశిర లక్ష్మివారంనాడు వుదయంనుంచి రాత్రి సుమారు 12 గంటలవరకు అశేషజనం వచ్చి అమ్మవార్ని దర్శించుకుంటారు. ఆతిరుణాళ్ళరోజున, వీధిపొడుగూతా వేసిన పందిరి క్రింద రకరకాల వర్తకులూ, బొమ్మలు వగైరా దుకాణాలు పెడారు. అదే పందిరి క్రింద విశాఖపట్నంలో వున్న జాలర్లు, తదితరులు మూడు నాలుగు జట్టుగా చీలిపోయి భజనచెట్లు మధ్యను పెట్టుకొని వాటిచుట్టూ తిరుగుతూ చేసే చెక్కభజన, కోలాటపు దరువులు, జడకోలాటంలవీ చూడముచ్చటగావుంటాయి. ఆ నెల రోజులూ అమ్మవారి సమక్షంలో మహాభారతం, రామాయణంవంటి పురాణపఠనం గాని, హరికథా కాలక్షేపంగాని జరుగుతుంది. అయితే వుత్సవంనాడుమాత్రం ప్రత్యేకకథ హరికథగానీ, భాగవతం (వీధి భాగవతం) భరతనాట్యంవంటి ప్రదర్శనలుగానిఏర్పాటు చేస్తారు.

ఎంతటి కరువుకాలమైనా నెలరోజులూ ఉత్సవం అయిపోయిన తరువాత అమ్మవారి సమక్షంలో అన్నసంతర్పణ చేయడం

(55-వ పేజీ చూడండి)



# [illegible]రావ్ దిగ్రేట్

ఓగిరాల కృష్ణ

ఎప్పుడనుకి తిరిగొచ్చిన 'కాపీ'లు చూచుకుని మిగతా అధ్యాపకులు 'అరెరె సుబ్బారావు కథానికోయ్ తిరిగొచ్చింది, ప్చ్, ప్చ్,' అనుకున్నారు. కాని సుబ్బారావు అదృష్టం బాగుంది. "ఎలా వ్రాశాడో చూద్దాం" అని కొంత మంది ఆ కాపీలు తీసుకుని చదివేరు. ఈ సంగతి సుబ్బారావుకి తెలిపింది. అః... ఇదేదో వాటంగానే ఉందనుకున్నాడు. కథలు గేయాలు వ్రాసి, తిన్నగా తీసికెళ్ళి ఆయా పత్రికల పెట్టెలో పడేసేవారు. ఊహూ... ఈ ప్రణాళిక కూడా ఎక్కువకాలం మనలేదు. సుబ్బారావు రొట్టె విరిగి బూడిదలో పడింది. సుబ్బారావు రచన ఒకసారి చదివి చూసిన తరువాత మళ్ళా దాని జోలికిపోలేక పోయారు వాళ్లు.

సరే! ఇలా కాదనుకున్నాడు సుబ్బారావు. ఒక మంచి రోజుచూసి కొన్నాళ్ళపాటు రచనలు వ్రాయడానికి పూర్తిగా స్వస్తి చెప్తున్నానని ఒట్టేసుకున్నాడు.

సుబ్బారావుగారీ నిర్ణయం చేసుకున్న కొద్ది రోజులకే, ఒక ప్రముఖ వారపత్రికలో, దాదాపు వరుసగా. బంగారం సోమేశ్వర సుబ్బారావుగారి రచనలు ప్రచురితమవుతూ వచ్చేయి. అవి కూడా ముందు ముందు ఒక మోస్తరుగా ఉండి, పోనుపోను చాలాబాగా ఉంటూ వచ్చేయి. మొత్తంమీద బంగారం సోమేశ్వర సుబ్బారావుగారు బాగానే వ్రాస్తారని పాఠకులు నిర్ణయించుకున్నారు.

ఇప్పుడు వచ్చిన పెద్దచిక్కల్లా ఎక్కడ ఉందంటే పత్రికల్లో కథలు వ్రాసే సుబ్బారావుగారు మన కథానికా నాయకుడు సుబ్బారావుగారు కాదు.

అందరితో పాటు మన సుబ్బారావుగారు కూడా ఆ రచనలు కొన్ని చదివేరు, 'ఏ డెడ దరియోయ్' అని అనుకుంటూనే. ఏంబావున్నాయి యీ రచనలు, కానీ నేను వున్నానే, నేనుమాత్రం యిలా కథ నడపలా! అయితే చివర చివర, యిలా నడిచేను. కాని ఈ పత్రికలవాళ్ళకి చివరిదాకా చూసే ఓర్పుంటేగా, అయినా వాళ్లనని ప్రయో[illegible]

[illegible]
[illegible] ప్రచురించు [illegible]
అని కొద్దిపాటి వ్యంగంతో చెప్పుకున్నాడు.

సుబ్బారావుకి ఆయినవాళ్లు, మిత్రులు కూడా ఈ పత్రికలోని కథలు కొన్ని చదివేరు. సుబ్బారావుకి స్టార్ తిరిగిందని [illegible] కంతో కారంగా 'మనవాడు ఎప్పటికైనా పైకొస్తాడని మేము ముందే అనుకున్నామన్నట్టుగా' పరోక్షంగా సుబ్బారావుని అభినందించేరు.'

రాను, రాను, బంగారం సోమేశ్వర సుబ్బారావుగారి రచనలు చాలా చమత్కారంగా సాగేవి, కొంతకీ విషయాలు; భగ్న ప్రేమలు 'చావు, తెలివు'లు అంటూ [illegible]గులు ధరిస్తూ.

ఒక రోజు మన సుబ్బారావు మిత్రులు, తోటివారు, ఆయినవారంతా వచ్చి, సుబ్బారావుని బ్రహ్మాండంగా పొగిడేరు. నీ కథలు యివ్వాళ ప్రతీదీ మేము చదువుతున్నామన్నాడొకడు. ఆ కథలో యీ సన్నివేశం ఉంది చూశేవ్, అబ్బ, భలే రాశావు భలే అని చంక తెగరేశాడు మరొకడు. అన్నిటికంటే అదిరా ఆ భగ్నప్రేమ చూశావ్ అది. అంటూ వచ్చిందో ప్రశంస మిత్రుల మధ్యనుండి. నీ 'చావుతెలివి' నిన్న సాయంత్రం మూడుసార్లు చదివేసేనురా అని ఉత్సాహంగా ఊదేడొక మిత్రుడు. వీడు పంపింది పంపినట్లుగా పడుతున్న యీ రాతాయన అన్నాడొక సహచరుడు. మరి మనుకున్నావురా సుబ్బారావంటే? అసలు మనవాడికి మాంఛి 'ఫ్యూచరు' ఉందని నే ఊరికే అన్నానా? అంటూ అభినందపరిచాడొకడు, ఇక దంచేస్తాడులే అన్నాడొకడు. అందుకేరా యీమధ్య మనతో పలకడం కొస్త తగ్గించేడు. మాతో చెప్పకుండా ఏన్నాళ్ళయినా నీకంత యిదీ! అని ముందుకొచ్చాడొక అనుచరుడు.

ఇవన్నీ మౌనంతో విని సుబ్బారావు ఒక్కసారి విజృంభించేడు. "చూడండిరా అబ్బాయ్, అవి వ్రాసింది నేను కాదురా నాయనా." మిత్రులంతా గొల్లన నవ్వేరు. 'నీదగ్గర యింత చమత్కారముందని తెలీదురా కవీ' అంటూ.

"నేను చెప్పలేదురా, సుబ్బారావు బ్రహ్మాండంగా అబద్ధమాడగలడని" అని పోజు పెట్టేడొక మిత్రుడు.

"అబ్బబ్బబ్బ! నాయనా అవి వ్రాసింది సుబ్బారావు వీడు కాదురా బాబూ" అని వేలెట్టి తన్ని చూపించుకున్నాడు మన సుబ్బారావు.

"డొక్కపరా తంత్రీ, ఎడిపెట్లా తప్పించుకుందామని చూస్తున్నావే యింకెందుకురా నీకీ అజ్ఞాతవాసం, అని నవ్వుతెప్పేడొక 'అరె'మిత్రుడు. ఇదొక్క[illegible]

# ★ సుబ్రావ్ ది గ్రేట్ ★

ఖర్మ అని సుబ్బారావు మనసులో అనుకుని పైకి” అయ్యా మీరు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి, అవి వ్రాసింది మాత్రం నేను కాదు అని కొంత విసుగ్గానే వ్యక్తం చేశాడు.

“కొయ్యకోయ్ సుబ్బా! కొయ్యకు, నీ రాత మాకు తెలియదంటా వేమిటి? అయినా నీ తెలివి తక్కువగాని ఎవరోయ్ నువ్వు మోసగించేది, మమ్మల్నా అని ఎగతాళి చేశారందరూ.

సుబ్బారావు కోమూల ఉడుకుమోత్తన పెంచుకున్నది. ఆడపిల్లలా ఒక పిచ్చేడుపు లంకించుకునే వాడే కాని, ఓర్పు చాలా మిగిలి పోయిందతనిలో. స్వామీ, నువ్వెవరు నాయనా నాపాలిటికి యముడిలా దాపురించేవు” అన్నాడు అసలు రచయిత మద్దిలింది మన సుబ్బారావు. ఎవరెందుకొతారు. ఇక్కడే ఉన్నాడు. ఆ పరమాత్ముడు, ఇప్పుడు మాకో టీపార్టి చెయ్యబోతున్నాడు అతి చలగాలోని కోర్కె జారవిడిచే డొక వినాయకుడు.

“అదా నాయనా, సంగతి” ఆ కాస్త కాఫీ నీళ్లకా యీ కాయ కష్టమంతా అన్నాడు సుబ్బారావు ఏకో సగం భారం తగ్గినట్లు.

“ఒరేయ్ నువ్వట్లా అంటె మేమూరుకోం తెలుసా, అసలీ ‘ఆర్టికల్సు’ వ్రాసింది నువ్వు కాదని దుష్ప్రచారం గూడా చేస్తాం అని బెదిరించే రంతా.

“చెయండ్రా, నాయినా, చెయ్యండి” అట్లాగయినా నిజం బయటపడుతుందని సుబ్బారావు అన్నాడు.

“మరి అదే మేమూ భయపడేది, నిజం నిలకడ మీద తెలిసిపోతుందో'' అని జంకేరు.

“అయితే యింతకూ మీగొడ వేమిటోయ్' ఉండా కిప్పిందేనా మరేమయినా ఉందా? ప్రశ్నించేడు సుబ్బారావు. అనవసరంగా యిప్పుడిదేమి టనుకుంటూ.

“అంతకంటే యింకేమి కావాలిరా మాకు-నువ్వు, బంగారంలాంటి సోమేశ్వర సుబ్బారావ్వి, మా మిత్రుడివి, యీ విధంగా సాహిత్యరంగంలో ఒక గ్రేట్ మాన్వి అయి పోతుంటే మాకుమాత్రం గర్వచిహ్నంగాదా ఏమిటి? ఇలాగే కలకాలం వ్రాస్తూఉండు. ముందు మాకుమాత్రం ఒక పార్టీ దయచెయ్యి అన్నారు ఏకకంఠంతో.

“అయ్యోరామా అవి వ్రాసింది నేను కాదంటూంటే, మీ కేమైనా మతిపో యిందా?” అయినా ఆ టీపార్టి కాస్తచేస్తే, మీ పీడ వదులుతుందిగా - సరే పదండి అన్నాడు సుబ్బారావు.

“అదిగో ఆ దొంగవేషాలే వద్దంది, నువ్వే నని ఒప్పుకుంటేగాని మేం తీసుకోం” అన్నారంతా.

“ఆ పనిమాత్రం నే చెయ్యనని, ‘సాయంత్రం రండయ్యా మీ గొడవా మీరూనూ’ అని వదిలించుకుంటుండగా అందరూ నిష్క్రమించేరు.

మన సుబ్బారావే ఆ రచనలు వ్రాసి ఉంటే, తనకు సన్మానం చెయ్యమని పెద్దల వెంట తిరిగేవాడే వాళ్ళకు విసుగెత్తేంత వరకూ. కాని అలా కాకపోయె; ఈ ‘ఫ్రండ్స్’ పీడ వదిలించుకునేందుకు ఆనాడు సాయంత్రం భారీఎత్తున ఒక ‘టీపార్టీ’ ఏర్పాటుచేశాడు సుబ్బారావు. టీ పార్టికి అనుకున్న అంచనాకి తగ్గకుండా అందరూ హాజరయ్యారు సుబ్బారావుమీదఉండే అభిమానం కొద్దీ, ఎవ్వరూ ‘లేట్’ చెయ్యలేదు అతన్ని బాధపెటడం యిష్టంలేక.

అహూతులంతా, అసలు కార్యక్రమానికి ఉపక్రమించకముందే, సుబ్బారావుగారు వేరె యింకో ‘ప్రోగ్రాము’ ప్రకటించేరు. సుబ్బారావుగారి కత్యంతప్రియమైన విషయమది. అదేమిటో అని అందరూ అనుకుంటుండగా, ఆయన తన అచ్చుగాని కొన్ని రచనలను చదివి వినిపించేరు. వాటిలోఉన్న కాస్త గొప్పదనమూ, అక్కడఉన్న ఒకరిద్దరికితప్ప మిగతావారి కంతు పట్టలేగు. కాని అంతా ‘సెబాష్’ అని మెచ్చుకున్నారు.

టీపార్టీ నిక్షేపంగా జరిగిపోయింది. ‘ఫ్రండ్స్’ శలవు పుచ్చుకున్నారు.

సుబ్బారావులాంటి విచిత్ర వ్యక్తులను చూస్తే, యిలాగే హేళనచెయ్య బుద్ధౌతుంది కొందరికి. కవిత్వంమీద అందరికున్న పిచ్చికంటే సుబ్బారావుకి మరోక పాలు హెచ్చు. అలెగ్జాండరు పోప్ వ్రాసిన ఒక గ్రంథంలో యిలాగే ఉన్మత్తుడైన ఒక కవి ఉండేవాడు. దోవనపోయే ప్రతి విడ్డోని ఆపి తనరచనలు వినమని కూర్చునేవాడు ఆయనకి తమ్ముడే మన సుబ్బారావు. అందుకని అతనిలోని బలహీనతని చక్కగా కనిపెట్టి మిత్రులు అతన్ని తగిన రీతిన సత్కరించేరు. వారందరికి ఆ పత్రికలో ప్రకటితమైన రచనలు మన సుబ్బారావ్వి కావని ఋణంగా తెలుసు. సుబ్బారావలా రాయలేడేమోనని గూడా వారను మానపడారు కేవలం వాళ్ళకున్న వాక్చమత్కృతితో సుబ్బారావుని తబ్బిబ్బుచేసి, వారి ముక్కుపడి వాళ్ళు తీర్చుకున్నారు. అంతే, చివరికి లోలోపల అసలు యీ రచనలుచేసిన శ్రీ సుబ్బారావెవడో అని గూడా కొంత్తాక్క పోలేదు.

సుబ్బారావు సాహిత్య చరిత్రలో ఇదొక విచిత్ర ఘట్టం.

ఇది జరిగిన కొద్ది రోజులకే మన సుబ్బారావుని యిన్ని ముప్పతిప్పలు పెట్టిన ఆ ఒరిజినల్ సుబ్బారావుగారు పత్రికకి రచనలు పంపడం మానేశారు.

మన సుబ్బారావుగారిలోగా ఎంతో కృషి చేశారు. ప్రస్తుత రచనాపద్ధతిని బాగా అకళింపుచేసి కొన్నారు. పరిస్థితు లన్ని అవగాహన చేసుకున్నారు. రాయడం బాగా నేర్చుకున్నారు. అయినా తనలో ఏమైనా మార్పొచ్చిందేమో చూద్దామని అదే పత్రికకి మన సుబ్బారావుగారు కథాని కలు గేయాలు కొన్ని పంపేరు.

సరస్వతి కటాక్షించడంతో సుబ్బారావుకి స్టార్ తిరిగింది, అదృష్టం పండింది. ఈయన రచనలు పంపినవి పంపినట్లుగా పత్రికల వాళ్ళు ప్రకటించేరు. పత్రికలో బంగారం సామేశ్వర సుబ్బారావు పేరు హేమంలా వెలిగిపోయింది. సుబ్బారావుని అప్పుడే తమ అభిమాన రచయితగా ఎన్నుకున్నవారు లేక పోలేదు పాఠకులలో. సుబ్బారావు ఆశయం ఈనాటికి సిద్ధించింది తన రచలననూ ప్రశంసిస్తూ అనేకమంది పాఠకులు వ్రాసిన లేఖలు చూచి మురిసి పోయాడు సుబ్బారావు.

ఒకనాడు తన మిత్రులందరిని ఒకచోట సమావేశ పరచి సుబ్బారావు “చూడండోయ్ మన రచనలు యిప్పుడు చూడండి.” అని వాళ్ళముందు ఓ పత్రికలకట్ట విసిరేశాడు. హీరోలా ఒక పోజుపారేసి. వాళ్ళ షేక్ హాండ్ల కోసం, చిరునవ్వుల కోసం ఎదురు చూచేడు. వారంతా ఆ సహజంగాఒక నవ్వు నవ్వి కొయ్యవోయ్, కోయ్, నీసామ్మోం పోయింది అన్నారు.

“కోతలా గీతలా; కోతలుకోసే ఖర్మ నాకేంటి? అన్నాడు కొంత సంతోషం తగ్గించుకుని.

విషపు నవ్వులు నవ్వబోతూ ఆపుకుని వాళ్లంతా సీరియస్‌గా పోజుపెటి “మాకు తెలుసులేవోయ్,యివి ఎవరు వ్రాసిందీనూ?” అన్నారు నిరశనగా.

“అంటే మీ ఉద్దేశం” కొంత ఆశ్చర్యాన్ని వ్యక్తంచేస్తూనే ప్రశ్నించేడు సుబ్బారావు.

“ఆఁ ఏంలేదు. అనవసరంగా అసలువాణ్ణి అన్యాయం చేస్తున్నావే అని బాధపడు తున్నా” మన్నారు.

“అసలు వాడేమిటయ్యా! నిజంగా యివి వ్రాసింది నేనే అని చెప్పుకున్నాడు.

“చాల్లే ఊరుకో” అన్నారు వారంతా.

(48-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**(28-5-58 మొదలు 3-6-58 వరకు)**

### గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| | కే బు శు | ర | |
| కు | 28 తేదీని కుజుడు మీనములో ప్రవేశము. 2 తేదీని బుధుడు వృషభములో ప్రవేశము. 2 తేదీని శని వృశ్చికమునకు వక్రించును. కన్య, తుల, వృశ్చిక ధనస్సులలో చంద్రుడు. 28 న కర్తరీ త్యాగము. | | |
| | | | |
| శ | | రా | గు |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము మీ ప్రయత్నములకు ధనలోపమువల్ల ఆటంకములు వస్తాయి అనుకున్నవారు మీకు సమయానికి సహాయము చెయ్యరుగాని తలవనితలంపుగా కలుసుకున్న వ్యక్తి సహాయమువల్ల వారాంతమునకు కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకూ అధికారుల ఒత్తిడివల్ల వనప్రదేశములకు బదిలీయగుటగాని, కెలవు పెట్టుటగాని జరుగును. వర్తకులకు మొదట్లో నిరుత్సాహముగాయున్నా వారాంతమునకు లాభిస్తుంది. 28, 29 తేదులలో కార్యక్రమము. 30 న ఆటంకములు, ధనాభావము. 31, 1 మిత్ర సహాయము, కార్యసిద్ధి. 2 న ఇంట్లో వారికి అనారోగ్యము, ఆందోళన, బదిలీ లేక కెలవు పెట్టుట. 3 న నూతనుల పరిచయము, విచిత్ర వస్తు సంపాదన.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము యత్న కార్యములకు ఆటంకములు కలుగుతాయి. దగ్గర బంధువుల అనారోగ్యము కొంత ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగస్థులకు ట్రాన్సుఫరయే సూచనలున్నవి. మీకు దైవభక్తి ఎక్కువగుటచేతను చేయవలసిన ప్రయత్నము చేసి దైవముపై భారము వదులుటచేతను, ఫలసిద్ధిని తుదకు పొందుతారు. 28, 29 కార్యాచరణకు ప్రయత్నములు 30 ఆటంకములు. 31, 1 కార్యలాభము. 2 న ఆరోగ్య చింత. 3 ధనలాభము, దేవతాదర్శనము.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు ఎక్కువగుటచేతను, రావలసిన డబ్బు చేతికందక పోవుటచేతను, అశాంతి కలుగుతుంది. కోర్టువ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. ఇతరులకొరకు పాటుపడా మాటదక్కక నిందల పాలౌతారు. ఉద్యోగస్తులకు క్రొత్తసమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారము పట్ల పేచీలువచ్చి అశాంతి. భార్యకుగాని ఇంటో మరే ఇతర స్త్రీకిగాని అనారోగ్యము కలుగుటచేత ఆందోళన. 28, 29 కార్యభారము, త్రిప్పట. 30 ధనాభావము, ఆటంకములు, 31, 1 కార్యలాభము 2 ఆరోగ్యచింత. 3 ధనయోగము, మనశ్శాంతి.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము అనుకున్నట్లుగా పనులు జరగవు. ధనాభావముచే ఇబ్బంది కలుగుతుంది.

## బి. నరసింగరావు

బంధువులకు సహాయము చేయబోయి జరగక మాటపడి మనోవ్యధ పొందుతారు. వాహనములవల్లగాని ఎత్తైనస్థలమునుండి పడుటవల్లగాని అవయవములకు గాయములు కలుగవచ్చును. యంత్రములు నడుపు నిపుణులకు, రసాయన శాస్త్రజ్ఞులకు, గనుల యజమానులకు, భూస్వాములకు కష్టముతో కూడిన లాభము. 28, 29 కార్యాలోచన, 30 ఆటంకములు, నిందలు, 31, 1 కార్య లాభము. 2 న ప్రమాదం.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగప్రదము. గత రెండు వారములనుండి కలుగుతూవున్న ఆటంకములను గడిచి, అధికారుల సహాయముచేతను, మీ మాటకారితనముచేతను కార్యసిద్ధిని పొందుతారు. ఆర్థిక స్థితి బాగుపడుతుంది. 28, 29 తొందరలు తగ్గి కార్యక్రమము ఒకదారిని పడుతుంది. 30 ప్రయాణము. 31,1 అధికారుల ఆదరణ, కార్యసిద్ధి, ధనలాభము, బంధు దర్శనము 2 అలసట. కవులకు, చిత్రకారులకు, నటులకు యోగకాలము

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగకాలము, ఉన్న యిబ్బందులు తీరిపోతవి. అనుకున్న సొమ్ము చేతికివస్తుంది. కోర్టు వ్యవహారములు అనుకూలముగా తీర్పు అవుతాయి. పిల్లల అభివృద్ధికి కొన్ని ఏర్పాట్లుచేస్తారు. నూతన కార్యములు ప్రారంభిస్తారు. పండితులతో జ్యోతిషగోష్ఠి జరుపుటచే నూతనాంశాలు తెలుసుకొంటారు 28,29 తేదీలలో ధనయోగము. 30 నూతన కార్యాలోచన 31,1 ఉద్యోగస్తులకు అధికారవృద్ధి పండితగోష్ఠి, న్యాయవాదులకూ, పండితులకు, ఉపాధ్యాయులకు మేలు కాలము.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీ పదవి, దానితో ఆర్థిక స్థితి ఎక్కువవుతాయి, బంధువులను కలుసుకుంటారు. కవులు, గాయకులు మొదలగు కళాకారులతో వినోదిస్తారు. ఇంటోవారు ఆరోగ్యము కోలుకుంటారు. దూరస్థులైన ఆప్తుల క్షేమము తెలియుటచే ఆందోళన తొలగుతుంది నీటిపై ప్రయాణము చేయవలసి వుంటుంది. ద్రవపదార్థములు, ప్రత్తి, దూది, బియ్యం, వెండి వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు నటీ నటులకు యోగకాలము, 28,29 కార్యసిద్ధి, ధనయోగము. ఉద్యోగసులకూ అనుకూలము. 30 అధిక ఖర్చులు. 31,1 కవితాగోష్ఠి, వినోదము, విందు.

### *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీకు యోగదాయకము. గత వారము అసంపూర్తిగా నిలిచిన కార్యములు ఈ వారము లాభకరముగా ముగుస్తాయి. కవులు నూతనరచనలు ప్రారంభిస్తారు. నూతనోద్యోగలాభం కలుగుతుంది. బంగారము, వజ్రములు, నూలు బట్టల వ్యాపారస్తులకు క్రయ విక్రయములలో లాభము. వాహనయోగము శయ్యాసుఖము కలుగుతవి. కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలం. 28, 29 కార్యసిద్ధి, ధనయోగము, నూతనోద్యోగలాభము. 30 ఖర్చులు. 31, 1, శుభకార్యచింత, విందు, వినోదము, వాహన యోగము.

### * ఆశ్లేష [డి, డూ, డే, డో] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. మీరు ఇతరులకు యిచ్చిన డబ్బు సమయమునకు మీకు తిరిగి రానందున వ్యధచెందుతారు. వింతవార్తలను వింటారు. పరాక్రమంవల్ల ఘనత కలుగుతుంది. రాజకీయ పనులలో ప్రయాణంవల్ల ధనలాభం పొందుతారు త్రిప్పటవల్ల అకాల భోజనము చేయుటచే

#  నక్షత్రఫలితాలు 

శరీరములో వేడి, కళ్ళమంటవంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ సేవ చేయుటవల్ల మేలు కలుగుతుంది. 28, 29 తేమలని కార్యక్రమము, ధనాభావము, 30 అనారోగ్యము. 31, 1 ప్రయాణము, కార్యసిద్ధి, ధనలాభము. 2 ఆందోళన.

## * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము మీకు అంత యోగదాయకము కాదు. మిత్రులెవరో, శత్రువులెవరో తెలుసుకోలేక పోతారు. కార్యసాధనలో అనేక ఆటంకములు కలుగుతాయి. వ్యాపారస్థులు దగా పొందుతారు. ఉద్యోగస్థులకు బదిలీ కావచ్చును. మనస్సు చంచలముగా వుంటుంది. వారాంతమున ప్రయాణము చేయుచున్నప్పుడు కలిసినమిత్రునిసహాయమువల్ల కార్యసిద్ధి పొందుతారు. 28, 29 కార్యభంగము. 30 ప్రయాణము. 31 1 మిత్రసహాయము, కార్యసిద్ధి. 2 బదిలీ సూచన, చంచల స్థితి.

## * పూర్వఫల్గుణి (పుబ్బ) *
## మో, టా, టి, టూ

ఈ వారము మీకు మిశ్రమయోగము. స్త్రీలతో కలహమువల్ల విరక్తి చెందుతారు. యత్నకార్యములకు ఆటంకములు కలుగుతాయి. మీరు దైవముపై భారముంచి వ్యవహరించుటవల్ల నష్టద్రవ్య లాభమును పొందుతారు. తీర్థయాత్రలలో చిత్రవిచిత్ర వస్తువులను చూస్తారు. అమితముగా తినుటవల్ల శరీర పీడ కలుగుతుంది. 28, 29 అనిశ్చితము కార్యక్రమము. 30 కలహము. 31, 1 ధనలాభము, ప్రయాణము, దేవతాదర్శనము, వింతవస్తువులను చూచుట. 2 రాజ వార్తా ప్రసంగము, అనారోగ్యము.

## * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
## [టే, టో, పా, పీ]

ఈ వారము బుద్ధిమాంద్యము ఎక్కువగా వుంటుంది. తలపెట్టినకార్యములలో జయము లేకపోవుట, వ్యర్థముగా తిరుగుట, సజ్జన విరోధమువంటి చెడు ఫలితాలు కలుగుతాయి. అపరదినుసులు, ఉప్పు, నూనె, నువ్వులు వ్యాపారస్థులకు లాభం. ఉద్యోగస్థులకు తోటివారితో సరిపడక శెలవు పెట్టవలసి వస్తుంది. 28, 29వ కార్యాలోచన. 30 కార్యభంగము, విరోధము 31, 1 వ్యాపారస్థులకు లాభము, కోర్టు వ్యవహారములో జయము. 2 న ఉద్యోగస్థులు శెలవు పెట్టుట.

## * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము మీకు అంతయోగదాయకము గాదు. ప్రతిపనికి ఆటంకములు కలుగుతాయి. కాని పట్టుదలతో ప్రయత్నించి తుదకు జయము పొందుతారు. అనుకున్న డబ్బు సమయమునకు రాకపోవుటవల్ల సోదరులు కోరిన సహాయము చేయలేక మనోవ్యధపొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల పోటుమాటలవల్ల అశాంతి కలుగుతుంది. కురుపులు వేయుటగాని, అవయవములకు దెబ్బలు తగులుటగాని వుంటుంది. రసాయనిక శాస్త్రజ్ఞులకు, భూస్వాములకు, ఇంజనీరింగుశాఖలోవారికి శ్రమ ఎక్కువైనా మేలుగా వుంటుంది. 28 29 త్రిప్పట, శ్రమ. 30 ధనలోపము. 31, 1 కార్యలాభము. అన్నిరంగములలో సూర్తి. 2 న ప్రమాదభయం.

## *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము మీపలుకుబడివల్ల కార్యసిద్ధిని పొందుతారు. ఆర్థికస్థితి బాగుంటుంది. నూతన మిత్రలాభము కలుగుతుంది. ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణచే వృద్ధికలుగుతుంది. కవులు నూతనరచనలు ప్రారంభిస్తారు. జ్యోతిష విద్యాగోష్ఠి చేస్తారు. డాక్టర్లకూ, గణితశాస్త్రజ్ఞులకూ, కవులకూ, చిత్రకారులకూ, నటీనటులకూ యోగకాలము. 28, 29 కార్యానుకూలత, ధనయోగము. 30 అధిక ఖర్చులు 31, 1 విద్యాగోష్ఠి, ఈశాన్యదిక్కునుండి శుభవార్త. 2 న బద్ధకము.

## * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈవారము మీకు ధనయోగము. భాగ్యవృద్ధి అవుతుంది. తలపెట్టిన పనులు లాభకరముగా ముగుస్తాయి. కోర్టువ్యవహారములు అనుకూలమవుతవి. పండితగోష్ఠివల్ల, ఉత్తమ

---

**—ధరలు :—**

నూలు, వస్త్రములు : చురుకగును.

నూనె దినుసులు: కొంచెము చురుకగును.

బెల్లము, పంచదార, చింతపండు: సులభమగును.

ఆహారధాన్యములు : కొంచము చురుకగును.

పప్పుదినుసులు : సామాన్యముగా వుండును.

వెండి, బంగారము: మందము.

గాలితో కూడిన వర్షములు అన్నివైపులా కురియును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, హృషీకేశుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

---

గ్రంథపఠనమువల్ల విజ్ఞానాభివృద్ధి పొందుతారు. పిల్లల క్షేమాభివృద్ధి సంతోషము నిస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు యోగకాలము. 28, 29 ధనాదాయము, కార్యసిద్ధి. 30 అధిక ఖర్చులు. 31, 1 పండితగోష్ఠి, ఉద్యోగస్తులకు మేలుకాలము. 2 కలవరము. విద్యార్థులకు జయము.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము మీ యత్నకార్యములు లాభిస్తాయి. ఆర్థిక స్థితి బాగుంటుంది. బంధుమిత్రులతో కలసి వినోదాల్లో పాల్గొంటారు. దక్షిణదిక్కునుండి శుభవార్త వింటారు. నీటిపై ప్రయాణము చేయవలసివుంటుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండివ్యాపారస్తులకు యోగకాలము. విద్యార్థులకు పరీక్షఫలితాలు అనుకూలముగా వుంటవి. కవులకు, గాయకులకు, కళాకారులకు మేలుకాలము. 28, 29 కార్యసాధన. 30 మానసికాందోళన. 31, 1 ధనలాభము, శుభవార్త. 2 చాంచల్యము.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈవారము మీఉద్యోగము, హోదా, ఆదాయము ఎక్కువవుతాయి. గతవారము అసంపూర్తిగా వుండిపోయిన పనులు ఈవారము పూర్తి అవుతవి. పరోపకారమునకు పాటుపడి కీర్తినిపొందుతారు. కోర్టువ్యవహారములు సుముఖమవుతాయి. నూతన గృహనిర్మాణ ప్రారంభము చేసారు. స్త్రీలకు అలంకారప్రాప్తి. వర్తకులకు విలువగల వస్తువుల క్రయ విక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 28, 29 ధనలాభము, కార్యానుకూలత. 30 ప్రయాణము. 31, 1 పరోపకారము, శుభకార్యములలో పాల్గొనుట, విందు, వినోదము. 2 న అధిక ఖర్చులు.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈవారము ఆదాయాభివృద్ధికి ధైర్యముతో మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కార్యభారము ఎక్కువవుతుంది. ప్రభుత్వ వార్తా ప్రసంగములు, వింత వార్తలు వినుట, పరాక్రమమువల ఘనత సంపాదించుటవంటి కార్యాలలో నిమగ్నులవుతారు. శరీరములో వేడి, కళ్లమంట, తలపోటులాంటి అనారోగ్య సూచనలు కనబడగానే అవుషధసేవ చేయుటవల్ల మేలు కలుగుతుంది. ఉద్యోగస్తులకు బదిలీ సూచన లున్నవి. వర్తకులకు రావలసిన సొమ్ములు వసూలుకాక ఇబ్బంది. 28, 29 రాజకీయాలలో జయం. ధనలాభము 30 బదిలీ సూచన. 31, 1 కార్యానుకూలత, ప్రయాణమువల్ల లాభము. 2 అనారోగ్యము

### * మూల [యే, యో, బా, బి] *

ఈ వారము నిలకడలేని ఆలోచనలతో ఏపనీ చెయ్యలేకపోతారు. ధనలోపంవల్ల ఇబ్బంది. శ్రమపడినప్పటికీ మాటదక్కదు. గృహమందున్న వృద్ధుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆకస్మికముగా కలుసుకున్న స్నేహితుని సహాయమువల్ల వారాంతమునకు చిక్కులు తొలిగి ఫలసిద్ధిని పొందుతారు. అనుకోకుండా ప్రయాణము చేయవలసివస్తుంది వర్తకులకు వారాంతమున లాభము 28 29 అమితఖర్చులు, 30 కార్యరంగములో ఆటంకములు 31, 1 ప్రయాణము మిత్రసమాగమము కార్యసిద్ధి 2 న ఆరోగ్య చింత 3 లాభయోగము విచిత్ర వస్తు సంపాదన.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈవారము మీకు మిశ్రమయోగము. అనుకున్నట్లుగా పనులు జరగవు. ధనలోపమువల్ల గృహావసరములు తీరక కలతలు. కోరిన సహాయము లభించదు. దైవముపై భారము వేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. వర్తకులకు మొదట్లో త్రిప్పట ఆశాభంగము కలిగినను వారాంతమున లాభము 28, 29 పుణ్యపురుషులసాంగత్యము ఆత్మవికాసము. 30 ధనలోపము కలతలు 31 1 మిత్రసహాయము 2 చెడు వార్త వినుట 3 నష్టద్రవ్యలాభము.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము కార్యభారము చే శ్రమ ఎక్కువ. ఇతరులకొరకు శ్రమపడినను చేసిన ప్రయత్నము కాకపోవడంవల మాటపడతారు. కోర్టు వ్యవహారములు మీ పరము అయినా ఖర్చులు ఎక్కువగుటచే అసంతోషము కలుగదు. భార్యకు ఆరోగ్యము చెడుటవల్ల ఆందోళన కలుగుతుంది. అన్ని విధాలా అసంతృప్తిగా వుంటుంది. 28,29 పరోపకారము. 30 విఘ్నములు, కార్యభారము త్రిప్పట. 31,1 కార్యలాభము. 2న ఆరోగ్య చింత. 3న వర్తకులకు లాభయోగము.

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము మీ ప్రయత్నములు ఫలించక అనేక చిక్కులకు లోనౌతారు. పట్టుదలతో ధైర్యముగా కార్యరంగమునకు దిగి తుదకు ఫలమును సాధిస్తారు. తోబుట్టువు సహాయమువల్ల చాలావరకూ ధనలోపము తీరుతుంది. అధికారుల ఒత్తిడిచే ఉద్యోగస్తులు శెలవు పెట్టవలసి వస్తుంది. యంత్రములు, అగ్ని మొదలగువాటివల్ల కలిగే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. భూస్వాములకు, రసాయన ఎరువుల వ్యాపారస్తులకూ, గనుల యజమానులకు మేలు కాలము. 28. 29 తీరిక కాని కార్యక్రమము. 30 కార్యభంగము. 31, 1 బంధు సహాయము ధనయోగము. 2 ప్రమాదము. 3 కార్య లాభం.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈవారము మీ బుద్ధిబలముచే యత్న కార్యములలో ఫలసిద్ధిని పొందుతారు. జ్ఞాతులవల్ల ధనసహాయము, కార్య సహాయము కూడా కలుగుతవి. ఈశాన్య దిక్కునవున్న ఆత్మ బంధువుల క్షేమవార్త తెలియుటచే ఇదివరకు కలిగిన ఆందోళన తీరుతుంది. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. విద్యార్థులకు పరీక్షలలో జయము వైద్యులకు గణితశాస్త్రజ్ఞులకు కవులకు చిత్రకారులకు నటీనటులకు యోగకాలము. 28,29 ఆలోచనలు తెగని కార్యక్రమము. 30 చాంచల్యము 31, 1, 2 మిత్రసహాయము; ధనలాభము, ప్రయాణము. 3 న కార్యసిద్ధి, క్షేమవార్త.

### * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారము ఉత్సాహముతో కొత్త

# నక్షత్ర ఫలితాలు

పనులు మొదలుపెడతారు ధనాదాయము ఎక్కువవుతుంది. కోర్టుదావాలలో జయము కలుగుతుంది. పిల్లల అభివృద్ధికి అనువైన కార్యక్రమము ఏర్పాటుచేస్తారు. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. విద్యార్థులకు పరీక్షలలో జయము. 28. 29 పండితగోష్ఠి, విజ్ఞానవృద్ధి, 30 తీరిక లేని కార్యక్రమము. 31, 1 ధనలాభము కార్యసిద్ధి, 2 చాంచల్యము. 3 న అభివృద్ధి పుత్రులవల్ల సంతోషము.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

గత వారముకన్నా ఈవారము మీ ధనాదాయము ఎక్కువవుతుంది. తలపెటినపనులు అనుకున్నటుగా జరుగుతాయి. బంధుమిత్రులతో కలిసి కవితాగోష్ఠి, సంగీతసభలు మొదలగు వినోదములలో పాల్గొంటారు, దధి, క్షీర యుక్త మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో ఆరగిస్తారు. విద్యార్థులకు పరీక్షలలో జయము. నూలు, బటలు, బియ్యము, వెండి సరుకుల వర్తకులకు 28, 29 తేదీలలో లాభము. 30 న చాంచల్యము. 31, 1 వినోదము, విందు 2 న మానసికాందోళన. 3 కార్యలాభము.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, ధా] *

ఈ వారము మీరు తలపెటిన కార్యములు ఫలప్రాప్తిని పొందుతాయి. అనుకున్నదానికన్న ఎక్కువగా ధనలాభము కలుగుతుంది. పరోపకారము చేయుట చే సంఘములో కీర్తి కలుగుతుంది. పుణ్యకార్యములు చేసారు. మీకు వాహనయోగము, మీ భార్యకు అలంకారప్రాప్తి. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 28, 29 కార్యానుకూలత. 30 ప్రయాణము. 31, 1 పరోపకారము, పుణ్యకార్యాచరణ. 3 ధనలాభము

## * రేవతి [దే, దో, చా, చీ] *

మీ ఆదాయము ఈ వారము వృద్ధిపొందుతుంది. కాని మొదట్లో అందునుగురించి చేసే ప్రయత్నాలకు ఆటంకములు కలుగుతాయి. ధనలోపముచే గృహకలతలు కలుగుతాయి. అకాల భోజనమువల్ల అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధసేవవల్ల మేలు. గ్రహరాజైన రవికి శాంతిచేయుటము అన్నివిధాలా మంచిది. ఉద్యోగస్తులకు బాధ్యతతోకూడిన అధికార వృద్ధి. 28, 29 తేదిలలో కలుగుతుంది. 30 ప్రయాణము. 31, 1 కార్యలాభము. 2 న విఘ్నములు. 3 ధనలాభము





# వనితాలోకం

## ఈర్ష్య

ఈర్ష్య—ఇది చాలామంది ఆడవాళ్లలో సహజంగా వుంటుంది. దీన్నే ఓర్వలేనితనం అనికూడా అనవచ్చు. కాలం ఎంతో మారినా, స్త్రీలు ఎంత నాగరికులైనా ఈర్ష్య స్వభావంమాత్రం మారలేదు. కొందరు స్త్రీలు దీన్ని బయటికి కనపరచరు. కొందరు వెంటనే బయటపడిపోతారు. ఇంట్లో కోడలినిచూస్తే అత్తకు ఈర్ష్య, కోడలికి అత్తను చూచినా అంతే. ఆడపడచులకు వదిన అంటే ఈర్ష్య ఆమెకూ ఆడపడచులన్నా అంతే. ఇళ్లలో అంటే ఈ కాపలున్నవారికి ఇది మామూలే అనుకోవచ్చు. బయటిసంగతి చూద్దాం. ఇరుగుపొరుగువారిలో ఈ ఓర్వలేనితనం ఎక్కువపాళ్లలోనే వుంటుంది. ఉదాహరణకు ఒక చిన్న సంఘటన చెప్తాను.

ఒకరోజున మావారు మామూలుధరలలో రెండు చీరలు తెచ్చారు నాకు. మావారు చీరలపాకెటు తేవటం చూచి మా పక్కింటావిడ ఎవరూ పిలవకపోయినా తనే కల్పించుకొనివచ్చి "యేమిటమ్మాయి! అన్నయ్య పట్టుకొచ్చారూ!" అంది. మావారికంటే ఆమె యించుమించు ఓ ఆరేళ్ళయినా పెద్దదనుకుంటాను. ఆవిడకు మావారు అన్నట! అలా పిలవటంలో తప్పేమీ లేదనుకోండి. మావారు "యేమీ లేదమ్మా, రెండుచీరలు తెచ్చాను" అనేసరికి "ఓ యబ్బో పెట్టెనిండా చీరలున్నాయి! అవే సరిగ్గా కట్టుకోదునీభార్య. మరి ఇవెందుకన్నయ్యా!" అందామె బుగ్గలు నొక్కుకుంటూ. చూచారా! ఆ మాటలో ఎంత యీర్ష్య యిమిడివుందో. ఒకరింటిసంగతి మనకెందుకని మెదలకుండా వూరుకోటం నేర్చుకోవాలి మన స్త్రీలంతాను ఒక్కొక్కప్పుడు భార్యాభర్తల పోట్లాటలో కొంతమంది ఆడవాళ్లు ఎవరో తమరిని బొట్టుపెట్టి పిలిచినట్టు వెళ్లి చిన్నగా మండుతున్న మంటలో ఇంకో నాలుగు పుల్లలు విరచివేసి మంటల నెక్కువచేసి వస్తారు, ఎందుకలా చేస్తారంటే ఈర్ష్యవల్లే ఎక్కడయినా భోజనాలకో, పేరంటాలకో వెళ్లినా ఈ ఓర్వలేనితనంవల్ల అక్కడకూడ చిన్న చిన్న పోట్లాటలు వస్తాయి. నాకు ముందుగా వడ్డించలేదనో, లేక, నాకుముందు కుంకుమ ఇవ్వలేదనో, ఇలాగే ఏదో చిన్న విషయానికి పోట్లాట పెట్టుకుని ఆయింట్లోవారి మనస్సంతా నొప్పిస్తారు. స్కూల్లో చదివే పిల్లలు మొదల్కొని పండు ముసలివారు కూడా ఈర్ష్యకు లోనై ఒక్కొక్కప్పుడు అనర్థాలు తెచ్చుకుంటారు. మన ఆడవాళ్ల సంగతులు ప్రతిఒక్కటి రాయాలంటే ఓ పెద్ద గ్రంథంగా తయారౌతుంది. యేదో నాకు తెలిసిన కొన్నివిషయాలు మాత్రం రాస్తున్నాను. ఒక ఇంటావిడను చూచి ఇంకో ఇంటావిడ ఓర్వదు. ఆ యింటావిడ భర్త ఆమెకణిగి మణిగి వున్నాడనో—లేక మంచిజీతం తెస్తున్నాడనో ఈర్ష్య ప్రక్కింటావిడకాని, ఎదురింటావిడకాని యేదైనా కొత్తచీరనో, లేక, నగలనో అలంకరించుకుందంటే–అది చూచి ఆ వీధిలో కొందరు స్త్రీలు ఎంతో ఈర్ష్య చెందుతారు. ఆ ఈర్ష్యతో తమ భర్తలను పీడించో, లేక, లాలించో అలాంటి వస్తువులు తెప్పించుకొని తాము శింగారించుకుంటే అప్పటికిగాని వారికి కొంత తృప్తి కలుగదు. ఈ ఈర్ష్య అనేది ఎదటివారు చీరలు, నగలు పెట్టుకుంటేనే కాదు కలిగేది–తమ ఇంట్లోలేని యే చిన్న వస్తువైనాసరే – యితర్లు తెచ్చుకుంటే దావంతట అదే కలుగుతుంది! ఎదటివారు మంచి డబ్బుగలవారై వుండి వారు తెచ్చుకున్న ప్రతీది తెచ్చుకోలేని సామాన్య కుటుంబ స్త్రీలు వారిని ఆడిపోసుకుని ఆ యీర్ష్యను బయటపెట్టుకుంటారు. ఇలాంటి లక్షణాలు చాలామంది ఆడవారిలో వుంటాయి. ఓ పంపు దగ్గరనో–నూతి దగ్గరనో నలుగురు ఆడాళ్లు పోగయ్యారంటే ఆవిడ యిలాంటిదనీ – ఈవిడ అలాంటిదనీ ఎదటివారినిచూచి మూతి విరచుకుంటారు. దాన్ని "ఈర్ష్య" అంటే వారెంతమాత్రం ఒప్పుకోరు. వారి దృష్టిలో దీనికి లోకాభిరామాయణం అని మారుపేరు. కొంత అందవిహీనులు, అందమైనవారినిచూస్తే బాధపడతారు. దీన్నేమనాలి? ఈర్ష్యకాదా? ఓ భార్యా, భర్త కలసి "జాలీ"గా యే సినిమాకో, షికారుకో బయలుదేరారంటే ఆసుఖమెరగని ప్రక్కింటావిడ ఈర్ష్య పటలేక తుపుక్కున ఉమ్మివేస్తుంది! ఆ సమయంలో అక్కడెవరన్నా ఆడవాళ్ళుంటే ఆ అక్కసంతా వాళ్ళయెదుట వెళ్లగక్కుతుంది! అలా ఎవ్వరూ లేకపోతే పనిగట్టుకుని యేపుల్లమ్మ యింటికో మల్లమ్మ యింటికో వెళ్లి "మాకారామ్మా! మా ప్రక్కింటావిడ భోగం పాపలా సింగారించుకుని మొగుణ్ణి వెంబడేసుకుని ఎలా తిరుగుంటో!" అని ఆ దంపతులపై వున్న ఈర్ష్యనంతా కక్కుస్తుంది. ఈపటింపులు పెద పట్నాలలో పెద్దవాళ్లలో లేకపోవచ్చునేమో కాని, చిన్న వూళ్ళల్లో సామాన్యమైన కుటుంబాల్లో ప్రతిదినం ఎన్నో చూస్తుంటాం. ఇకపోతే సినిమాల దగ్గర ముఖ్యంగా నేలలో జనం నిండిన తరువాత వచ్చినవారిని ఎక్కడాకూర్చోనివ్వరు. వారు విసుక్కొని ఎక్కడయినా కూర్చున్నారంటే ఇక మొదలవుతుంది రగడ! "పెద్ద రాణిలాగ ఇప్పుడువచ్చి మా నెత్తిపై కూర్చోకపోతే త్వరగావచ్చి స్థలం చూచుకోరాదూ?" అంటారు. అంతేకాదు ఇంకా ఎన్నో బూతుమాటలతో ఆమె పాపాన్ని పరిహారం చేసారు. ఆ కూర్చున్నామె "ఎందుకలా గోల చేస్తారు. సర్దుకుని కూర్చుంటే ఇంకా నలుగురు కూర్చోవచ్చునంటే" అవును నీకేమే! మాట్లాడతావు గొడ్డుముండవు. మా పిల్లలను నీనెత్తిన పడుకో పెట్టాలంటావా?" అంటూ ఆమె మాతిని

శ్రీమతి ఇందిరా రాజ్

# నెట్ క్లాత్ పైన కుట్టుకునే డిజైన్సు

★ డిజైన్సు ★

ఈ మధ్య, పత్రికలో నెట్ క్లాత్ (దోమ తెర బట్ట) పైన కుట్టుకొనే డిజైన్సు వేయవలసిందిగా కోరుతూ కొంతమంది వనితలు వ్రాసారు. దీని మీద మనకు నచ్చిన డిజైన్సు వేసుకుని కుట్టుకుంటే చాలా అందంగా ఉంటుంది. ముఖ్యంగా దిండు గలీబులమీదకు, డోర్ కర్టెన్సుకు మధ్యనగాని, చుట్టు అంచులకుగాని ఈ డిజైను పనికి వస్తుంది. ఈ దోమ తెరమీద కుట్టుకొనే దానికి దారము కొంచెం లావుగానే ఉండాలి. ఎంబ్రాయిడరీ దారాలు వీటికి పనికిరావు. లావు దారాల ఉండలు బజారులో అమ్ముతారు. అవి రంగులో కూడా ఉంటాయి. అవి తీసుకొచ్చి వీటితో కుట్టే చాల సొగసుగా కనబడుతుంది. ఒక వేళ ఆదారాలు దొరకక పోతే ఎంబ్రాయిడరీ దారాలే విడదీయకుండా అంటే పోగులు రెండేసిగాక ఏడు, ఎనిమిది పోగులు కలిపి ఒకటిగా సూదికి ఎక్కించుకొని కుట్టుకోవాలి. ఇది కుట్టేటప్పుడు చాలా జాగ్రత్తగా దాని మీద దృష్టిపెట్టి లైన్సు తప్పిపోకుండా కుట్టుకోవాలి. ఏ మాత్రమైన ఏమరి ఉంటే గళ్ళు తప్పిపోయి అసహ్యంగా కనబడుతుంది.

1, 2, 3, 4 నంబర్లుగల డిజైన్సు గలీబుల మీదకు చుట్టు అంచులకు పనికి వస్తుంది. చుట్టు అంచులు కుట్టాక మధ్యన ఏదైనా డిజైను వేయకపోతే గుడ్డయొక్క కాంతి తగ్గుతుంది. అదే మధ్యన ఏదైన డిజైను వేస్తే ఎంత అందంగా ఉంటుందో చూడండి. 5, 6 నంబరుగల డిజైను దిండు గలీబుల మీదకు మధ్యన కుట్టుకుంటే బాగుంటుంది.

కుట్టే విధం:—కుడివైపు నుండిగాని, ఎడమ వైపు నుండిగాని కుట్టు మొదలుపెట్టితే గళ్ళు తప్పిపోకుండా జాగ్రత్తగా గమనిస్తూ కుట్టుకోవాలి. బట్ట చివర కుట్టు మొదలు పెట్ట కూడదు. కొంచెం బట్ట వదలి కుట్టు మొదలు పెట్టితే మరల దిండుకవరు దీనికి అతుకు వేసినపుడు మిగిలిన బట్ట సరిపోతుంది. కుట్టు ఇక్కడ ఉన్నట్లే అంటే ఒక గడి క్రిందకు, ఒక గడి పైకి వచ్చునట్లు దారముతో కుట్టుకుంటూ రావాలి. దోమతెర గుడ్డపైన గడి అంటే ఒక పోగు క్రింద, ఒక పోగు పైకి వస్తుంది. అలాగ మూడు వరుసలు, లేక నాలుగు వరుసలు ఒక గడి రెండేసి వచ్చునట్లుగా కుట్టుకుంటూ రావాలి. మధ్య మధ్యన ఒక్కొక్క వరుస గళ్ళు వదలాలి. ఇలాగ అన్ని డిజైన్సు కుట్టాలి. నాల్గవ డిజైనుకూడా మధ్య మధ్యన ఒక వరుస వదలి ఒకగడిలో రెండేసి వరుసలు వచ్చునట్లుగా కుట్టుకుంటూ రావాలి. ఇదే మాదిరి 5వ డిజైనుకూడా రెండేసిగళ్ళు వదులుతూ ఒక గడిలో రెండేసి వరుసల దారము వచ్చునట్లు కుట్టుకుంటూ రావాలి. 6వ డిజైనుకూడా అక్కడవున్న మాదిరే గళ్ళు లెక్క పెట్టుకుంటూ కుట్టుకోవాలి. ఇది అంతా ఇలా కుట్టి పూర్తయినాక చాలా అందంగా కనబడుతుంది. దీనికూడా పైవిధంగానే గళ్ళు లెక్క పెట్టుకుంటూ గలీబు మధ్యన చుట్టూ పువ్వుమాదిరి కుట్టాలి. కుట్టినాక ఇది ఒక పుష్పమువలె ఎంతో అందగా

పి. లీలావతి (నెల్లూరు)

## ఈర్ష్య

పోసవపోతారు. ఆరుగురు కూర్చునే స్థలాన్ని ముగ్గురు పిల్లలతో ఆక్రమించుకొని, కొందరు మహా వైరాగ్యం చెప్తారు. "అం...మనం ఈ స్థలాన్ని నెత్తిన కట్టుకుపోతామా? కాస్సేపు కూర్చుని పోటానికి ఈ పోట్లాటెందుకూ!" అని. అలా అన్నావిడ దగరకె వెళ్ళి కూర్చుంటే "అయ్యో! నేను కాళ్లు చాచుకోకుండా ఇక్కడొచ్చి కూర్చున్నావే! నీకేం పోయే కాలమొచ్చిందే!" అంటూ దీవిస్తుంది! చూచారా? న్యాయ మెల్లా వుందో? అందుకే పెద్దలన్నారు "నూరు జాట్లయినా ఒకచోట ఇముడుతాయి కాని, మూడు సిగలు ఇమడవని. ఆమెకూడా మనలాంటి స్త్రీయేకదా! ఆమెను చూచి యెందు కీర్ష్య పడాలి? గౌరవిద్దా మనుకోరు. 'ఈర్ష్య అనేది ఒకరకంగా కాదులెండి; పరిపరి విధాలుగా పరిశీలిస్తే ముసలివారు, పిల్లల్ని చూచి పెద్దలు, పెద్దల్ని చూచి పిల్లలు బీరపీచులాగా ప్రతివారిలోను ఏదో ఒకరకంగా వుంటుందనుకుంటాను. ముఖ్యంగా భార్య ఏ ఇతర స్త్రీనైనా తరచూ చూచాడంటే-అప్పుడు చూడాలి ఆ భార్యయొక్క ఈర్ష్య! ఈర్ష్యతో ఏమీ తెలియని అమాయకురాలిపై లేనిపోని అభాండాలన్నీ ఆ ఇల్లాలు కల్పిస్తుంది. ఆమెను చూడగానే కారాలు మిరియాలు నూరుతుంది. ఒక్కొక్కప్పుడు ఆ కోపాన్ని అంట్ల గిన్నెలమీద, పిల్లల మీదా కూడా చూపుతుంది. స్త్రీలకు వయస్సుతోపాటు ఈ యీర్ష్యకూడా అభివృద్ధివుతుంది. మొగవారిలో ఈర్ష్య అనేది వుండదని కాదు. కాని వారు ప్రతి చిన్నవిషయానికి అంత నీచంగా బయటపడరు. ఈ వ్యాసం రాసిన నేను మాత్రం ఆడదాన్ని కానా? అందుచేత నాలో మాత్రం ఈర్ష్య లేదా అని పాటిపోదరీమణులు అడగవచ్చు. కాని నేనూ అందరిలాంటి ఆడదాన్నే— నాలోనూ ఈర్ష్య అనేది లేదని నేనెప్పటికీ చెప్పను. కాని మనం అందరం ఈర్ష్య వదలి ఏకమత్యంగా ఎప్పుడుంటామా అనే నా ఆదుర్దా! ★

కనబడుతుంది. ఈ డిజైన్స్ కుట్టుకుంటే ఇంకొకసారి బాగుంటుందని అనిపిస్తుంది. ఇక 6 వ నెంబరుగల డిజైను చూసేదానికి మామూలు డిజైన్‌లాగ కనబడుతూ ఉంది. ఇది ఎలా కుట్టాలో అని కొంతమందికి సందేహం కలుగవచ్చు. ఈ డిజైనును ఒక పేపరుమీద ట్రేసు తీసుకొని సెట్ క్లాత్ మీద మూలలకు ఈ ట్రేసు తీసిన కాగితాన్ని పిన్నులతో గుచ్చి ఆ డిజైను ఎలా ఉందో అలాగే కుట్టుకుంటూ రావాలి. గళ్ళు ఎక్కడైనా తప్పిపోతే మనం కుట్టుకునేటప్పుడు సరిచూసుకోవాలి. ఈ డిజైన్స్ అన్నింటికి మనకు నచ్చిన కలరుదారాలు వాడుకోవచ్చును. 6 వ నంబరుగల డిజైనులో ఆకులకు పచ్చ, పుష్పాలకు ఎఱుపు లేదా రోజా, గుండ్రాలకు ఊదాదారాలు వాడితే బాగుంటాయి. ★





వేసవికాలము వచ్చింది. ఇల్లు, వళ్ళు, పరిసరములు చల్లగా ఉంచుకోవాలని ప్రతివారికి తహతహగా ఉంటుంది. ఈ వేసవి వెళ్ళేవరకు దుస్తులు, ఆహార విషయాలలో తగిన శ్రద్ధ తీసుకోవాలి. వేడి కలిగించు ఆహార, పానీయములను తీసుకోకూడదు. కాఫీలు, టలు పూర్తిగా మానివేయటం మంచిది. వాటి బదులు ఏదైన చల్లని పానీయాలు త్రాగటంవల్ల వంటికి చలవేకాక ఎండవేడికి కొంత హాయిగా ఉంటుంది.

రాత్రి మిగిలిన అన్నములోపాలు, కొంత పెరుగు వేసి తోడుపెట్టి, పొద్దుట కాఫీ, ఫలహారము బదులు ఈ అన్నములో చిటికెడు ఉప్పు వేసుకుని తింటే వంటికి చాలా మంచిది. క్రమము తప్పకుండా ప్రతిరోజు తింటే వేడి కురుపులు, సెగగడ్డలు మచ్చుకైనా రావు. కొందరు తోడు వేసేటప్పుడే ఉల్లిపాయలు చక్రాలు తరిగి వేస్తారు.

మధ్యాహ్నము పూట అన్ని రకముల షర్బతులు, సలాడ్‌లు మనింటిలో తయారు చేసుకుని త్రాగవచ్చు. మామూలుగా మజ్జిగ, నిమ్మరసము, మామిడికాయ షర్బతు చేసుకోవటం అందరికీ తెలిసినదే. ప్రతి దినము ఎప్పటికప్పుడు పండ్లు తీసుకునివచ్చి షర్బతు చేసుకోవాలంటే కుదరదు. ఒక్క

## కుమారి పి. రాధ

సారే తెచ్చుకుని ఫ్రూట్ క్రష్ చేసుకుని నిలవ వుంచుకుంటే, కావలసినపుడు కలుపుకుని త్రాగవచ్చును.

ఫ్రూట్ క్రష్.—దీనిని నిమ్మరసముతో గాని, టమాటో పండ్ల రసముతో గాని, అన్ని రకముల పండ్లరసములు కలిపిగాని చేస్తారు. ఏ పండ్లతో కావాలంటే ఆ పండ్లరసం తీసుకుని, గింజలు లేకుండా వడబోసి ఉంచుకోవాలి ఒక కప్పు పండ్ల రసమునకు, రెండు కప్పుల పంచదార లేతపాకం పట్టుకుని, అందులో ఈ రసంపోసి, సన్నని సెగ మీద కలుపుతూ ఉండాలి. యాలకుల పొడి ఎస్సెన్సూ, దించిన తర్వాత వేయాలి. రసం ముద్దగాకాకుండా, పలుచగా పాకం వలె ఉండేట్లు చూడాలి. బాగా చల్లారిన తర్వాత, తడిలేని శుభ్రమైన సీసాలోపోసి ఉంచుకుని, కావలసినపుడు గ్లాసుకి రెండు స్పూనులు కలుపుకుని త్రాగితే చల్లగా ఉంటుంది.

ఇవిగాక, లస్సీ, ఫ్రూట్ సలాడ్స్ ఇంట్లో తయారుచేసుకోవచ్చు ఖర్చు కొంత ఎక్కువైనా చాలా రుచిగా ఉంటాయి.

లస్సీ.—ఇది చేయటానికి మంచిమీగడ పెరుగు, చక్కెర, ఐసు, బాదం, జీడిపప్పు, ఎస్సెన్సు, ఇలాచీపొడి కావాలి.

(55-వ పేజీ చూడండి)

# వ్యభిచార నిర్మూలన: స్త్రీలబాధ్యత

మనదేశంలోను, అనేక పాశ్చాత్య దేశాల లోను వ్యభిచార వృత్తి చరమస్థాయి నందుకున్నది. తరతరాలుగా ఈ వ్యాపారం సమాజంలో సాగుతూవచ్చింది. దీని నిర్మూలనకు ఎందరో మహానుభావులు కృషిచేస్తూ వచ్చారు. శరణాలయాలు నెలకొల్పారు. ఇంకా నెలకొల్పుతున్నారు.

ఈ వ్యభిచారవృత్తికి ప్రధాన కారణం దారిద్ర్యం. రెండవ కారణం కష్టపడి పని చేయగలిగివుండీ కూడా చేసుకోవడం ఇష్టంలేక. మూడవది భోగలాలసత; అంటే తినడానికి, కట్టడానికి వున్నా దానితో తృప్తిపడక వేలు ఖరీదు చేసే నగలు, చీరలు. విలాస ప్రయాణాలు కోరుకోవడంవలన. ఈ మూడు రకాలవారు మనదేశంలో వున్నారు. శీలాన్ని పొట్టకే గాక ప్రాణములను కూడా అమ్ముకునే స్థితిలో ఎందరు ఉన్నారు. ఇందులో కూడా చౌక, అతిచౌక, మధ్యరకం, హైతరగతి అంటూ వర్గాలేర్పరచుకున్నారు ఈ స్త్రీలు.

## లక్ష్మీమోహన్

మన తోబుట్టువులు లక్షలమంది ఇలా నీచంగా మనకళ్ళఎదుట బ్రతకడం మనం చూస్తున్నాం. వీరి నుద్ధరిస్తామంటూ సంఘ సేవికలు బయలుదేరుతున్నారు. కాని వీరి కృషి అత్యల్పం. ప్రచారం, పేరుకోసం ఏదోపనిచేస్తున్నట్లు తోస్తున్నది. పత్రికలలో పబ్లిసిటీ ఎక్కువ, చేసేపని తక్కువ అసలు ప్రభుత్వం కేంద్రశాసనంద్వారా దీనిని నిషేధించి నేరంచేసిన ఇరువురికీ తీవ్రమయిన జైలుశిక్షలకు గురిచేయాలి. ఇప్పుడే అది అమలుకు వస్తోంది - అయితే అటువంటి శాసనం చేసేముందు అన్నివర్గాల స్త్రీలకు తాహతుకు తగ్గట్లుగా పనులు కల్పించాలి. ఎన్నో పతితస్త్రీ శరణాలయాలు వెలుస్తున్నాయి. జీవనోపాధి కేంద్రాలు ఏర్పరుస్తున్నారు. అయినా వేలసంఖ్యలో స్త్రీలు ముందుకువచ్చి తమ పాత నడవడిని వదలుకోకపోవడం విచారకరం. నేటిక జీవనానికి అలవడినవారు కష్టించి పనిచేయడానికి ముందుకురారు. శీలం విలువ తెలుసుకున్న యువతులు పశ్చాత్తాపపడి సంస్కరింప బడేందుకు సిద్ధమవుతారు.

ఇటువంటి పరిస్థితులలో స్త్రీల కర్తవ్య మేమిటి? సాధారణంగా వ్యభిచారిణులు గుంపులు గుంపులుగా కొన్ని సందులలోనో ప్రత్యేకమైన బజార్లలోనో నివసిస్తూ వుంటారు. వీరిని దారికి తేవడానికి కళాశాల విద్యార్థినులు, కుటుంబస్త్రీలు, "బోర్డుకట్టుకున్న సంఘసేవికలు," ఎక్కువశ్రద్ధ, దీక్ష, చూపాలి లక్షలాది పతితస్త్రీల సముద్ధరణకు నడుంకట్టాలి చందాలు వేసుకుని తండ్రులను, భర్తలను కుమారులను ప్రోత్సహించి, అలా సేకరించిన డబ్బుతో ప్రతిపట్టణంలోను త్వరత్వరగా శరణాలయాలు నెలకొల్పాలి అక్కడ చేరినవారికి చదువు నేర్పి, అన్నవస్త్ర, సౌకర్యములు కలుగజేసి ఏదయినా వృత్తిని బోధించాలి. ప్రతిదానికీ ప్రభుత్వం చేస్తుందిగదా అని మనకేమీ పట్టనట్లు ఊరుకోకూడదు. వాళ్ళూ మనవలెనే పుట్టారని, పరిస్థితులు కలిసిరాక వారి జీవితాలు అలా బుగ్గి అయిపోయాయని తెలుసుకుని వారిని ఉద్ధరించాలి. వాళ్లవద్దకు చేరే మగవారిలో మనభర్తలే వుండవచ్చు, అన్నలే వుండవచ్చు. చివరకు తండ్రులేగావచ్చు. ఆ స్త్రీలకు కూడా చిలకా గోరింకలవలె భర్తలతో కాపురంచేయాలని వుంటుంది. కాని అవకాశాలు లేవని విచారించి లోలోన కుమిలిపోతారు. అట్టివారిని పెళ్లిచేసుకోవడం ముందుచేయాల్సిన పనిగాదు. చేసుకుంటే అది అర్థంలేని ఆదర్శవాదం అవుతుంది.

అట్టి వారికి, చికిత్సలు చేయించి, ముందర ఆరోగ్యవంతులుగా చేయాలి.

ఈలోగానే కొద్దిపాటి,ఏదయినా చదువు

## గృహ వైద్యం:

# మామిడి

హిందూ సంప్రదాయాల్లో జరిగే ఏ శుభ కార్యానికీ మామిడి తోరణాలు లేకుండా పనిపొగదు. మామిడితోరణం కట్టేరూ అంటే అక్కడ శుభకార్యం జరుగుతుందని లెక్క. కాని ఎందుకు కడతారు అనిమాత్రం అడిగితే చాలామందికి తెలియదనే చెప్పాలి. ఈ రోజుల్లో, ముఖ్యంగా పట్టణాల్లో జరిగే శుభకార్యాలకు, అక్కడ మామిడాకులు దొరక్కయితే నేమి, ద్వారబంధాలకు మేకులు కొట్టవలసి వస్తుందనే కారణం వల్లయితే నేమి కట్టేమన్న పేరుకి ఆ చివర్న రెండాకులు, యీ చివర్న రెండాకులు తగిలిస్తున్నారు.

శుభకార్యాల్లో నలుగురూ వచ్చి చేరతారు. ఒకరు పీల్చినగాలి మరియొకరు పీల్చవలసిన పరిస్థితులో వుంటుంది. ఇలా కలుషితమైన గాలిని స్వచ్ఛంగా చేసేగుణం మామిడాకునందు ఎక్కువగా వున్నది. పైగా ఈ మామిడాకు ఉష్ణాన్ని శమింపచేసి, సర్వేంద్రియాలకు హితాన్ని కలిగిస్తుంది. దేహానికి పుష్టి కలిగిస్తుంది. శ్రమ రానీయదు. తాపాన్ని తగ్గిస్తుంది. మామిడాకులను నమిలినచో దంతములకు, ఇగుళ్ళకు బలము. మామిడాకుల కషాయం గోరువెచ్చనిది పుక్కిలించినచో దంతములు గట్టిపడతాయి. నోటిపూత నిమ్మళిస్తుంది: నోటియందలి దుర్గంధంపోతుంది.

## మామిడి చెక్క

మామిడిమానుచెక్క (ముదిరినది) వగరుగ నుండును. దీనినుండి తీసిన రసము (నీళ్లు కలుపరాదు) పుచ్చుకొంటే నీళ్ళ విరేచనాలు కట్టును. మోతాదు ¼ ఔన్సు మొదలు ½ ఔన్సు వరకు.

మానుచెక్కరసం (సగం నీళ్ళు కలపాలి) కోడిగ్రుడ్డు తెల్లసొన, ఒక పిసరు నల్లమందు కలిపి వాడితే (½ ఔ॥ మొ 2 ఔ॥ల వరకు) రక్తగ్రహణి కట్టును.

రక్తస్రావములు: (ఊపిరితిత్తులద్వారాను, గర్భాశయముద్వారా, ప్రేగులనుండిగాని) పచ్చిచెక్క రసమునందు స్వచ్ఛమైన మంచి నీళ్ళను కలిపి (ఒకవంతు రసమునకు పన్నెండువంతులనీళ్ళు) రెండేసి గంటలకు ఒక మోతాదుచొప్పున సేవించిన రక్తస్రావములు ఉపశమించును.

కుసుమ, ఋతు రక్తస్రావములందు మామిడివేరు (ముదిరినది)ను చితుకగొట్టి, నీడను ఎండబెట్టి (ఎండలో వుంచరాదు), ఎండినతర్వాత మంచినీళ్ళుపోసి తేలిక కషాయం—మూడు పొంగులువస్తే చాలు—½ ఔన్సు చొ॥న వాడితే నివృత్తి అగును. గర్భాశయమునకు సతువ బలం కలిగిస్తుంది.

చర్మరోగములకు ముదిరిన చెక్కమీద కత్తితో వాటుపెట్టే పల్చని ద్రవము పైకి వచ్చును. దాని వల్లే వుంచిన (చెట్టుని) కొద్దిరోజులకు గట్టుపడి జిగురుగా వచ్చును. దీనితో నిమ్మపండ్లరసం లేదా కొబ్బరినూనె కలిపి పూసిన, చిడుము, దురదలు గజ్జి మొదలైనవి హరించును.

## మామిడి టెంక

సాధారణంగా మామిడిపళ్లు తిన్న తరువాత టెంకను ఎందుకు పనికిరాని వస్తువుగా పారేస్తాము. మనం తెలియక చేసే పనుల్లో ఇది ఒకటి. ఈ టెంకె (లోని పప్పు) సరిగ్గా వుపయోగిస్తే ఎన్ని వ్యాధులనో హరింపజేస్తుంది.

సర్వ క్రిములను సంహరిస్తుంది. రక్తస్రావములందు దీని గుణము అత్యద్భుతము. వైద్యము తెల్సిన మహామహుల చేతుల్లో ఇది యొక వజ్రాయుధము లాంటిది. దేశీయ వైద్యములో పనికిరాని ఔషధి అంటూ ఏదీ లేదు. ప్రతి వస్తువు మానవుని కాపాడానికి యేదో ఒకవిధంగా సహాయం చేస్తూనే వుంటుంది.

ముఖ్యంగా ఋతురక్తస్రావం అధికంగా నున్నప్పుడు, నీళ్ళవిరేచనాలు కటనప్పుడున్నూ ఈమామిడిజీడిపప్పు బాగాపనిచేస్తుంది. ఉబ్బసపు రోగులకు అమృతం లాంటిదనే చెప్పాలి

అయితే ఒక్క సంగతి. దీనిని వైద్యవిషయం బాగా తెల్సివున్నవాళ్ళే వాడాలి.

మామిడిచిగుళ్ళు: వినులవిందుగా పాడే కోయిలే అమితంగా దీన్ని వుపయోగిస్తోంది.

మంచి మేహశాంతి, వాత పైత్యాల్ని ఉపసంహరించును.

## మామిడికాయ

రుచికోరకు మనం సాధారణంగా అనేక రకాల వండుకుంటాము. ఎన్నో రకాలు ఊరగాయలు పెట్టుకుంటాము. కాని దీన్ని అందరూ వాడరాదు. మిక్కిలి అపథ్యకరమైనది. ఔషధసేవ చేయువారెవ్వరూ ఊరగాయను ఉపయోగించరాదు. (రసమిశ్రమ ఔషధాలు ముఖ్యంగా.)

మామిడికాయ కాక జేస్తుంది. కఫాన్ని పెంచును. రక్త పిత్తాన్ని, వాతాన్ని పైత్యాన్ని పెంచును, మలబద్ధము జేసి, నీరసమును, కలిగించును. ముఖ్యంగా దీన్ని మూలవ్యాధి గలవారు, శ్వాసకాసలు గలవారు (దగ్గులు) సర్పి గలవారు, గ్రహణి రోగులు, వాత, పెత్యరోగులు, రక్త పైత్యం గలవారు విసర్జించి తీరవలెను. ఎన్నడూ పచ్చికాయ వాడరాదు. అట్లు వాడినచో చాలఅనర్థములు గల్గును.

## మామిడి పండ్లు

మామిడిపండ్లు మనకు లభించు ముఖ్య పండ్లలోకెల ముఖ్యమైనది. కొన్ని ప్రాంతాల్లో చౌకగా కూడా లభించు ఫలము. వాటిలో తియ్యనివి చాలా మంచిపని చేయును. పుల్లనివి తినరాదు. ఏలననగా పైత్యము, శీతపైత్యము కలించుటేగాక పాండు రోగమును, కామెర్ల రోగమును పుట్టించవచ్చును.

తియ్యటిపండ్లు జఠరదీప్తినిచ్చి, విరేచనబద్ధమునుపోగొట్టును. వాతమును హరించును. గుండెకు, మూత్రపిండములకు, మూత్రప్రపంచికి మెదడునకు బలముకల్గించును. శరీరమునకు మంచి పుష్టినిచ్చి, నీరసమును పోగొట్టును. గుండెలయందలి మంట, వికారమును పోగొట్టును. కామెర రోగులు, పాండు రోగులు ఆమ రోగులు (శ్లేష్మతత్వం) వాత పైత్య రోగులకు సరిపడదు. జాగ్రత్తగా నుండుట మంచిది.

నంగాని ప్రభావతీ శేషగిరిరావు,
(తాళ్ళరేవు.)

---

వృత్తి నేర్పాలి. ఒక్కసారిగా అవయసులో యం. ఏ., యం. బి. బి. యస్. ప్యాసు కాలేరు. విద్య, వృత్తి నేర్చుకొన్న తర్వాత వారికి వ్యభిచారంమీద అసహ్యం కలుగుతుంది ఉద్యోగాలు, పనిపాటలు చేసుకుంటూ విశాలహృదయాలు గల వారిని భర్తలుగా పొంది లక్షణంగా జీవనయాత్ర సాగిస్తారు.

పట్టణాలలోను, నగరాలలోను వుండే లక్షలాది మధ్య తరగతి స్త్రీలు యథాశక్తి విరాళాలు ప్రోగుచేసి, సముద్ధరణ సంఘాలేర్పరచి, శరణాలయాలు నెలకొల్పి సేవ చేయాలి. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ కూడా తగు సహాయం చేస్తుంది. ★

# వనితా వాణి



## ఏడుపు

శ్రీమతి ఇ. శ్యామలాదేవి "ఏడుపు"ను గురించి వ్రాసిన వ్యాసం బావుంది కానీ, ఒక చోటమాత్రం వారు కాలేజి అమ్మాయి ఏడుపును తప్పుగా అర్థం చేసుకుని వ్రాసినట్లు తోచింది నాకు. పరిస్థితుల వర్ణం చేసుకుని సావధానంగా యోచించటానికి కాలాటి సమయాలలో మనశ్శాంతి యెక్కడిది? "ఇంట్లో యెప్పుడు పోయి పడ్తామా" అన్న ఆలోచన తప్ప మరింకేలాటి తలపులూ వుండవ్. సావధానంగా ఆలోచించే లోపుగా వచ్చే మనఃక్లేశాన్ని ఏడ్చి పోగొట్టుకోవాలని ప్రయత్నించటం అసహజం కాదు. అందులో నమ్రతతో అతి జాగ్రత్తగా మెలిగే విద్యార్థినుల కిలాంటివి సంభవిస్తే మరీఎక్కువగా బాధపడతారు. తగినట్లు బుద్ధి చెప్పాలంటే!— బుద్ధిచెప్పినా వారిగుణాలు మారవు. సరిగదా మరింత గోల చేస్తుంటారు. అనేవాళ్లు పోకిరివాళ్లవటం మూలాన — అనటానికి ధైర్యముండదు. ఇల్లు చేరాక 'ఇలాఅన్నారే' అని అనిపించుకున్న వాళ్ళు ఏడవటం సహజము.

అప్పటిబాధ వాళ్లకే తెలుస్తుంది గాని, చూచేవారికేం తెలుసు? ఐనా "ఉయ్యాల మంచంమీద. (రోజవ్ లో వున్న సినిమా స్టార్ లా) బోర్లాపడుకుని ఇల్లదిరేలా రాగాలాపన మాత్రం నేనూ కూడదంటా గానీ బుద్ధి చెప్పటం యిత్యాదివన్నీ వ్యర్థమే. బంధువులని బహుశా ఆ అమ్మాయి తన విచారాన్ని నిగూఢంగా వుంచలేక పోయిందేమో.

మైసూరుబోండా చేసే విధానాన్ని ఆంధ్రపత్రిక ద్వారా యెవరయినా దయతో తెల్పుతారా?

వడలుగానీ, బజ్జీలుగానీ, బోండాలుగానీ కొన్నిసార్లు యెక్కువగా నూనెగాని, నెయ్యిగాని పీల్చుకుంటాయి. హోటల్ వాళ్ళు చేస్తే అలా వుండవు. మొన్న మైసూరు బోండాలు చేస్తే బాగా నెయ్యి పీల్చాయి. అలా కాకుండా వుండేందుకేమి చేయాలో గూడా తెల్పితే—కృతజ్ఞురాలిని.

డి కోమలాదేవి (కాకినాడ)

* * *

ఎం. వి. కమలాదేవిగారు "బంధుమర్యాద" అనేవ్యాసం చాలచక్కగా విమర్శించి వ్రాసినారు. బాగుంది. ఇవటూరి శ్యామలాదేవిగారు వ్రాసిన "ఏడుపు" అనే వ్యాసం చదువుతూవుంటే మా బంధువు ఒకామె, గుర్తుకొచ్చింది. ఆవిడ ఎప్పుడూ, మా అన్నయ్యను చూడడంతోనే "అయ్యో నా కొడుకా" అని గట్టిగా పట్టేసుకొని ఎప్పుడో చనిపోయిన ఆవిడ కొడుకుని తలచుకుని ఏడుస్తూ వుంటుంది. ఆవిడ కొడుకు మా అన్నయ్యతో చదువుకుంటూ ఉండేవాడట. హఠాత్తుగా జబ్బువచ్చి చనిపోయి నాడట. అందుకని అన్నయ్యను చూడగానే ఏడుస్తూవుంటుంది. పోతే, ఎప్పుడో ఒకసారి ఏడవవచ్చుగాని, చీటికీ, మాటికీ, ఆడవాళ్ళు ఏదో తలచుకుని అంతలా ఏడుస్తే మరీబాగుండదు.

గాదంశెట్టి పద్మావతి, బరంపురం.

* * *

ఎం. వి. కమలాదేవిగారి 'బంధుమర్యాద' అను వ్యాసము చాలా బావున్నది. బంధువులలో రకరకముగా వున్నారని వ్రాసినారు.

చెన్నూరి లక్ష్మీజానకిరాం (గుంటూరు)

* * *

## ఇచ్చిదెప్పేవారు

కొందరికి అడుగకుండానే యేవైనా సరకులు యిచ్చి ఫలానావారికి ఆ సరుకు ఇచ్చాను, అని ఊరంతా చాటించే అలవాటుంటుంది. ఇంతకీ వారి నోట్లో నువ్వుగింజ దాగదనుకోండి. మావూళ్లో ఒకామె వుంది. అడుగకుండానే కరివేపాకు, పూవులు, మొదలైన వస్తువులు బలవంతముగా పంపించేది. కానీ పంపించిన తరువాత అందరితో "ఫలానావారికి ఆ వస్తువును, ఈ వస్తువును, పంపించాను" అని ఊరంతా చాటేది. వద్దంటే నిష్ఠూరముగా మాట్లాడేది. ఇటువంటి వాళ్లదగ్గర ఇక నిష్ఠూరము పొందినప్పటికి ఏవస్తువులను తీసుకోవకూడదు.

కడిం తులసివాణి

(లింగాపురం-తూర్పు గోదావరిజిల్లా)

* * *

## ఇదో కాలక్షేపమా ?

కె. శ్రీనివాసమ్మగారు వ్రాసిన 'వాగుడు' అన్నవ్యాసం చాలాబాగుంది. ఈ రోజుల్లో అతిగా మాట్లాడడం బాగా పరిపాటి అయిందంటే అతిశయోక్తి కాదేమో. కొంతమంది వున్నారు. వారికి మాట్లాడని వారినిజూస్తే యీసడింపు పైగా నోట్లోనాలుక లేదంటారు లేదా గర్వం అంటారు.

మొన్న ఈమధ్య రైల్లో ఒకాయన తటస్థపడ్డాడు. ఢిల్లీలో మొదలెట్టిన సంభాషణ మద్రాసులో అంతమయ్యిందంటే నమ్మండి. ఇది కాలక్షేపమే నంటాడు మరోక ఉపన్యాసవేత్త...

ఈలాంటి వారున్నారంటే పనికిపనీ నష్టమే వాళ్ళమాటలూ అంతగా రుచించవు.

"వాగుడు" అనేది ఒకొక్కసారి ఒక జబ్బేమో ననిపిస్తుంది.

గుడిపాటిలీల, శ్రీకాకుళం.

* * *

## కట్నాలచట్టం

వరకట్న నిషేధశాసనం వచ్చినది. అందువలనేమైనా వరకట్నాలు తీసుకోకుండా వున్నారా అంటే అదేమీ లేదు. అంతకు ముందు బాహాటంగా తీసుకునే వాండ్లు యిప్పుడు చాటుగా తీసుకుంటూ వున్నారు. ఇంతే వ్యత్యాసము. పోనీ రేట్ల విలువ యేమైనా తగ్గిందా అంటే అదీ లేదు. పైగా హెచ్చిందిగూడాను. వధువు పక్షము వారు యేదో విధంగా తమ పిల్లకు పెండ్లి అయితే చాలు భగవంతుడా అని వరపక్షము వారు అడిగినంతా చాటుగా యిస్తూనే వున్నారు. అంతకు ముందు 'మేము యింత కట్నము యిచ్చాము' అని ఘనముగా చెప్పుకుంటూ వుండినారు. కాని యిప్పుడు చట్టం భయముచేత పైకి చెప్పుకోడం లేదు. అటు ఘనంగా చెప్పుకోవడానికీ లేదు. కట్నం తీసుకోడం తగ్గిందా అంటే అది లేదు.

ఎస్. కె. దేవి (నెల్లూరు)



# స్వర్గసీమ

'సౌభద్ర'

(గతసంచిక తరువాయి)

ద్రోర కర్టెనుమీద రంగుదారా లల్లుతున్న పద్మ వీధిగదిలో అలికిడికి తలెత్తి చూసింది.

"నన్ను కమల అంటారు. మా ఆయనా మీ ఆయనా ఒకేఆఫీసులో పనిచేస్తున్నారు. మిమ్మల్నొకసారి చూచిపోదామని యింటికెళ్తూ యిలావచ్చాను." చేతిలోని పర్సు విలాసంగా వూపుతూ చిరునవ్వుతో పరిచయం చేసుకుంది కమల.

"నమస్కారం. రండి కూర్చోండి." అని ఆహ్వానించింది పద్మ. ఈ మెనుగురించే నిన్న రాత్రి తనభర్త చెప్పాడు. పెదవులకిపూసిన లిప్ సిక్, గోళ్ళకిరంగు, ఎతుమడమలబూట్లూ యివన్నీ ఆమె అధునాతనత్వాన్ని కొట్టొచ్చినట్లు చెప్తున్నాయి. కమల కూర్చుంది.

"మంచినీళ్ళు కావాలా?"

"అక్కరలేదు. మీరేంచదువుకున్నారు?"

"నేనాటేమీ చదువుకోలేదండి. మూడో ఫారం వరకూ మా నాన్నగారే చెప్పారు."

"అల్లిక, కుట్టు—యీలాంటివి బాగా వచ్చునుకుంటానే మీకు!"

"ఇంట్లో ఉత్తినే కూర్చోవటమెందుకని యిలాంటిపనులు చేస్తూవుంటాను."

"మీకు కాలక్షేపం కాకపోతే నేను చిన్న సలహా యిస్తాను. ఈవూళ్ళో స్త్రీల క్లబ్బుంది. అక్కడ స్త్రీలపురోభివృద్ధికి అవసరమైన విషయాలు చర్చిస్తూవుంటారు. మంచిపుస్తకాలున్నాయి. ఉత్సాహమిచ్చే ఆటలాడవచ్చు. కావలసినంత కాలక్షేపం."

అసలు పద్మకి యీవిషయంచెప్పి ఆమెను సభ్యురాలిగా చేర్చాలనే ఉద్దేశంతోనే యిక్కడకు వచ్చింది కమల. లేకపోతే యిక్కడకువచ్చే వుద్దేశమే ఆమెకు లేదు.

"ఇక్కడేదో వ్యాసంగం వుందిగా. దీంతో కాలక్షేపం అవుతుందిలెండి." అంది పద్మ ఆ విషయం ముగించే ఉద్దేశంతో. కాని కమల తనపట్టు విడవలేదు.

"అక్కడకూడా సంసార స్త్రీలున్నారండీ వాళ్ళు అన్ని విషయాల గురించీ చర్చిస్తూ వుంటారు."

"ఏవిషయాలు చర్చిస్తూవుంటారు?"

"అల్లాఅడగండి చెప్తాను. తరతరాలుగా మనం దాస్యవృత్తికి బాగాఅలవాటు పడ్డాం. పిల్లల్నికనే యంత్రాలమాదిరి పరిగణించబడ్డాం. సంఘంలో మన అభిప్రాయాల్ని స్వేచ్ఛగా వెలిబుచ్చేఅవకాశం యివ్వబడక ఘోషా తెరల బురఖాలలో యిరికించబడ్డాం. మనజాతి— స్త్రీజాతి—పురుషులకంటె అన్ని రంగాలలో ముందంజ వేసుందని యీనాడు నిరూపించవలసివుంది. నేడు మనం కళ్ళుతెరచి యీసత్యాన్ని నిరూపించ ప్రయత్నిస్తున్నాం. ఉద్యోగాలలో ప్రథమస్థానం, నిర్మాణ కార్యక్రమాలలో ప్రముఖ స్థానం మనం పొందుతున్నాం. అది పురుషపుంగవులకు తెలియజేయుడం కూడా యీమహిళా సమాజ లక్ష్యం." ఉద్రేకంగా చెప్పుకుపోతున్న కమలకు ఫ్లాస్కులో మధుకోసం వుంచిన కాఫీని కప్పులో పోసి యిచ్చింది.

"అక్కర్లేదు, ఆఫీసునుంచి వచ్చేప్పుడు ఒకసారి క్లబ్బులో ఆగి తాగేవచ్చా."

"పరవాలేదు తాగండి" కమల తాపీగా కాఫీ త్రాగుతూ వుంటే పద్మ చెప్పడం మొదలు పెట్టింది.

"మీరు చాలా ఉద్రేకంగా మాట్లాడారు వదినెగారూ! మీ నేర్చిన విద్యకు తగిన విజ్ఞానం వుంది మీలో."

తన గొప్పతనాన్ని పద్మ గ్రహించినందుకు కమల చాలా మురిసింది. మరల చెప్పింది పద్మ.

"కాని యింట గెలవందే రచ్చ గెలవలేరనీ, ప్రకృతికి పర్యాయపదాలు స్త్రీ, పురుషులని, పురుషుల ఆసరా నే స్త్రీలు అన్ని రంగాలలోనూ ఎక్కువ అభివృద్ధి చూపగలరని మీరెందుకు గ్రహించలేకపోయారో వింతగా వుంది. నీటిని విడిచి చేపలు జీవిస్తాయా వదినెగారూ? మనం దేశౌన్నత్యానికి శ్రమించడానికి క్లబ్బులు, ఉపన్యాసాల పరిశ్రమించ నక్కరలేదు. ఇంట్లో వుండి అంతకన్నా ఎక్కువ చెయ్యగలమని నాచిన్న మనసుంతో నూంది. నేను రాలేనందుకు క్షమించండి" కమలకి ఉక్రోషం, కోపం ఉక్కిరిబిక్కిరి చేసేటంతగా వచ్చాయి.

"అవును నేననుకున్నది నిజం. పాపం. నువ్వు పల్లెటూరినుంచి వచ్చావు. అలాటి వాళ్ళకి నమ్మకాలమూఢత్వం ఎక్కువ. కాని పద్మా! నువ్వు మనక్లబ్బులో చేరేందుకిష్టపడకపోవటం మా అదృష్టం—వస్తా."

"బొట్టుంచుకునివెళ్ళండి వదినగారూ" అనే పద్మమాటలు వినిపించుకోక విసురుగా వెళ్ళిపోయింది కమల.

*　　*　　*

మూడుగంటలకు కాఫీకి పిలవడానికి సూర్యనారాయణ దగ్గరకువచ్చాడు మధు. కాఫీకి కలిసివెళ్ళడం వారి దైనిక చర్యలలో ఒకటి.

"రావోయ్! కాఫీకి పోదాము - అదేమిటి? కళ్ళంత ఎర్రగా వున్నాయి?" అందోళనతో సూర్యనారాయణ నుదుటిమీద చేయివేసి చూశాడు మధు. కణతలదురుతున్నాయ్.

"అబ్బ! జ్వరంగా వుంది. చెప్పేసి యిటికివెళ్ళి పోరాదూ?"

"మరేం ఫరవాలేదు. ఇందొక రెండుగంటలుండి కలిసే పోదాం." చిరునవ్వుతో అన్నాడు సూర్యనారాయణ. బంట్రోతుకి ఫ్లాస్కు యిచ్చి కాఫీ ఆఫీసుకి తెప్పించాడు మధు. సాయంత్రం నాలుగంటలకి విషయం అధికారితో చెప్పి తనకు కూడా అనుమతి తీసుకుని సూర్యనారాయణతో యింటికి బయలుదేరాడు మధు. తనయింటి సమీపాన్నే తెలిసిన డాక్టరుకు చూపి మందు తీసుకున్నాడు.

"కొంచెంసేపు మాయింట్లో విశ్రాంతి తీసుకుని వెళ్ళరాదూ?" అప్పుడు సూర్యనారాయణ యింటికి వెళ్తే పరిచర్య చేసేవారుకాని, కులాసాగా కబుర్లు చెప్పేవారుగాని ఎవరూ వుండరని యిరువురకూ తెలుసు. మాట్లాడకుండా మధు ననుసరించాడు సూర్యనారాయణ. గేటుతెరచుకొని లోపల ప్రవేశించారు మిత్రులిద్దరూ.

"ఏవో పూలమొక్కలు వేశావే?"

"నేను కాదులే. ఇంటివారి పిల్లల సరదా అది." తలుపులు తెరిచేవున్నాయి. దొడ్లో ఏవోమాటలు వినపడుతున్నాయి.

"ఏమయ్యా! మధూ! ఇలంతా బాగా అలంకరించిందే మా చెల్లాయి! గుమ్మాలకి అల్లిక తెరలు, టేబుల్ క్లాత్ కవర్ లేసు-ఎప్పుడైనా నీపుస్తకాలు, అలా అమరికగా షెల్ఫులో పెట్టుకున్నావూ?-చక్కని పద్ధతి వుందప్పుడు గదికి. నిజంగా, యింతఅందంగా, శుభ్రంగా వుంచినందుకు మా చెల్లాయి నభినందించాలి."

"ఆ! ఎవరైనా చేస్తారీ మాత్రం పని" చొక్కా కొంకికి తగిలిస్తూ నవ్వుతూ అన్నాడు మధు.

"పిన్నీ! పిన్నీ! నా మడిలో మొక్కలొచ్చేశాయి! లలితక్క మడి యింకా కాలే



# స్వర్గసీమ



గానే వుంది. చూశావా?"

"అల్లరి వెధవా! ఇప్పుడంటే పిన్ని వెనకాల అస్తమానం తిరుగుతున్నావుకాని ఇదివరకు దొడ్డిముఖం చూసేవాడవా" పిన్నొచ్చి నీ అల్లరి కట్టించింది. దొడ్డిని కలకలలాడించింది." అది ఇల్లుగలావిడ కంఠం.

"మధు బాబాయి వచ్చేశాడు పిన్నీ!— ఒహో! బాబాయ్! నా మడిలోనే మందార మొక్కలొచ్చేశాయి. చూశావా?" ఉత్సాహంతో గదిలోవున్న మధుకు దొడ్లోనుంచే కేక వేశాడు కుర్రాడు.

"రైటో! అయితే లలితక్కని లేవిడీ కొట్టు!" అంటూ దొడ్లోకి వెళ్ళాడు.

వాలుకుర్చీలో శయనించి కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు సూర్యనారాయణ. మానవ జీవితానికి ఇంతకంటె తృప్తేమున్నది! ఇరుగు పొరుగులకుకూడా విలువ కనిపించిందతని భార్యలో. మధు ధన్యుడు.

"కాఫీ ఇదుగోనండి." కళ్ళు తెరిచేసరికి ఎదురుగా పదేళ్ళ బాలిక కాఫీ కప్పులతో నిలబడివుంది.

"నీ పేరేమిటమ్మా! పాపా!" కాఫీ కప్పు అందుకుంటూ అడిగాడు.

"లలిత" తలవంచుకుని సిగ్గుపడుతూ జవాబు చెప్పింది.

"పూల మొక్కలు బాగా వేశావే!"

"అక్కే! అంతా మా పిన్నే చేసుందండి. మా అక్క కేమీరాదు—అందుకేగా అల్లిక, అవీ నేర్పుతోంది పిన్ని" పిసంద్రీలా దొడ్లోంచి పరుగున వచ్చిన సుందరం అన్నాడు. బాలిక బయటికిపెట్టి వెక్కిరించింది సుందరాన్ని లలిత. సుందరం మళ్ళీ వెక్కిరించాడు. సూర్యనారాయణనవ్వాడు.

"మీ పిన్ని పిలుస్తోంది వెళ్ళండి" అంటూ వచ్చాడు మధు.

"నీ కాఫీ, చల్లారిపోతోంది బాబాయి. అక్క యిందాకనగా తెచ్చి పెట్టింది టేబులుమీద." మధు కాఫీ తీసుకున్నాడు. పిల్లలిద్దరూ లోపలికి వెళ్లారు. కిటికీలోనుంచి పిల్లగాలి వచ్చి చక్కిలిగింతలు పెడుతోంది.

"మధూ! ఒకసారి నాతో" సంఘంలో స్త్రీ మనుగడను గురించి మాట్లాడావు గుర్తుందా? అప్పుడు నాకు నీపై కొంచెం కోపం వచ్చినమాట వాస్తవం. కాని అప్పటి నీ భావాలు రూపం ధరించి నీ భార్యగా వచ్చాయని తోస్తోంది. ఒంట్లో జ్వర తీవ్రత హెచ్చుగా వున్నా, నీయింటి పరిసరాలు ఆహ్లాదం కలుగజేశాయి. చీకటి పడుతూ వుంది. వస్తా మధూ". కుర్చీలోంచిలేస్తూ అన్నాడు సూర్యనారాయణ.

"నేనుకూడా వస్తున్నానుండు. నువ్వొక్కడివే ఏం వెళ్తావ్." చొక్కా వేసుకుంటూ అన్నాడు మధు.

రిక్షాదిగి సూర్యనారాయణ యింటిలో అడుగుపెట్టారిద్దరూ. కమల యింకా రాలేదు. జీతగాళ్ళకి వదలబడిన పాపాయి ఉయ్యాలలో ఆడుకుంటున్నాడు. మధు యిల్లు చూసినమీదట యీ వాతావరణం నచ్చలేదు సూర్యనారాయణకి. కాంతిలోంచి కటిక చీకటిలోకి వస్తున్నట్లు బాధపడ్డాడు.

"ఇక నువ్వెళ్ళు మధూ!"

"నాగురించి నీకు శ్రమయిస్తున్నాను."

"మందుతీసుకో. రేపు ప్రొద్దుట మళ్ళీ వస్తాను. ఆఫీసుకి వెళ్ళేప్పుడు మళ్ళీమందు తెస్తాను"

"మరేం పరవాలేదు తోటివారికి ఉపయోగంకాని జీవితం వ్యర్థం. మంచిపనులు చేసే ఆలోచనలు, అవకాశాలు మనుషులకు తక్కువ. కనీసం నన్నీమంచి పనైనా చెయ్యనియ్యి. సుఖంగా నిద్రపో. కాయానికి, హృదయానికి పరిపూర్తి విశ్రాంతి నియ్యి. వస్తా."

సూర్యనారాయణ నిద్రపోదామని ప్రయత్నించాడు. జ్వరతీవ్రత, మనోవైకల్యం నిద్రను దరిజేరనీయలేదు. చదువనేదివిజ్ఞానం బుద్ధివికాసంకోసం వుద్దేశించబడింది. కాని తను బాగా చదువుకున్నవాడు! కమలకూడా చదువుకున్నది. తమ యిరువురికీమధ్య తగువులెందుకురావాలి? స్వతంత్రభావాలిద్దరికీ వుండడమే దీనికి కారణం. పరాకాష్ఠనందుకున్న శాస్త్రవిజ్ఞానాన్ని ప్రాక్పశ్చిమదేశాల ప్రాముఖ్యత వహించిన మానిసుల మాదిరే తమ దంపతుల విద్య దుర్వినియోగమవుతూ వుంది. బాధ్యతా నిర్వహణం అపసవ్యమాతూవుంది. సంస్కరణాభిలాషులనుకోవటంవల్ల తమ చదువు తమకుత్తమ సంస్కృతిని తెచ్చిపెట్టిందనుకోవటంచేత, ఏఒక్కరికించి తిరస్కృతి మరొకరికి సహ్యంగా వుండటంలేదు. వేత్తలనే దురహంకారం తమ నావహించింది. అందువల్లనే ఒకరిపొడ మరొకరికి కిట్టటంలేదు—

మధు సంసారం అంతసౌఖ్యంగా సాగిపోతూవున్న దెందువల్ల? పద్మ చదువు మితిమీరలేదు. సాంసారిక జీవితానికి కావలసిన విద్య పద్మకున్నది. అందువల్లనే పద్మని చూడకనే అచ్చట ప్రతివస్తువులో పద్మని కనగలిగాడు. అన్నిటినీ మించి సంసార నిర్వహణకు దంపతులిద్దరూ ఒకరినొకరర్థంచేసుకుని మసలాలని మధు, పద్మలకు తెలుసు. పోనీ తను విద్యావంతుడు కాకపోయినా బాగుండేది. కమలమాట కెదురుచెప్పక హాయిగా కాలం గడిపేవారు—భారత సతికి అనాదినుండీ ఉత్తమ ఖ్యాతి గడించిన దామె సౌశీల్యమేగా. గోమాత తన క్షీరాన్నిచ్చి మనల్ని సంతృప్తుల్ని జేస్తే, ఆస్వార్థరహిత జీవితానికేగా మనం ప్రత్యేక గౌరవాన్నిచ్చాము. చిరకాలంనుంచి భారత సంఘంలో స్త్రీకిగల విశిష్టస్థానమదే— కమల అమాయకురాలు. ఇవన్నీ చెపితే వినదు. కుపితురాలౌతుంది. తనకూ కోపం వసుంది. కోపం మనోదౌర్బల్యానికి చిహ్నం—తన సంసారం ఎప్పటికి బాగుపడుతుంది? భార్యాభర్తలు పోరును త్యజించి లాభం పొందేదెప్పుడు? పసిపిల్లవాడు బాబు భవిష్యత్తు నలిగిపోదా తమ కలహాలమధ్య?— ఈ ఆలోచనలతో సూర్యనారాయణకు నిద్ర పట్టింది.

చల్లని కరస్పర్శతో సూర్యనారాయణకు మెలకువ వచ్చింది ఉదయం. నుదుటిమీద చేయివేసి చూస్తోంది కమల.

"ఎలా వుందండీ యిప్పుడు?"

"పరవాలేదు. తగ్గిపోయింది"

"లేవండి. వెంకాయమ్మగారు వేడినీళ్ళు తెచ్చారు. ముఖం కడుగుదురుగాని"

"దొడ్లో భర్త ముఖం కడుగుకుంటూ వుంటే ప్రక్కన కూర్చుంది కమల.

"రాత్రినే వచ్చేప్పటికి మీరు నిద్ర

పోతున్నారు. ఒళ్ళు సలసలకాగుతూ వుంది. నాకు భయంవేసి డాక్టరు దగ్గరకు బయలు దేరబోయాను. మీరు మందు తెచ్చుకున్నారని అతనికి ముఖం తుడుచుకోవటానికి తువ్వాలందించింది. వంటయింట్లో పీటవేసింది. సూర్యనారాయణ కూర్చున్నాడు. వంటావిడ యిద్దరికీ కాఫీ తెచ్చియిచ్చింది.

"ఇవేళ నేను కూడా సెలవు పెట్టేస్తాను. సాయంత్రం ఒకసారి క్లబ్బుకి వెళ్ళొస్తాను."

"నిన్న ఆఫీసునుంచి నన్ను వాళ్ళ యింటికి తీసుకువెళ్ళాడు మధు."

పద్మ ప్రసక్తి తెస్తాడని కమల గ్రహించింది.

"విద్య అనేది ఆడదానికి కాని, మగవానికి కాని ఎంతవరకూ అవసరమో ఆ వాతావరణం తెలిపింది."

మీకు జ్వరంలోకూడా యీ పైత్యం పోలేదు. మధు మిమ్మల్ని డాక్టరుకు చూపి యింటికి తీసుకువచ్చినందుకు చాలా కృతజ్ఞురాల్ని. కాని యిలా మీ చెవికొరికీ, తన భార్య గొప్పతనాన్ని డప్పుకొట్టి, గృహచ్ఛిద్రాల్ని కల్పించే బాధ్యత తీసుకోవటం నేను సహించను."

వారిస్తూ అన్నాడు సూర్యనారాయణ.

"కమలా! మధు నాకేమీ చెప్పలేదు. ఈ ప్రసక్తి ఎప్పుడు లేదు. మధు సంసారం బాగున్నదనే కళ్ళు కొలదీ నువ్వే అతన్ని అలా అంటున్నావు. ఈసుతో మనసు కలుషితంచేసుకోవద్దు. భగవంతుడు మనసులిచ్చినదందుకు కాదు. కత్తితో కంఠాలు కోస్తారు కాని కంఠాలు కొయ్యరు—మధుతో మనకు స్నేహం లేనప్పట్నుంచి యీ ఛిద్రాలు మనకూ సంభవిస్తున్నాయి. ఏమిటిది? నీతోటి మహిళలకి నువ్విచ్చే సందేశం. నీ నేర్చిన విద్యతో గృహంలో ప్రశాంతత కల్పించలేక పోతున్నావు. బహుశ హృదయాలవ్యథ నువ్వు బాపగలవా? నీ నెత్తిమీద బూజు దులుపుకో. ఎదటి వాళ్ళని నిర్మలులుగా చేద్దుగాని—ముందర నువ్వు చీకటిలోవున్నావని గుర్తించు తదితరులని వెలుతురులోకి తే ప్రయత్నిద్దుగాని. నీచేతి మకిలి తొలగించుకోకుండా బాబుని శుభ్రపరుచగలవా?"

"జ్వరంతో పాటు విషంకూడా మీ తలకెక్కింది. నాకు మీరంటే ఎంత ప్రేమో, మీకు నేనంటే అంత వికారం. నా సదాశయాల్నర్థం చేసుకోలేని సంకుచితం మీ హృదయం—నేను యివేళ మధును కనుక్కుంటాను. అతనికి ఘాటైన హెచ్చరిక నిస్తాను. శాశ్వతంగా అతను మన జోలికి రాకుండా తెగతెంపులు చేసాను."

"కమలా!" తలపట్టుకుని గట్టిగా అరిచాడు సూర్యనారాయణ. అతని కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

"బాబుగారికి ఒంట్లో బాగులేదు. మీరు కొంచెం వూరుకోరాదా అమ్మాయి?" అంది వెంకాయమ్మగారు.

గోడ నూతగొని లేచాడు సూర్యనారాయణ. మెల్లగా చెప్పాడు. "కమలా! నిన్న రాత్రి మన సంసారంగురించి ఒక నిర్ణయానికి రావడంచేత యిప్పుడు నీకు మెల్లగా హితవు చెపుతున్నాను."

"లేకపోతే—"

"మధును నువ్విప్పుడన్న మాటలకు నిన్నేమైనా చేసేవాణ్ని...మళ్ళీ చెపుతున్నాను కమలా! దురహంకారంతో మనం చేసే పని పలికే పలుకు సత్ఫలితాన్నీయవని."

కమలకి ఏడుపు ముంచుకొచ్చింది. ఉయ్యాలలో బాబు ఏడ్పు విని వెంకాయమ్మగారు బయటికి వెళ్ళింది. జాలిగా అన్నాడు సూర్యనారాయణ.

"నాకు మాత్రం కోపమా! కమలా నీపైన?—స్త్రీ రెండు వింతశక్తుల సమ్మేళనం. రక్కసులను క్కడగించిన పరాశక్తి. మానుల మోహింప జేసిన మత్తకాశిని. పరపురుషుల పట్ల మొదటిది నాపట్ల రెండవది చెలుతాయి నీలో. అనునయించే ఉద్దేశంతో ప్రేమగా మాట్లాడాడు. ఇది అవకాశంగా తీసుకుంది కమల.

"అయిందా? ఇంకా చెప్పేదేమైనా వుందా?"

"ఉంది. ఇంకా కొంచెం వుంది. పురుషుడు చేసే పని స్త్రీ ఎందుకు చేయకూడదని మీ వివాదం. అంతే కదూ! దానికొకటే సమాధానం. సృష్టి. విపులంగా చెప్పాలంటే-గాడిద చాకలి బట్టల మూటలు భరించడానికే పనికి వస్తుంది. కాని దొంగల తోలడానికి కాదు. కుక్క దొంగల తోలడాని కక్కరకు వస్తుంది కాని మూటల మోతకు కాదు. సంసారంలో సంఘంలో పురుషుడు స్త్రీ-వీరి బాధ్యతలకుగల భేద మిదే."

"చాలా సంతోషం. మీ వంటి విజ్ఞాని, నాకు పతిఅయినందుకు లోకం గొప్పగౌరవమిస్తుంది."

"గౌరవం కొనుక్కుంటే వచ్చేదికాదు. సత్కార్యసిద్ధి."

"ఎంత అసూయమీకు-ఎంతద్వేషం-ఎంత అసహ్యం! ఫరవాలేదు. ఈ భాగోతం యింట్లో ఆడటంతో సరిపెట్టారు. వీధుల్లో ఆడితే వీపు సంబరంచేసేవారు."

"సత్కార్యం సత్వరఫలితాన్నీయదు. ఏసుక్రీస్తును మొదట గేలిచేయలా! సోక్రటీసు శాంతవర్తనని, అతనిభార్య, తదితరులు అర్థంచేసుకోగలిగారా? నువ్వుకూడా అంతే. చేతులు కాలితేగాని నిప్పునుపయోగించే పద్ధతి నీకు తెలియదు. నిన్నొక పురుగులా చూస్తే అప్పుడు తెలిసివస్తుంది—పో అవతలకి" వేదనతో, విసుగుతో మంచం మీద వాలాడు. ఆ వేశం, అధిక ప్రసంగంవల్ల జ్వరం తీవ్రమయ్యింది. శిరోవేదన భరించలేనంతగా వుందతనికి. కమల ఆఫీసుకి వెళ్ళిపోయింది. ఉదయం మధు రాలేదు. సూర్యనారాయణ మందు తెచ్చేందు కెవర్నీ పంపలేదు.

క్లబ్బులో కార్యనిర్వాహకవర్గ కమిటీ ఎన్నికలలో ఆసాయంత్రం కమల ఓడిపోయింది. ఆమెను పరాభవించాలని తరచు ఆమె దురుసునోటివాతబడే తదితరులు చేసిన పని అది. ఉడుకుబోతుతనం, ఉక్రోషంతో యింటికి వచ్చేసింది కమల. ఇంటివద్ద సూర్యనారాయణ ఆమెను పలుకరించలేదు. రాత్రి నిద్రపట్టలేదు కమలకి- తన కిప్పుడు యింటా బయటా నిరాదరణ, తిరస్కృతి ప్రాప్తమయ్యాయి. నిజానికి తన ఆదర్శాలు, ఆశయాలు—అన్నిటికి వంత పాడి, తనవల్ల లాభాలు పొందినవాళ్ళే తన నపజయంపాలు చేశారీవేళ.

పాపాయి ఏడ్పు మొదలుపెట్టాడు. తీసుకొచ్చి పక్కలో పడుకోబెట్టుకుంది—తన భర్తకూడా తనవెందుకర్థం చేసుకోలేకపోతున్నాడు. చదువుకున్నవాడని తను చాలా సంబరపడిందే. మొదట్లో తనభావాల పట్ల అంగీకృతి చూపేవాడే! ఇప్పటిమార్పుకి మధు కాదా కారణం! తనంటే ప్రతీవాళ్లూ గిట్టా రెందుకీరోజు? ఎక్కడుంది లోపం? ఎవరిలోవుంది.

తెల్లవారి సూర్యనారాయణ లేచి కాలకృత్యాలు తీర్చుకోటానికి దొడ్లోకి వెడుతూండగా, హృదయానికి హత్తుకొని బాబుకి పాలుపడుతూంది కమల. ఇదొక కొత్తవిషయం ఆయింట్లో.

(47-వ పేజీ చూడండి)



# దైవలీల

ఎండవేడి కోర్వలేక
దూరమేగు బాటసారి
దట్టమైన నీడలున్న
మఱ్ఱిచెట్టు చేరెను.

మఱ్ఱిచెట్టు దాపునందు
ఉండె నొకటి పెద్ద పుట్ట
పుట్ట చుట్టు చుట్టియుండె
దట్టమైన గుమ్మడుల్.

రెండు చెట్ల నిండియుండె
మెండుగా పసిండిపండ్లు
వానివైపు బాటసారి
తేరి పారజూచెను.

"మింటి నంటుచుండె చెట్టు
చెట్లరాజు మఱ్ఱిచెట్టు
దీని కింత చిన్నికాయ
లెట్లుపెట్టె దేవుడు?

మంటినంటి ప్రాకుచుండు
తీగయినను గుమ్మడికి
ఇంత పెద్దకాయ లేల
పెట్టినాడు దేవుడు?

తెలివితోన దేవగురుడు
పనులు చేయ నేర్పరనెడి
బ్రహ్మచేసి నట్టి సృష్టి
ఇట్టులుండె నేలొకో !!"

అనుచు నిట్లు బాటసారి
దైవసృష్టి తూలనాడి
నిదురబోయి నాల్గుతట్లు
లేచి చూడసాగెను.

మఱ్ఱికాయ లెన్నొ తనదు
ఒంటిమీద మంటిమీద
బాటసారి కంటబడగ
తలచె నిట్టులాతడు!

"మఱ్ఱిచెట్టు పెద్దపండ్లు
కలిగియుండె నేనినాడు
బుఱ్ఱ పగిలియుండు గాదె!
చచ్చిపోయి యుందునే!

సృష్టికర్త జ్ఞానధనుడు
నష్టయనెడు పేరు చెల్లె!
తాను చేయు కార్యమెపుడు
తలచి పిదపచేయును.

పెద్దచెట్లు చిన్నపండ్లు
చిన్నచెట్లు పెద్దపండ్లు
కలిగియుండునట్లు బ్రహ్మ
చిత్రమట్లు చేసెను."

'తెలివిమాలినట్టి నాకు
దైవలీల లెట్లు తెలియు'
ననుచు బాటసారి తలచి
తనదు దారిపట్టెను.

వేమూరి
వేంకటసుబ్రహ్మణ్యం

# దెబ్బకు దెబ్బ

రామరాజు వినుగొండ జమిందారు. ఆ వూరుకు తానే పెద్ద కావడం చేత రామరాజుకు తగని గర్వం వుండేది. ఎవ్వరినీ లెక్క-చేసేవాడు కాదు. తనకన్నా తెలివిగలవారు లేరని విర్రవీగేవాడు. ఎదుటివాడిలో ఎదో ఒక తప్పును వెదకి ఎగతాళి చేసేవాడు. జమీందారుని ఎదిరించి మాట్లాడితే ఎన్ని చిక్కులు వస్తాయోనని ఎవ్వరూ పెదవి కదల్చేవారు కాదు.

ఇలా వుండగా ఆ వూరులోకి పేరిశాస్త్రిలని ఒక బ్రాహ్మణుడు క్రొత్తగా వచ్చాడు. పంచాంగం చెప్పకొని, పురాణం చెప్పకొని కాలక్షేపం చేసేవాడు. జమిందారుగారు ప్రతి సాయంకాలం గుఱ్ఱం మీద షికారు కెళ్ళే సమయంలో రామాయణం చేత పట్టుకొని పేరిశాస్త్రిలు ఎదురయ్యేవాడు. ఎలాగైనా ఈ శాస్త్రిలను అవమానించాలి అని జమిందారు అనుకున్నాడు. ఒకనాడు మామూలుగా శాస్త్రిలు పుస్తకం చంకపెట్టుకొని ఎదురయ్యాడు. జమీందారుగారు గుఱ్ఱం మీద నుండే "శాస్త్రిగారు మా పిల్లలకు రేపు అక్షరాభ్యాసం చేయించాలి. కొంచెం తిథి వార నక్షత్రాలు చెప్పండి." అని అడిగాడు. అందుకు శాస్త్రిలు "పంచాంగం యింటిదగ్గర వున్నది. చూచి తమ యింటి దగ్గరకు వచ్చి మనవి చేస్తాను" అని అన్నాడు.

"అయితే నీచంకలోవున్నదేమిటి?" అని జమిందారు ప్రశ్నించాడు.

"అది రామాయణం" అని జవాబిచ్చాడు శాస్త్రి.

"అంత పెద్ద గ్రంథం దగ్గరుంచుకొనికూడా ఇంత చిన్నవిషయాన్ని చెప్పలేకపోయావే? అంతమాత్రానికి ఆ పుస్తకాన్ని రోజూ మోసుకొనిపోవడం ఎందుకు?" అని ముందుకు సాగిపోయాడు.

[illegible]

జమీందారు తన్ను కావాలనే అవమానించాడని శాస్త్రి గ్రహించాడు — దెబ్బకుదెబ్బ ఎప్పుడు తీస్తామా అని సమయంకోసం ఎదురుచూడసాగాడు.

చాలారోజులు గడిచిపోయాయి. జమీందారు పేరిశాస్త్రి సంగతే మరచిపోయాడు. రోజూ సాయంకాలం ఒకరికొకరు ఎదురుపడుతుండేవారు. శాస్త్రి గడ్డం పెంచసాగాడు. నెలరోజులు జరిగినా గడ్డం పెంచుతున్నాడేకానీ క్షురకర్మ చేయించుకున్నదిలేదు. ఉండబట్టలేక జమీందారు ఒకనాడు "ఏమోయ్ శాస్త్రి, గడ్డం పెంచుతున్నావెందుకు? క్షురకర్మ చేయించుకొనే తీరిక లేదా? లేక మంగలే కరువయ్యాడా?" అని నవ్వుతూ అడిగాడు.

అందుకు పేరిశాస్త్రి "మహాప్రభువులు అనుగ్రహించాలి. మంగలి వున్నాడు. కానీ వాడి కత్తికి పదును లేదట. వేరే కత్తి తెచ్చేవరకూ నేనిలా వుండాల్సిందే. తమరు దయతలచి మీ వొరలోని కత్తి నిప్పించారంటే గడ్డం గీయించుకుంటా" నన్నాడు.

ఈ మాటలకువిరగబడి నవ్వుతూ "నీ కేమన్నా పిచ్చిపట్టినదా? ఈ కత్తి గడ్డంగీయించుకునేందుకు పనికిరాదు," అని అన్నాడు గుఱ్ఱంమీది జమీందారు.

ఈ మాటలకు శాస్త్రి యింకా పెద్దగా నవ్వుతూ "ఇంత పెద్ద కత్తి ఇంత చిన్నపని చేయలేదంటే దీన్ని మీరు మోసుకొని తిరగడం దండగ గదా? వృథాగా దాన్ని మోస్తున్నారే పాపం!" అని అన్నాడు. దీంతో జమీందారుకి ఆనాటి పంచాంగం విషయం గుర్తుకు వచ్చింది. పేరిశాస్త్రిసమయస్ఫూర్తికి చాతుర్యానికి సంతోషించాడు.

ఆనాటినుండి ఎదుటివారిని హేళనచేయడం మానుకున్నాడు. ఎదురుదెబ్బ తీసిన పేరిశాస్త్రికి తన దివాణంలోనే నౌకరి ఇప్పించాడు జమీందారు. ★

# మృగరాజు

అడవి

అర్ధరాత్రి—

సింహం, పెద్దనక్కా, గుంట నక్కా, ఓసారి, వేటకు బయలు దేరినై.

ముందుగానే సింహం చెప్పింది:

"నేస్తులారా, వేట పూర్తి చేసుకుని,—గుహకు చేరుకోవడంతోటే, మనం వేటచేసిన జంతువును మూడు సమవాటాలుగా-చేసుకుందాం. ఏమంటారు? అది, మంచి పనికాదా?"

తోకాడించేయి నక్కలు రెండూ.

"ఎంత మంచి ప్రభువులుమీరు!" అంటూ, మెగిరి, గంతు వేశాయ్!

మూడు మృగాలూ కదిలేయి.

పయనమయినాయ్ తిన్నగా దేన్నైనా, వేటాడి తీరాలని.

చెట్లూ, పుట్టలూ గడిచేయి.

కొండవంతలు దూకేయి.

వాగులు దాటేయి.

అంతు పట్టడంలేదు, ప్రయాణం.

కంటబడ్డది లేదు, జంతువేదీ.

పచ్చని అడివిలో, తరుమవచ్చే లేళ్ళనూ దుప్పులు!

పెన్నాడవచ్చు వాటిని రోజల్లా.

కాని, యుక్తీ, పడీ, శక్తీ, లేకయినట్టాయెనా, యెన్నడూ సాధ్యంకాదు, వేట.

గుంటనక్క యెంతేనా, జిత్తులది.

పెద్దనక్క పిక్కబలానికి, కొరత సింహంబలమో, అనమానం.

బలే, బందోబస్తు!

ఇక, తిరుగేముంది, వేటకు?

నిర్విఘ్నం. నిస్సందేహం.

దిగ్విజయమైంది!

చిక్కబట్టిన దుప్పియే, సిద్ధమయింది చిట్టచివరకు.

సిద్ధించింది!!

పకడ్గా, పట్టుకొన్నాయ్.

సింహం, వాటాలు వెయ్యాలి యింక; నక్కలకి కూడా, పంచిపెట్టాలి.

---

సోమంచి సూర్యనారాయణశర్మ

---

సింహం, వేట, సమ విభాగం చేస్తుందనుకున్నాయి, నక్కలు రెండూ.

నమ్మకున్నాయి.

దర్జాగల మృగరాజుకు, కక్కూర్తియేమీ, ఉండదనే, ఊహించాయి.

తమ వాటాలకు, తేడా, రాదనే ధీమాతోనే ఉన్నాయ్, పెద్దనక్కా, గుంటనక్కా కూడా.

నిరీక్షిస్తున్నాయ్.

నక్కలకి, నోరూరుతోంది.

దూరం, తిరిగిన వేమో, ఆకలితో, నకనకలాడుతున్నై!

ఉవ్విళ్ళూరుతూ, మోకరించుకుని, కూచున్నై! ఉభయ పార్శ్వాలనూ.

చూసి, చూసి, తీవిగా, మోర యెత్తి, పలికింది సింహం:

"నే నెరుగుదు. మీరు చాలా, శ్రమపడ్డారు; అలిసిపోయారు. ఆకలితో ఉన్నారు. వేట, పంపకం చేయడానికి, అనుమతిస్తారనే, నా భావన"

మూడు వాటాలు చేసింది దుప్పిని.

సమానవాటాలే, వేసింది.

"మృగరాజును కదా నేను! మొదటి వాటా, నాకు వస్తుంది. ఏ విందులో, కాన్నీ, జరిగే, మర్యాదే, యిది-మీకు తెలియనిదికాదు"

సింహం గుడ్లురిమి చూస్తోంది!

చింతనిప్పుల్లా, ఉన్నాయి కళ్లు!

తోక, అటూ, యిటూ, ఊగిస్తోంది!

"రెండో వాటా, నాది; దుప్పిని, పరిమార్చింది, నేను"

అట్టే, పరకాయించింది.

ఆవులించింది,

నిదానించింది సింహం.

"మిగిలింది, ఓవాటా—అంత వరకూ, యథార్థం. ఆ వాటాకోసం, మీరిద్దరూ, తగాదాపడతారనన్నది. అంతకన్నా యథార్థం. నా సమక్షంలో, మీరు కీచులాడుకోవడం, చూడలేను నేను. అలాటి సంగతి, నా యెదుట, జరగరాదు కూడా. అది కారణంగా, మూడో వాటా కూడా, నేనే, తీసుకుంటున్నా."

ఆపోశనం, పట్టింది."

గర్జించింది, సింహం!

ఉసూరుమంటూ, ఒకదాని మొహం, ఒకటి, చూసుకుంటూ, కిక్కురుమనకుండా జారుకున్నాయి, నక్కలు తోక ముడుచుకుని. ★

[ఆంగ్లకథ ఆధారంగా]

# స్వర్గసీమ

(43 వ పేజీ తరువాయి)

"ఇవాళనుంచి బాబుకి పోసేపాలు వంట బట్టాయి కమలా." నవ్వుతూ అన్నాడు సూర్యనారాయణ.

"ఏం."

"ఇన్నాళ్ళనుంచి వాడి ఒంటికి ఒట్టి పాలబలమే యిస్తున్నాం. ఇవేళనుంచి, తల్లి ప్రేమబలంకూడా యిస్తున్నాం—అందుచేత."

సమాధానం చెప్పకుండా చిరునవ్వు నవ్వింది కమల.

ముఖం కడుక్కునివచ్చాక సూర్యనారాయణ ఒంటిమీద చేయివేసి జ్వరంలేదనీ తెలుసుకుంది కమల.

"ఈరోజు పథ్యం తినొచ్చాండి డాక్టరుగారూ?" అన్నాడు సూర్యనారాయణ.

ఇలాంటి ఛలోక్తి వారిద్దరి జీవితాల్లోనూ క్రొత్తే. అందువల్ల 'ఎలా అన్నావా' అని సూర్యనారాయణ, 'ఎంతబాగా అన్నారు' అని కమల వింతపడ్డారు.

మహిళా సమాజంలో నిన్న జరిగిన ఎన్నిక చెప్పింది కమల

"ఇప్పుడు చూశావా? నువ్వుయింట గెలవ లేకపోయి—రచ్చ వోడిపోయావు. అంతే కమలా! నీ అవసరం వున్నంత కాలం నువ్వంటే ప్రేమ చూపారు. ఈపాటికి నీనోటి దురుసుతనం సహించలేక యిలా చేసి వుండవచ్చు నీలో కూడా లోపం లేకపోలేదు. నీకుమాత్రం పదవీ వ్యామోహం లేదూ!—నే నిలా అంటున్నానని బాధపడకు. సంఘం అన్నప్పుడు యిటువంటి సంభవాలు సహజమే

కమల మౌనంగా బాబును నిద్రపుచ్చడానికి తీసుకు వెళ్ళింది.

ఆ రోజుకూడా సూర్యనారాయణ సెలవు పెట్టాడు. సాయంత్రం కమల ఆఫీసునుండి విచారంగా వచ్చింది. వస్తూనే సూర్యనారాయణ వైపు తీవ్రంగా చూసింది.

"నేనూరికే అన్నానా! మగవాళ్ళు నీచులని"

"ఏం? ఏం జరిగిందేమిటి?" అడిగాడు సూర్యనారాయణ

"జరగాల్సిందే జరిగింది. వెధవ! నన్ను చూసేవా ఆధునిక అలంకారం, వేషం చూస్తే వాడికెలాగో వుందట వాడి అనుమానం అబద్ధం కాకపోతే .." వెక్కి ఏడుస్తూ చెప్పింది కమల "నాకభ్యంతరం లేకపోతే"

"అభ్యంతరం లేకపోతే?" ఆతురతగా అడిగాడు సూర్యనారాయణ.

"అంతే. మిగతా మాటలు నోటివెంబడి రకుండా చేతిలోవున్న ఫైలు పుచ్చుకుని ముఖానకొట్టి-'ఓరిజంతువా! నీకంటె అందమైన వారే నాభర్త, ఆయన చాలా ఉత్తముడు, యింకో మారిలా పేలావంటే-యిప్పుడు చేతిలో ఫైలు పడిందికాని, ఎడమ కాలి చెప్పు నీముఖాన్ని ముద్దెట్టుకుంటుంది జాగ్రత్త" అని చెప్పివచ్చేశాను"

సూర్యనారాయణ పొట్టచెక్కలయ్యేట్టు పకపకా నవ్వుతున్నాడు.

"ఎందుకండీ అంతనవ్వు మీమగవాళ్ల ప్రతాపానికి."

"కాదు కమలా! బుద్ధిబాగానే చెప్పావు కాని, నీ ఆదర్శాల ఆచరణ పరిణామాలు ఒక్కొటొక్కటే నీ అనుభవంలోకి ఎలా వచ్చాయో చూసి నాకు నవ్వొచ్చింది. అందరు పురుషుల్నీ దూషించావు నీ భర్త కూడా మగవాడే. మధూ మగవాడేగా."

"మధు. గొప్పకబురు చెప్పేమధు ఏమంటాడు దీనికి?" తిరస్కారంతో అడిగింది కమల.

"పోనీలే కాని, మధుకి ఒంట్లో బాగుండ లేదని విన్నాను ఒకసారి వెళ్లి చూసిరాద్దూ, నాకోపిక లేదు."

"వెళ్తాను, వెళ్తాను. వెళ్లి యీ విషయం చెప్పి తలవంచుకు నేట్లు చేస్తాను" అంటూ విసురుగావెళ్లి పోయిందికమల. విస్తుపోయినిలబడిపోయాడు సూర్యనారాయణ.

మధు యింటి మెట్లెక్కుతూన్న కమల లోపలమాటలు వినే స్త్రీ సహజమైన కుతూహలంతో నిలబడిపోయింది

"ఏమండీ! కాస్త కాఫీతాగండీ!"

"నాకొద్దు పద్మా! నాకు కాఫీ హితవు లేదు. నన్ను బలవంతపెట్టకు"

"ఎలాగండీ మరి? ఏం తీసుకోకపోతే నీరసం వస్తుంది?"

"ఏమిటి బాబాయ్. పిన్నిని హస్తమానం వేధిస్తావు పిన్ని కాఫీతాగమంటే తాగెయ్యాలంతే." సుందరం మాటలవి.

"ఓరి! వకాల్తానామా పుచ్చుకున్నావేమిట్రా మీ పిన్నిదగ్గర ఉండు మీ పిన్నిచేత రేపు నీకో సీసాడు ఆముదం పోయిస్తాను."

"లేకపోతే ఏమిటి? కాఫీతాగవు, బార్లీ తాగవు నీ మూలాన్ని మధ్యాహ్నం పిన్ని భోజనంకూడా సరిగ్గాచెయ్యలేదు తెలుసా? నాకు జ్వరమొస్తే పిన్ని యేంచెప్తే అది చేసేస్తాను" పద్మ వారిస్తున్నా సుందరం అనేశాడు

"ఏం పద్మా!" అన్నాడు మధు ఆశ్చర్యంగా.

"కాదు బాబాయ్. నీకలావుందని పిన్నికి అన్నం నోటికి వెళ్లలేదు" అంది లలిత.

"బాబాయ్! నే చెప్పేస్తున్నాను. నువ్వు పిన్ని చెప్పినట్లు చేయకపోతే—నేను, లలితక్కాకూడా భోజనం మానేస్తాం."

పద్మ,మధు పకాలున నవ్వారా మాటలకు. సుందరాన్ని దగ్గరకు తీసుకుని ప్రేమతో తల నిమిరింది పద్మ.

"సరే! తెండి కాఫీ! ముగ్గురూ కలిసి మెడలు వంచేశారు"

కమల మ్రాన్పడి నిలబడి పోయింది! పద్మకెంత ప్రేమ—మధంటే! మధు, సుందరం, లలిత—ఇందరి ప్రేమల్ని ఎలా చూరగొన్నది! పద్మకంటె తను చదివినదే! తన కందరితోనూ సంఘర్షణే!—ఇంక అక్కడ నిలబడక వెనుకకు తిరిగి వచ్చేసింది కమల. కమల మెట్లుదిగడం చూసిన లలిత యింట్లోకి వెళ్ళి మధుతో చెప్పింది.

"అయ్యో! ఎందుకొచ్చిందో! ఏం చెప్పకుండా వెళ్ళిపోయింది—సూర్యనారాయణ కెలావుందో. నే వెళ్ళి చూసివస్తాను పద్మా!"

"మీరా! ఇలావుండి ఎలా వెడతారండీ! నేనుకూడా వస్తాను. రిక్షాని పిలిపిద్దాం వుండండి"

మధు, పద్మలు సూర్యనారాయణయింట్లో అడుగిడేసరికి వాళ్ళకి కనిపించిన దృశ్యం—కమల కన్నీళ్ళతో సూర్యనారాయణ పాదాలకు నమస్కారం చేస్తోంది."

"ఏమిటోయ్ వంగి వంగి దణ్ణాలెట్టించుకుంటున్నావు?" అన్నాడు మధు.

"నిన్నటిదాకా నా మెడలు వంచింది. ఈ రోజు తనువంచుకుంది ఎప్పుడైనా ఆమె చెప్పినట్టువినే వాణ్ణే. నీలా కాఫీ తాగడానికి గడ్డంక్రింద బెల్లంముక్క పెట్టించుకునే వాణ్ణి కాదు" నవ్వుతూ అన్నాడు సూర్యనారాయణ. కమల పద్మనాహ్వానించింది

"పోనీలే బాబూ! మా అక్కగారు మా యింటికొచ్చి ఏమీ చెప్పకుండా తిరిగి వచ్చేస్తే హడలెత్తి పరుగెత్తుకొచ్చాం." అన్నాడు మధు అక్కడున్న కుర్చీలో కూర్చుంటూ.!

"మా జీవితాల్లో యీ రోజు నూతన పరిణామం వచ్చింది. మా కమలలో పూర్తి పరివర్తన వచ్చింది. మహిళా సమాజంనుండి నిన్ననే విడిపోయింది. ఇవేళ అధికారి ఏదో అన్నాట్ట.—వాడిముఖానొక ఫైలువిసిరి, వాడి ఉద్యోగం వాణ్ణే ఏడవమని చ్చేసింది."

"అదేం?" అన్నాడు మధు ఆశ్చర్యంగా.

"ఏముంది? నేనుసరిగా వుండటంలేదట, యిక్కడినుంచి యింట్లోవుండి నన్ను, వాళ్ళఅబ్బాయిని తనే స్వంతంగా సరిదిద్దుకుంటుందట." నవ్వుతూ అన్నాడు సూర్యనారాయణ.

"పోగురూ" అంది కమల సిగ్గుపడుతూ.

ఆ సిగ్గుపడేముఖం మధుకి చూపుతూ

# స్వర్గసీమ

"ఇదొక క్రొత్తదినం మా కమల జీవితంలో" అన్నాడు సూర్యనారాయణ. మధు నవ్వాడు.

"మొత్తానికి నువ్వు పరాజితుడవయ్యావు. అవునోయ్! నిజంగానే నీకీ మధ్యబొత్తిగా మంచీ చెడ్డా లేకుండా వుంది. నీ కావిడ పాఠాలు నేర్పాల్సిందే" అన్నాడు మధు.

"ఏమయితేనేం. మేమిప్పుడు పొందుతున్న సౌఖ్యము, మా చెల్లాయి పద్మ ప్రభావం. అందుచేత యీ విజయం పద్మదే. ఏదీ?" అన్నాడు సూర్యనారాయణ ముగ్గురికళ్ళూ పద్మకోసం వెదికాయి.

ఉయ్యాలలోవున్న బాబుని యెత్తుకుని వారున్న హాలులోనికి అప్పుడే అడుగుపెడ్తూ వుంది పద్మ.

"ఏం మధూ! అంతముచ్చట పడుతూ వుంది మా చెల్లాయి. ఓపాపాయిని కనరాదూ?" అన్నాడు సూర్యనారాయణ చిరునవ్వుతో.

"బాగుంది. నన్ను కనమంటావా ఏమిటి? ఆ పని మాత్రం నావల్ల కాదుబాబూ!" అన్నాడు మధు. ★

# ★ సుబ్రావ్ ది గ్రేట్ ★

(30-వ పేజీ తరువాయి)

పరిస్థితికి దిగేటేమిటనుకుంటూ.

"శ్రీరామచంద్రా! నేనంటే అంత చాతగాని వాణ్ణన్నమాట మీ దృష్టిలో. మీరు నమ్మండి నమ్మకపోండి, యిదివరకు నా పేరులో వచ్చే రచనలన్నీ నేను వ్రాసినవి కావు, ఈమధ్య వస్తూన్నాయి చూశేరూ అవన్నీ మనవి" అని ఉన్నదున్నట్లు సూచించేరు సుబ్బారావుగారు చాలావరకు నిరాశ చెంది.

"ఒరేయ్ సుబ్బారావు నువ్వు చెప్పినా అవతలవాళ్లు నమ్మర్దురా. అనవసరంగా యిలాంటి ప్రచారం చేసుకున్నావంటే అంతా నిన్ను 'ఫూల్' చేస్తారు" అన్నారంతా సుబ్బారావు మనస్సు బాధపడుతుందే అన్న విషయం గమనించకుండా.

సుబ్బారావుకి తలకొట్టేసినట్లయింది. తను ఎన్నివిధాల చెప్పినా మిత్రులు తోటివాళ్లు నమ్మేటట్టు లేరు. పైగా నేనిలా, నా పేరు గలవాడెవడో యింకోడు వ్రాస్తే అవి నావని నేను చెప్పుకుంటున్నానని తెలిస్తే నిజంగా నన్నొక వెధవక్రింద కట్టేమాట తథ్యం. మావాడిలా చెప్పుకుంటున్నాడని వీళ్ళంతా కలసి పదిమందిలో అంటే వాళ్ళైనా "అచ్చే యిదేం పని" అని అన్నా అనుకుంటారు. షేమ్, షేమ్ అనుకున్నాడు సుబ్బారావు మనసులో. 'సరే నిజం నిలకడమీద తెలుస్తుందిలే" అని నీరసంగా పలుకుతూ వాళ్ళను వదలి వెళ్లిపోయాడు సుబ్బారావు. "ముందు తెలియటంగాదయ్యా, మాకీవిషయం ఎప్పట్నించో తెలుసు" అన్నారు వెనకనుంచి నిర్లక్ష్యంగా అతన్ని బాధపెడుతూ.

నిజంగా సుబ్బారావుని చూస్తే అప్పుడు ఎవరికైనా జాలివేయక మానదు. అతను చేసిన తప్పేమిటి? తప్పంతా అతని మిత్రులదే. అంత తొందరగా నిర్ణయానికి రావటం తప్పు.

మనిషెన వాడెప్పుడూ ఒకే లాగుంటాడా? ఒకసారి జరిగిన దానికి, ఎప్పుడూ ఒకడిమీద అదే ఉద్దేశంతో ఉండటం మన సంకుచిత దృష్టికే తార్కాణమే అవుతుంది. సుబ్బారావికి తనజన్మలో వ్రాయలేడనుకోవటం నిశ్చయంగా పొరపాటే. 'ఓటమే గెలుపుకి మొదటిమెట్టు' అన్నారు పెద్దలు. సుబ్బారావు విషయంలో అచ్చం అంతే జరిగింది.

ఈ పరిస్థితి ఏర్పడినందుకు సుబ్బారావు చాలా దిగులు పడ్డాడు. తనిగట్టుకు వెళ్లి, యీ వ్రాసేది నేనేనయ్యా అని చెప్తున్నా వాళ్లు వినడంలేదే అనే బాధ ఎక్కువైంది. పైగా యీమధ్య పదిచోట్లకి వెళ్లి, "మొన్న నేను ఆగేయంలో వ్రాసినట్లు, యీ కథలో ఉదహరించినట్లు" అని చెప్పుకున్నాడు. కాసులోగూడా ప్రత్యేకంగా సందర్భం కల్పించి తన పత్రికా రచనల్లో, చాలా

'కోట్' చేశాడు. ఇపుడు అందరూ కలసి యిదంతా మోసం అనుకుంటే తనెంత 'ఫీల్' అవాల్సి వస్తుంది— అని విచారించేడు సుబ్బారావు.

వీళ్లకు తలవాచేటట్లు ఎలా సమాధానమివ్వటమనేదే సుబ్బారావు ప్రశ్న—సమస్యా - అయ్యాయి.

వెంటనే ఒక చండప్రచండమైన అయిడియా తట్టింది. రైట్! దీంతోగానీ వీళ్ల గుండెలు పగలవనుకున్నాడు. దాని తాలూకు. పాయింట్లన్నీ మర్చిపోకుండా ఒక కాగితంమీద వ్రాసి పెట్టుకున్నాడు.

ఒకనెల జీతం తగలేసి బంధువులనందరినీ సందర్శించేడు. వారందరిచేత ఉత్తరాలు విపరీతంగా వ్రాయించేడు ఆ పత్రిక ఎడిటర్‌కి "బంగారం సోమేశ్వర సుబ్బారావు గారి రచనలు అమోఘంగా ఉన్నాయి. వారియందు మాకెంతో అభిమానం ఏర్పడింది. దయవుంచి వారినిగురించిన వివరాలు ఫోటో, మీ పత్రికలో ప్రకటించ గోరుతున్నాము" అని.

తిరిగి తిరిగి కాంపజేరి శ్రీమతి చేతకూడా రెండు వ్రాయించి, తనే పోస్టుచేశాడు.

ఇలాంటి పని ఎంతచేసినా సుబ్బారావుకి శ్రమ అనిపించలేదు. ఎవరు ఎలా నమ్మకపోయినా, తనకుమాత్రం నూరుపాళ్లు తృప్తి ఉంది.

తను వేసుకున్న ప్లాను ప్రకారం త్వరలోనే పత్రికలో ఒకపేజీ సుబ్బారావుకి కేటాయించేరు. సుబ్బారావు తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. కొద్దిరోజుల క్రితం తనుపంపిన ఫోటో ఎంతో అందంగా అచ్చయింది. తనసిల్కు లాల్చీ, 'ఫౌంటెన్ పెన్' కూడా పత్రికలో కెక్కాయి. క్రింద సుబ్బారావు ఎడ్రసు మరికొన్ని వివరాలు, అతనిచేత వ్రాయబడి, ప్రజలచే 'మన్నన'లు పొందిన రచనల పేర్లు కూడా వ్రాసి ఉన్నాయి. అమ్మయ్య! ఇక ఫరవాలేదనుకున్నాడు వాటినిచూసి.

ఆవేళ కాలేజీలో స్టూడెంటంతా "మన మేష్టారి ఫోటో పత్రికలో వేశారోయ్" అనుకున్నారు. ఈవార్త వెళ్ళి, వెళ్ళి, సుబ్బారావు మిత్రులదగ్గిరికి చేరింది. కాలేజీలోని తోటి ఉపాధ్యాయులదగ్గిరికి ఎప్పుడో వ్యాపించింది. పత్రిక కొని అంతా చూసేరు. "ఏమీ సందేహంలేదు" మన సుబ్బారావే" అని ఆశ్చర్యపోతూ పెద్దపెట్టున నిట్టూర్పులు విడిచారు. రికార్డు బ్రేక్ చేస్తూ "ఇదేమిట్రా మరి మనమంతా అలాచేశాం" అని నాలిక్కరుచుకున్నారు. సుబ్బారావుని వారుచేసిన హేళనని అంతా గుర్తుకు తెచ్చుకున్నారు. తమేదో తీరని అన్యాయం చేసినట్లు బాధపడ్డారు. 'నిజంగా అతన్నెంతో కష్టపెట్టాం' అని విచారించేరు. ఇక వాళ్లొక క్షణంకూడా ఉండలేకపోయారు' తక్షణం సుబ్బారావు దగ్గిరికి వెళ్లి క్షమాపణ చెప్పుకునేదాకా, వారికి తోచదు.

అప్పటికి సాయంత్రం అయిపోయింది. కాలేజీ వదిలేశారు. సుబ్బారావు యింటికి వెళ్లాడు. శ్రీమతి చల్లని చేతులతో వేడివేడి కాఫీ అదించింది సుబ్బారావుకి. ఆనాడు కాఫీకొక రుచి వచ్చింది. మారు అడగటం 'మేనర్సు' కాదని ఉన్నంతమటుకూ. ఆలస్యంగా త్రాగి విశ్రాంతికోసం పడక్కుర్చీ నాశ్రయించేడు సుబ్బారావు.

వీధిలోంచి మిత్రులంతా 'సుబ్రావ్' అని ఒక కేక వేశారు. ఆ కేకలు తనవాళ్లవేనని తెలిసే "సుబ్రావ్ యిక్కడలేడోయ్" అన్నాడు సుబ్బారావు పెద్దగా.

అబ్బ! ఏదో పొరపాటయింది తీయవయ్యా తలుపు, అని ప్రాధేయపడ్డారు. సగర్వంగా సుబ్బారావు నవ్వుతూనే తలుపు తీశాడు.

సుబ్బారావు అని ఏదో అనబోయారు మిత్రులు.

'ఏ సుబ్బారావు?' అన్నాడు మన సుబ్బారావు.

"ఇంకే సుబ్బారావు రైటరు సుబ్బారావే"

"అచ్చే వాళిల్లు యిదిగాదే" రైటరు సుబ్బారావు ఎవరబ్బా? అన్నాడు పైకి చూస్తూ.

"ఇప్పటికే ప్రాణం లేదు యిక చంపకయ్యా స్వామీ" అని దారికొచ్చారంతా. "మేమన్న మాటలన్నీ 'విత్ డ్రా' చేసుకుంటున్నాము. నువ్వు మాత్రం మమ్మల్ని క్షమించాల"న్నారు.

దీనిలో మీతప్పేమీ లేదురా అబ్బాయి వాడెవడో వచ్చాడు మధ్య మనకు కాంపిటీషన్ తగలడానికి. అంతే అన్నాడు సుబ్బారావు కోపం అంతా చంపుకుంటూ. సుబ్బారావుతో సహా అంతా చిరునవ్వు చిందించేరు.

నిజంగా నువ్వెంత గ్రేట్ మేన్ వని మేమనుకోనందుకు చాలా చింతించేమన్నాడొక 'అతి' మిత్రుడు.

"నే చెప్పలేదురా సుబ్బారావుకి మాంచి ఫ్యూచరుందని" అని అన్నాడు యిదివరకటి పాతస్నేహితుడు.

అంతా గొల్లున నవ్వేరు. "పోరా నువ్వెప్పుడూ యింతే" అంటూ సుబ్బారావు దిగ్రేట్‌కి ఆరోజు రాత్రి మిత్రులంతా కలిసి డిన్నర్ చేశారని వినికిడి. ★






# వేల్పులూ - 'తెర వేల్పులూ'

దేశంలో విడుదల అయే చిత్రాలను 'సెన్సారు' చేసి, అనుచితమైన మాటలూ ఆటలూ తొలగించడం అనేది, ఇతరులమాట ఎలా ఉన్నా నిర్మాతలకు చాలా చేదుగా బాధగా ఉండడం సహజం. 'వాళ్ళిష్టం వచ్చినట్లు తీసేస్తున్నారు' అని కొందరు లోపాయకారీగా అనడం కూడా జరిగింది. సెన్సారు సభ్యులుకూడా ఒక రిద్దరు ఇదే మాటను జవాబుగా ప్రయోగించారు: 'వాళ్ళిష్టం వచ్చినట్లు తీసేస్తున్నారు' అని ఇందులో తాత్పర్యం నిర్మాతలు ఇష్టం వచ్చినట్లు చిత్రాలు తీసేస్తూ ఉంటే, సెన్సారు, ఇష్టం లేక పోయినా వాటిలో కూడనివని పించినవి తీసేస్తున్నారని.

కూడని వనిపించేవాటిలో అశ్లీల పదాలూ, అసభ్యదృశ్యాలూ మాత్రమే ఉంటాయని భావించరాదు. పురాణ పురుషులను వెలితిచేసి చూపించడం, వారిచేత వెకిలిగా మాట్లాడించడం మరి భూమ్మీదకు దించేసి మేకపోటి అట్టె నిలబెట్టడం వంటివి కూడా ఈకోవలో చేరుతాయి. అలాగే చరిత్రలో ప్రసిద్ధికెక్కిన వీరులు, జాతీయ నాయకులను, వారిమీద ప్రేక్షకుడికి ఉండే గౌరవం, భక్తి అభిమానం చిక్కి శల్యమై పోయేవిధంగా చూపించడం, మన మిత్రదేశాల ప్రజలను, వారి జీవన విధానాలనూ, దేశచరిత్రలనూ చిత్తవచ్చినట్లు మార్చి వాటికి సినీ వైద్యంచేసి బాక్సాఫీస్ మాత్రలుగా వాడడంకూడా, మన దేశానికీ మనవిబటి సెన్సారు సంఘానికి 'పాయింటవు': అయినా, దేశీయ ప్రాంతీయ చిత్రాలలో పైన పేర్కొన్నవీ, విదేశీయ చిత్రాలు కొన్నిటిలో తరువాతివీ తరచుగ జరుగుతునే ఉంటాయి. ముఖ్యంగా మన చిత్రాలలో పురాణ పురుషులను బాక్సాఫీస్ హీరోలుగా వాడుకోవడం పరిపాటి అయిపోయింది. బాధ్యతగల పెద్దలూ, సెన్సారు సభ్యులూ కూడా ఈవిషయమై చలనచిత్ర కళాకారులను ఇదివరకే హెచ్చరించడం జరిగింది.

వేల్పులు పొరుగు లోకంలో ఉంటే వాళ్ళంటారు. సాక్షాత్తూ భూలోక వాసుల దైవాలు. వాళ్ళ రూపు రేఖలగురించీ విగ్రహ మూర్తిగురించి, ఇతిహాసాలూ పురాణాలూ బ్రహ్మాండమైన వర్ణనలు చేశాయి. జనానికి వారిమీద గొప్ప భావం ఉంది. అందువల్ల, తెరమీద ఆ వేల్పులను నిలిపినపుడు, వాళ్ళకి ఫలానా సినిమాలో పార్టు చిన్నదైనా, పెద్దదైనా కూడా, తగిన విగ్రహం, తేజం, ఉన్నవారిచే తీసుకోదాలి తప్ప, చిన్న చూపుచూసి, కాలక్షేపపు ఏర్పాట్లు చేయడం భావ్యంకాదు.

ఉండి తీరవలసిన 'తెరవేల్పులకు', ఉంటే చాలుకే అనిపించే ఉపవేల్పులకు అందుబాటులో ఉన్న ఇతరులకూ, దేవతలను సరిపెట్టేయ్యడం చాలా శోచనీయం. అలా చేసినా, సింద్రెలా జోళ్ళకి సరిపడేలా కాళ్లు సర్దుకోయిన వాళ్లలాఅయా కళాకారులూ ఒక్కొక్క సారి హాస్యాస్పదులవుతున్నారు. సమర్థులుగా పేరుప్రతిష్ఠలు తెచ్చుకొన్న వారు, ఒకొక్క సారి, తమకు తగని పాత్రలను తీసుకోవడం వల్ల, అటు వాటికీ, ఇటు తమ ప్రతిష్ఠకు కూడా అన్యాయంచేస్తున్న వారవుతున్నారు. ఒక పాత్రకుతగిన విగ్రహం లేకపోవడం ఒక నటుడి ప్రజ్ఞకు ఏవిధంగానూ కళంకం కాదు. ముఖ్యంగా చారిత్రక, పౌరాణిక ఇతివృత్తాలుగల చిత్రాలలో పాత్రలు నిర్వహించడానికి, ఒకవిధమైన కనుముక్కుతీరు, అంగసౌష్ఠవం ఉంటే బాగుంటుంది. మాట వరసకి, గారీకూపర్ కి బాక్సాఫీస్ లెక్కలో ఎంత స్టార్ వాల్యూ ఉందో, నటనలో అంతకు పదింతలు ప్రజ్ఞా ఉంది. అతను జీజసు వేషంవెయ్యడానికి ఆ రెండిటికన్న



జార్జి బెర్నార్డ్‌షా నాటకం 'సెయింట్ జోన్'కు ఆటో ప్రెమింజర్ చలనచిత్ర అనువాదంలో జీన్ సెబెర్గ్, రిచర్డ్ విడ్‌మార్క్.

అర్హతలు ఇంకేంకావాలి అంటే అతను కూడా నవ్వేసి వెళిపోతాడు.

దేవతలకథలు తీయడంలో, చన్ని వేళాల చిత్రణకూడా, చాలా బాధాకరంగా తయారవుతోందని పలువురు విమర్శిస్తున్నారు. చలనచిత్రాలలో స్వర్గసీమ, ఈనాడు, ఒక్క జాతీరీతీ లేని సంకర నృత్యసంగీతాలకు, బాక్సాఫీస్ ఒబ్బు విరుపులకు అనుకూలమైన స్టుడియో సెట్ గా తయారైపోయింది. వేడో కేవో రాక్ ఎండ్ రోలు మార్కు ఎంటర్టయిన్మెంటు ఏర్పాట్లు జరిగినా మీరు త్రుళ్ళిపడి ఇదేమనుకోకండి. ఆ మధ్య ఒక చిత్రంలో, దేవలోకం 'జల్సాఘర్'గా చూపించబడింది. ఎవరో అమ్మడు బాక్సాఫీస్ డాన్సు చేస్తూఉంటే, దేవతలంతా, 'శాబ్బాస్' అన్న డైలాగు మినహా మిగతా బొంబాయివాళ్ళ సినీ చేష్టలు అన్నీ చేశారు. సెన్సారువారు అది చూచి బాధపడి, తీసేయించారు.

నిర్మాత, అదిచూచి, బాధపడి, నిట్టూర్చాడు. నిజమే. కొన్ని వేల రూపాయలు సెన్సారువారు నిర్దాక్షిణ్యంగా కత్తిరించినట్లనిపిస్తుంది. అయితే అందుకు కారణం కూడా సహృదయంతో అర్థం చేసుకోవాలి. సానుభూతి లేకుండా వ్యవహరిస్తే చిత్రంలో భాగమే కాదు. మొత్తానికి మొత్తం కత్తిరించవలసివస్తుంది కదా అని ఒకరుఅన్నారు. అది నిజమని ఒక చలన నిర్మాతే అంగీకరించారు....

* * *

"అందువల్ల, సెన్సార్లు బాధ్యతారహితంగా, చేతిలో అధికారం, ఓ 'కత్తెర' ఉన్నాయన్న తిక్కతో చిత్తంవచ్చినట్లు వ్యవహరిస్తున్నారనుకోవడం పొరపాటు." అని కేంద్ర సెన్సారు సంఘం అధ్యక్షుడు శ్రీ ఎం. డి. భట్ మొన్న మద్రాసులో మాట్లాడుతూ అన్నారు.

సెన్సారు చేయడంలో ఒక ప్రాంతానికి మరో ప్రాంతానికీగల పద్ధతులలో తభావతులు తేడాలూ ఉన్నాయన్న ఫిర్యాదును పురస్కరించుకుని మంచి చెడ్డలు విచారించటానికి వీరు మద్రాసు వచ్చారు. రెండు మూడుచిత్రాలుకూడా చూశారు.

* * *

నేటి చిత్రాల ధోరణుల గురించి మాట్లాడుతూ, ఇటు పౌరాణిక చిత్రాల విషయంలో పైన పేర్కొన్న తరహా లోపాలు ఉండగా, అటు 'బొంబాయి క్రైమ్ థ్రిల్లర్' అనబడే కాత్రీలలో అపరాధాలు ఎక్కువగా ఉంటున్నాయని ఆయన సూచించారు.

నిజానికి, సెన్సారింగ్ అనేది గట్టిగా చేస్తే, పిక్చర్లకి పిక్చర్లే కత్తెర కెర అవుతాయే మోనన్న ధలోక్తి వీటికి బాగా వర్తిస్తుంది. బొంబాయి ఫిలిం వ్యాపారంలో ఇది క్రైమ్ సీజన్. ఏకథ తీసుకున్నా, ఒక హత్య, దొంగసారా రవాణా, నైట్ క్లబ్, అందులో సెక్సేషనల్ డాన్సు అనేవి లేకపోతే అది చెల్లదు. రామాయణ మహాభారతాలు తీయవలసి వచ్చినా, ఇప్పట్లో ఈ సూత్రాలు తప్పించుకోలేవు. పైగా వీటిలో దొంగతనాలు, హత్యలు, పోలీసులకు టోకరా ఇవ్వడం 'గ్లామరస్' గా చూపించబడతాయి. ఎందుకంటే ఇందులో హీరో లీలలు అవే. హీరో లీలలు కాబట్టి, హీరో మంచివాడు కాబట్టి, చివర్ని అమ్మణ్ణి పెళ్ళాడి డ్యూయెట్ పాడాలి కాబట్టి ఈ 'లీల'లు కూడా మంచివే అవాలి! కనీసం సమర్థనీయమైనవి కావాలి. దానికి కోర్టు సీను సులభ మార్గం. మహా లోకువ అయిపోయిన వాటిలో ఇదొకటి. దండనార్హమైన నేరాలు నూరు చేసిన హీరో మీద విచారణలో, నూరో నేరానికే ప్రాధాన్యం ఇస్తారు. అసలది నేరం కాదనో, అయినా, హీరో దోషి కాడనో తేలుస్తారు. దోషి అయినా, "పాపం ఏం చేస్తాడు. ఇబ్బందికొద్దీ చేశాడు" అంటారు. చివరకి, ఆనూరో నేరంలో నిర్దోషి అనిపించుకొన్న హీరో, మిగతా 99 నేరాలకూ వాలిక్కరుచునే అవసరం కూడా లేకుండా చెక్కేస్తాడు. ఇదీవరస. ఇందులో సెన్సారువారు ఏభాగాన్ని కత్తిరిస్తారు?... ★

సిప్పీఫిలింస్‌వారి 'ఖ్వాల్యాక్లాక్'లో వహీదా



అనగనగా దయాళ్ అనే ఒక సినీ మంచివాడు తన దుష్ట మిత్రుడిమీద దయచూపి, అతని బదులు తను జైలుకి వెళ్తాడు. మళ్ళీ వచ్చేలోగా, ఆ నీచ సంఘటన గాడి ఆస్తి కాస్తా కల్లంతుచేసేస్తాడు. ఆపైన, ఇతని కొడుకుని పరిమార్చబోయి, మార్చేసాడు. అప్పుడు దయాళు మెలో డ్రామా ఘట్టాలన్నీ టసీనటించి చివరకు మారుపేరుతో పెద్దలాయరుగా ఉన్న కొడుకుపంచనే చేరుతాడు కాని కొడుకని డైరక్టు తెలియనివ్వడు. ఇలా వుండగా దుష్ట మిత్రుడు ముంజుకొని, ఇతన్ని. ఈ కొడుకుని కూడా పెక్కు కారణాల మీద ఖర్చు రాయించెయ్యబోతాడు. అవరకూ, పన్నెండు రీళ్లు గిర్రున తిరుగుతాయి. చివరకు కథకు ప్రత్యక్ష సంబంధం లేని ముసలాయన (దయాళ్ కుమారుణ్ణి పెంచినాయన) చనిపోతాడు: పోతూ పోతూ తన పెంపుడుకొడుకు జన్మరహస్యం బయటపెట్టవద్దని, దయాళుచేత ఒట్టు వేయించుకుంటాడు. ఆనక ఈ రభసకి కారణుడైన దుష్ట మిత్రుడిని దయాళ్ హత్యచేసినట్టు ఆరోపణ వస్తుంది. తరువాత కోర్టు సీను. అక్కడే చిక్కులన్నీ విడిపోగా, కథ కంచికి బయల్దేరింది. దయాళ్ గా సొహ్రాబ్ మోడీ, అతని కుమారుడుగా అశోక్ కుమార్, అతని ప్రియురాలుగా మీనాకుమారి, పాత గాడిలో సాగిన ఈ కథకు ప్రాణభిక్ష పెట్టారు. కథలు బాగుండక పోయినా, నటులు సమర్థులైతే ఎంతటి గొప్ప ఫలితాలు సాధించవచ్చునో వీరు ఋజువు చేశారు. ముఖ్యంగా మీనాకుమారిపాత్ర రూపకల్పన అమోఘంగా లేదు. అయినా అది బాగుండడానికి కారణం ఆమె వ్యక్తిగతమైన కళ. విలన్ పాత్రను ముబారక్ నిర్వహించాడు. ఒ. పి. నయ్యర్ సంగీతం ఇటీవలి చిత్రాలకన్నా చైతన్యవంతంగా శ్రవణానందకరంగా ఉంది.

* * *

నిర్మాత పి. ఎన్. అరోరా, 'జవానీకి హవా' అనే హుషారైన ప్రేమాయణం తీస్తున్నారు. అమ్మాయి వైజయంతిమాల; అబ్బాయి ప్రదీప్ కుమార్, జోకర్ జానీ వాకర్.

ఈ చిత్రానికి దర్శకుడు ఎం. సాదిక్. సంగీత దర్శకుడు రవి.

* * *

పేరులేని మరో చిత్రానికి అరోరానే దర్శకత్వం నిర్వహిస్తున్నారు. 'మదరిండియా' లో నర్గిస్ పెద్దకొడుకుగా నటించిన రాజేంద్రకుమార్ ఇందులో నాయకుడు. అతని ప్రియురాలు మాలాసిన్హా. రాజ్ మెహ్రా, ఓంప్రకాష్, హెలెన్ కూడా పాల్గొంటారు.

* * *

మరో కొత్తజోడా (తొలిసారి కలసి నటించబోతున్నది) రాజ్ కపూర్, పద్మినీలది. రాజ్ స్వంతచిత్రంలోనే వీరిద్దరూ కనబడుతారు. పేరు "జిస్ దేశ్ మే గంగా బహతీ హై" యువ దర్శకుడు రాధూ కర్మాకర్ కు రాజ్ ఈ చిత్రాన్ని ఒప్పగించారు. సంగీతం శంకర్ జైకిషన్లు అని వేరే చెప్పనక్కరలేదు.

* * *

ఫిలింస్థాన్ వారి కొత్తచిత్రం 'అంగనా' మొన్ననే ప్రారంభం అయింది. ఒ. పి. దత్ దర్శకత్వాన తయారయే ఈ చిత్రంలో రెహమాన్, అమిత, చాంద్ ఉస్మానీ లీలామిశ్ర, కొత్తనటి పలినీ (ఫాఖి) ఫోంకార్, ఆగా, గులాబ్, బద్రీప్రసాద్, రామావతార్ నటిస్తారు. సంగీత దర్శకుడు రోషన్.

* * *

దీప్ అండ్ ప్రదీప్ వారి 'పోలీస్' నిర్మాణం పూర్తి కావస్తోంది. త్వరలోనే విడుదల చేయడానికి సన్నాహం జరుగుతోంది. ఇందులో మధుబాల, ప్రదీప్ కుమార్ నాయకానాయకులు. ఓంప్రకాష్, అన్వర్ హుసేన్, ధుమల్ మొదలగువారు కూడా పాల్గొన్నారు. దర్శకుడు కాళిదాస్. సంగీతం హేమంతకుమార్.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి.)

## 'స్పానిష్ అఫెయిర్'

ఒళ్ళు ఝల్లుమనిపించే ప్రకృతిదృశ్యాలు చూడడానికి, స్పానిష్ జాతి తత్వాన్ని స్ఫురింపచేసే మనోహర నేపథ్యసంగీతం వినడానికీ తప్పకుండా వెళ్ళి చూడతగ్గ చిత్రం 'స్పానిష్ అఫెయిర్' (పారమౌంట్ పిక్చర్స్ సినిమాస్కోప్, టెక్నికలర్.) ఇదికాక ఒక పాతకథకూడా ఉంది. డేక్ అనే అమెరికన్ భవన నిర్మాణకళాకారుడు, స్పెయిన్ రాజధాని మాడ్రిడ్ లో ఒక పెద్ద హోటలు కట్టడానికి డిజైన్ వేసి ఇస్తాడు. తీరా అతను వచ్చేసరికి, నిర్మాణానికి డబ్బిచ్చే కంపెనీలో ముగ్గురు డైరెక్టర్లు ఇతని నమూనా బాగులేదంటారు. తమ దేశీయుల అభిరుచికి సరిపడదని వారి అభిప్రాయం. వేసవిసెలవులకు, స్వగ్రామాలకు వెళ్ళిన ఆ ముగ్గుర్నీ కలుసుకు నచ్చచెప్పి తన నమూనాను ఆమోదింపచేయడానికి బయలేరుతాడు డేక్. అతనివెంట దుబాసీగా వెళ్ళే జిప్సీపిల్లే హీరోయిన్. ఆమెను పెళ్లాడడానికి చిన్ననాటే ప్రధానం చేసుకున్న జిప్సీయువకుడు అంతో ఇంతో విలన్. మనోహరమైన బ్రహ్మాండమైన స్పానిష్ పల్లెసీమలో ముందు ఈ జంట, విలన్ వాళ్ళవెంటాపోతూ ఉంటారు. హీరో డేక్ సామాన్యుడు కాడు. పొగరుబోతు గుర్రాలను మచ్చిక చేసుకోగలడు. రోడియో అనుభవాన్ని బట్టి, స్పానిష్ బుల్ తో పోట్లాడ



బి. ఆర్. చోప్రా కొత్తచిత్రం 'సాధన'లో సునిల్ దత్

గలడు. విపరీతాభిప్రాయం ఉన్నవాళ్ళని 'మీకు నేను చెప్పేది తెలీలేదు' అని పోగా దబాయించగలడు. కాని స్పెయిన్ లో అదొక్కటే చెల్లలేదు.

ఇతని నమూనాను కాదన్న కంపెనీ డైరక్టరు, ఈ అమెరికన్ డైలాగులోని పల్చటి కల్చరు చొక్కా చింపేసి, "మేస్టారూ, నేను అపార్థం చేసుకున్నానని నాకు చెప్పకండి. మీశిల్పం నాకు నచ్చలేదంటున్నాను" అంటాడు స్పష్టంగా.

చర్చిలో వాలుగోందలమంది కూర్చోడానికి సరిపడే షెడ్డు తేలిగ్గా చవకలో చెయ్యలేకనా అంతంత రాళ్ళు పెట్టి గోపురాలూ గట్టాకట్టడం? ఆ రాళ్లలో ఆ గుళ్లలో, వాటి ఎత్తులో, బరువులో, ఠీవిలో ఈ జాతికి ఈశ్వరుడిమీద, మతంమీద పాపపుణ్యాలమీద గల దృఢవిశ్వాసం నిలచి ఉంది. అది లేకుండా, అమెరికన్ మాడల్ అద్దాలమేడలు మాకు నచ్చవు. అవి బాగులేవని అనటం లేదు. మాకు నచ్చవు. అంతే అంటాడు స్పానిష్ డైరెక్టరు.

డేక్ మళ్ళీ ఓసారి, అతనిమీద జాలిపడి నవ్వి, 'మీకు నే చెప్పేది తెలీలేదు'-అని కొత్తపాఠం పునశ్చరణ చేసేవాడేగాని, అప్పటికే అతని ప్రేమకథ క్లయిమాక్సుకి వచ్చేసింది. 'జిప్సీ విలన్' అతన్ని చంపబోయాడు. ఆ క్షణంలో 'నాకూ నీ చెలికి

## 'స్పానిష్ అఫెయిర్'

సంబంధం లేదని తప్పించుకుంటాడుగాని, దూరం ఆలోచించాక, మళ్ళీ వెళ్ళి విలన్ ఆంటోనియోని ఓడించి, జిప్సీ దుబాసీని పెళ్ళి చేసుకు చక్కాపోతాడు. ఇదీ ఏర్పాటు. దర్శకుడు కూడా కథకన్న స్పానిష్ ప్రకృతి దృశ్యాలూ, అక్కడివారి నృత్యాలూ, జీవిత సత్యాలూ చూపించడానికి ఎక్కువ శ్రద్ధ తీసుకున్నాడు. 'ట్రావెలోగ్' చిత్రాలకు మల్లె, అడుగుతున్నా, చెలియా అది ఏమి అని అమెరికన్ అడగడం, ఫలానా సుమీ అని ఆమె చెప్పడం జరుగుతుంది. అది చాలా బాగుంది. సినిమాస్కోపు ఇందుకు అద్భుతంగా ఉపయోగపడింది. ఇవి కాక స్పానిష్ చిత్రకారుడు ఎల్ గ్రెకో వర్ణచిత్రాలను కూడా కన్నులవిందుగా చూపించారు.

ఇందులో అమెరికన్‌గా రిచర్డ్ కైలీ అనే అందమైన యువకుడు, దుబాసీగా కార్మన్ సెవిలా అనే చక్కని అమ్మాయి చాలా బాగా నటించారు. ఇది గతవారం ఓడియన్‌లో విడుదల అయింది.

## స్ప్రింగ్ రియూనియన్

బెటి ('అనీ గెట్ యువర్ గన్') హటన్ నాలుగేళ్ళ తరువాత తొలిసారి నటించిన చిత్రం అన్నది, నిర్మాతలు, (యునైటెడ్ ఆర్టిస్ట్స్) ఈ 'స్ప్రింగ్ రియూనియన్' చిత్రం చూడబోయేవారికి చేసిన సిఫార్సు. చూశాక, ఆమెమీద గౌరవం కూడా పోతుంది. గౌరవం మిగిలేది ఒక డానా ఆండ్రూస్ మీదనే. ఇంతటి అధ్వాన్నపు చిత్రాన్నిగూడా, అతను తట్టుకు నిలబడ్డాడు. ఇందులో ఆ అమ్మాయి మాగీ, ఈ అబ్బాయి డేవిడ్, చిన్నప్పట్నించీ. ఆవూరి బళ్లో పిలలందరిలోకి చాలా తెలివైనవాళ్లు, చురుకయినవాళ్లూ అని పేరుపడ్డారు. డేవిడ్ చాలా గొప్పవాడు అవుతాడని అంతా అన్నారు. అతనూ అనుకున్నాడు. అందుకోసం ప్రయత్నించడంలో ఉద్యోగాలు మారుస్తు, నలభయోపడిలో పడినా ఉన్నచోటనే ఉండిపోయాడు డేవిడ్. అలాగే మాగీకి ఏ రాజకుమారుడో మొగుడవుతాడని అంతా అనుకున్నారు. ఆమె, అంతకన్న గట్టిగా వాళ్ల నాన్నకూడా అనుకున్నారు. అందుకు ప్రయత్నించడంలో పెళ్ళికొడుకులిని మారుస్తూ నలభయో పడిలో పడినా పెళ్ళి కాకుండానే ఉండిపోయింది మాగీ. చివరికి ఆమెకి ఇతడూ, ఇతనికి ఆమె మిగిలారు. అమెరికన్ మెలోడ్రామా ఘట్టాలన్నీ మెల్లిగా దాటి గట్టెక్కి ఇద్దరూ చివరికి పెళ్లాడుతారు. ఈ కథను చెప్పడంలో, ఈ పాత్రలమీద సానుభూతి కలడానికీ, వాళ్లని ఆ సితికి తెచ్చిన పరిసితుల గురించి, వాళ్ళ దృక్పథాల గురించీ ఆలోచన రేకెత్తించడానికీ బదులుగా, జుగుప్స కలిగే విధంగా, వాళ్ళ మనసులను అనవసరపు మాటలతో ఆవిష్కరించబోయారు. ఇలాటి 'చెత్రాలు' మానసిక ఆరోగ్యానికి అరిష్టాలు. గతవారం ఇది మద్రాసు మిడ్‌లాండ్‌లో విడుదల అయింది. ★

'పథేర్ పాంచాలీ,' 'అపరాజిత' చిత్రాల స్రష్ట సత్యజిత్ రాయ్, విభూతి భూషణ్ వ్రాసిన ఈ బృహత్కథలో తరువాయి భాగాన్ని తెరమీద కెక్కించ నిశ్చయించారు. దీని పేరు 'అపూర్ సన్సార్.' ఇందులో అపూ పెరిగి పెదవాడవుతాడు. ఈ పాత్రకు, సత్యజిత్ రాయ్, తిరిగి సరికొత్త యువ నటుణ్ణి ఎన్నుకొన్నారు. అతనికి రంగస్థలంమీదకూడా ఏమంత అనుభవం లేదు. ఇటీవలి అంతర్విశ్వ విద్యాలయ నాటక పోటీలలో ప్రథమ బహుమతి తెచ్చుకున్నాడు. అతని పేరు సౌమిత్ర.

* * *

న్యాయవాది శ్రీ దేవగుప్తాపు శ్రీ సూర్యప్రకాశరావుగారు తమకుమార్తె చి॥ సౌ॥ అనసూయను (శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి అక్కగారి కుమార్తె) శ్రీ ఇవటూరి నాగభూషణరావుగారి కుమారుడు చి॥ గౌ॥ శంకర్‌కు ఇచ్చి మే 10న మద్రాసు గాంధీనగరంలో వివాహం జరిపించారు. పలువురు పురప్రముఖులు, న్యాయవాదులు, కళాకారులూ, ముహూర్తానికివచ్చి వధూవరులను దీవించి కానుకలు చదివించారు. ★

## వేసవికాలములో చల్లని పానీయాలు

[37 వ పేజీ తరువాయి]

పెరుగు బాగుంటె లస్సీ రుచిగా ఉంటుంది. ఒక స్టీలు గిన్నెలో పెరుగు, చక్కెర, ఎస్సెన్సు, ఇలాచీ పొడి వేయాలి, బాదం, జీడిపప్పులు, పావు శేరు పెరుక్కు పడి చొప్పున నీటిలో నానవేసి, పొట్టుతీసి నూరి వేయాలి. ఐసు ఉంటుంది కాబట్టి నీరు ఎక్కువపోయకూడదు. కొందరు బిస్కట్టు ముక్కలుకూడ వేస్తారు. చల్ల కవ్వముతో చిక్కగా గిలకొట్టి త్రాగితే చాలా రుచిగా ఉంటుంది.

ఫ్రూట్ సలాడ్స్: ఇది కర్బూజా పండ్లతో చేస్తారు. ఇప్పుడు కర్బూజపండ్లు విరివిగా దొరుకుతున్నాయి. బాగాపండిన కర్బూజ తెచ్చి, చెక్కుతీసి చిన్న చిన్న ముక్కలుకోసి ఒక స్టీలుగిన్నెలోకి తీసుకోవాలి. అందులో అరకప్పు చిక్కనిమీగడ పాలు, తగినంత చక్కెర, నూరిన బాదం పప్పు, తగినంత చక్కెర, ఐసు, ఎస్సెన్సు వేయాలి. ఇష్టమున్నవారు టమేటో, సంత్రా పళ్లరసం వేసుకోవచ్చు. అన్నీ బాగా కలిసేట్లు కవ్వముతో చిలికి, కప్పుల్లో తీసుకుని త్రాగితే రుచిగాఉంటుంది.

(2) ఈకాలంలో దొరికే అన్నిరకముల పండ్లతోను ఈ సలాడ్‌ని తయారుచేసారు. మామిడి, కర్బూజ, సంత్రా, బత్తాయి, అరటి, ద్రాక్ష, ఆపిలు, మొదలగునవి, ఏవి దొరికితే అవి తీసుకునివచ్చి చెక్కుతీసి చిన్న ముక్కలుగా కోయాలి. మామిడిపండురసం తీయాలి. బత్తాయి, సంత్రా అయితే తోలు తీసి, తొనలపైని పొట్టు, గింజలు తీసేసి చిన్నముక్కలుగా చేసుకోవాలి. చిక్కని గేదెపాలు ఎఱ్ఱగాకాచి, చల్లారినతర్వాత ఒక కప్పు పండుముక్కలకి, 2 కప్పులు పాలు చొప్పున ఒకగిన్నెలో వేయాలి. స్టీలుగిన్నె అయితే మంచిది. బాదం, జీడిపప్పు సన్నని పొడవు ముక్కలుగా తరిగి, కిస్‌మిస్, తగినంత చక్కెర, ఎస్సెన్సు, ఇలాచీ పొడి అన్నివేసి బాగాకలిపి మూతపెట్టాలి. ఒక పెద్దగిన్నెలో మధ్యన ఈ గిన్నెఉంచి, చుటూ ఐసుముక్కలు, ఉప్పువేసి అరగంట అలాగే ఉంచాలి. తర్వాత మూతతీసి కావలసినవారు కప్పుల్లో తీసుకుని త్రాగవచ్చు. ఇది చల్లగా బావుంటుంది.

మన తాహతునుబట్టి వారమునకు ఒకటి, రెండుసార్లు చేసుకుని త్రాగవచ్చు. సలాడ్ ఎప్పటికప్పుడు చేసుకుని త్రాగాలి. నిలవ ఉండదు. మనయింటికి వచ్చినవారికి కాఫీ బదులు చల్లని పానీయాలుయిస్తె వారికి సేదదీరి, హాయిగాఉంటుంది. ★

కుమారి. సి. రాధ.

## విధివిధానమ్

(16-వ పేజీ తరువాయి)

వు తను చాలా విచారిస్తున్నాననీ, నాన్నగారికి చెప్పేడు. (ఇంట్లో వెలుతురుపోయి చీకటి ప్రవేశిస్తూంటుంది. రాజేశ్వరి లేచి వెళ్ళి లయిటు వేస్తుంది.)

సు: పొద్దు పోయిందండి. మా అమ్మ నాకోసం చూస్తూంటుంది. త్వరగా చెప్పెయ్యండి. ఇంటికెళ్ళిపోవాలి. ఆ తర్వాత మీరు స్కూలువెళ్ళేరా?

రా: వెళ్ళేను. మా అమ్మ, నాన్నగార్ని అనేకవిధాల బతిమాలి ఒప్పించింది. స్కూలుకి వెళ్లివచ్చేసేదాన్ని. ఇంకెప్పుడూ ఏ పంతుల్లలోనూ పాల్గొనలేదు.

సు: ఆ అబ్బాయెక్కడున్నాడిప్పుడు?

రా: ఏమో నాకు తెలవదు. ఆ సంవత్సరంలో అతని చదువిక్కడైపోయింది. వెళ్లిపోయాడు. చాలా మంచి కుర్రాడు. ఆతర్వాత నేను స్కూల్ ఫైనల్ వరకూ చదివేను. ఇప్పుడావ్యాపకంకూడాలేదు జీవితం ఇంత విచారంగా అవుతుందని నేనెప్పుడూ అనుకోలేదు.

సు: (ఉలిక్కిపడి) ఏమన్నారూ? విచారంగానా?

రా: అవును ఏంచెయ్యను రోజంతా? చదువుకోడం తప్పితే, ఏం సంతోషంవుంది జీవితంలో?

సు: ఓహో! ధనవంతుల ఇంట్లో పుడితే అంతా సుఖమే అనుకున్నా. అయితే మేమే నయమన్న మాట! జీవితాన్నిగురించి ఆలోచించడానికే టయిముండదు. ఇంక వెళ్తానండీ. ఇంకా పొద్దుపోతే మా అమ్మ కేకలేస్తుంది. (లేస్తుంది.)

రా: (లేచి) మీతో కబుర్లు చెబుతూంటే నాకు కొత్త ఉత్సాహం వస్తుంది. మళ్ళీ తప్పకుండా రండి.

సు: తప్పకుండావస్తాను.(వెళ్లిపోతుంది.)

[తెరపడి పోతుంది.]

—మిగతా వచ్చేవారం.

## కరుణా స్వరూపిణి కనక మహాలక్ష్మి

(27-వ పేజీ తరువాయి)

తప్పదు. ఇది ఇప్పటికీ జరుగుతూనే వుంది.

తెలుగుదేశంలోవున్న ఏ గ్రామదేవతని చూసినా కోడ్లో గొర్రో బలికోరడంగాని, భక్తులే బలులివ్వడంగానిజరుగుతూవుంటుంది. కాని కనకమహాలక్ష్మమ్మ మాత్రం ఎన్నడూ బలి కోరదు. ఆ తల్లికి కావలసిందల్లా అభిషేకం, కుంకంపూజ, టెంకాయనివేదనం.

ఈ సందర్భంలో మరొక్క విషయం మాత్రం చెప్పకతప్పదు. అదేమిటంటే, ఎంత సత్యకాలపురోజులైనా వచ్చిబంగారం పట్టపడిపిథిలో కనబడుతూ వుంటే వూరుకుంటారా! ఒక అర్ధరాత్రివేళ దొంగలు వచ్చి అమ్మవారి ఏడు వారాల్నగలూ దొంగిలించబోతూ ఆ ప్రయత్నంలో అమ్మవారి విగ్రహాన్నే పగలగొట్టేశారు. అంతలో నిలువెత్తు విగ్రహం పగిలిపోయి నడుము నుంచి శిరస్సువరకూవున్న రూపం నిల్చింది. ఆ పగిలిన రాతి ముక్కల్నే విగ్రహానికిటూ అటూ వుంచి అమ్మవారి పిల్లలని చెప్తూ వుంటారు. కాచి రక్షించే కన్నతల్లి, కరుణ స్వరూపిణి కనకమహాలక్ష్మి దొంగల్ని పట్టుకునే ప్రయత్నం చేయవద్దని అందరికీ చెప్పింది. ఇప్పటికీ అమ్మవారు నాడు సగలగా మిగిలిన రూపుతోనే నిలచి, కన్పిస్తూ వుంటుంది. —భారవి]



'సెయింట్ జోన్' లో జీన్ సెబెర్గ్.

## విక్రమార్కుడి మార్కు సింహాసనం

(9 వ పేజీ తరువాయి)

యణానికీ భారతానికీ ఉంది; దానికీ హామ్లెట్‌కీ వున్నది. దానికీ ఇంకా ఏది పడితే దానికీ సంబంధం ఉంది. రేపు మనం వాలి స్టోరీని తీసినపుడు ఫ్లాష్‌బాక్‌లో భారత యుద్ధం, హామ్లెట్‌లో ఘోస్టు సీను చూపిస్తామా లేదా."

'చూపిస్తామనుకోండి' అన్నాడు రాజు భయపడుతూ గుటక వేసి.

'ఇంకేం. అలాటపుడు, మరి వాటికి సంబంధం లేదనగలమా.'

'అనలేమనుకోండి' అన్నాడు రాజు నసుగుతూ.

"అయినా రామాయణాన్ని 'ఆదికావ్యం' అంటారని మా మేష్టరు అన్నాడు."

'హోస్. అదానువు చెప్పేది. అది రైటైతే కావచ్చు. అంటే, రామాయణం ఫస్టున పబ్లిషు అయినట్టుంది. కాని భారతమే ముందు జరిగినటు నాకు గుర్తు. ఇంక హామ్లెట్టంటావా. అది చాలా పాతది. వీటికన్న ముందరదని మొన్న ఒక సీమ దొర కూడా చెప్పాడు. ప్రింటు కావడానికి చాల రోజులు ముందర్నుంచీ దాన్ని డ్రామా ఆడేవారుగదా. అయినా మనం ఓపని చెయ్యొచ్చు. పెద్ద బాక్సాఫీస్ అయిడియా. ప్రొడక్షనుతో పాటు మనం ఓ పేపరు మొదలుపెడదాం. అందులో ఓ కాంట్రవర్సీ. వాదప్రతివాదన వేదిక అని దానికి హెడ్డింగు.

"ఏదిముందు? హామ్లెటా, రామాయణావా, మహాభారటావా? ఏది ముందు జరిగింది? ఏది ఫస్టున పబ్లిషు అయింది? అని నోటీసు వేదాం. ఇందులో బయటపడే ట్రూతుని మా మహత్తర పౌరాణిక చిత్రము వాలిసుగ్రీవలో చేర్చుతాము అని కూడా బెదిరిద్దాం. అక్కడితో జనం దీని మీద కొట్టుకు ఛస్తారు. ప్రజలంటే వెర్రి వెధవలు. గొర్రెలమంద సైకాలజీ. ఇటు మాంఛి పబ్లిసిటీ; పిచ్చరు గారంటీ హిట్టు. సరేనా?"

'సరేండి' అన్నాడు రాజు బిక్క మొహం పెట్టి.

'మీరు థ్రిల్‌గా ఉన్నారు. ఏది ఓ హాండ్రెడు ఇలా పారెయ్యండి.'

'నో సార్. హండ్రెడ్ ఈజే బాంక్. అయాం మే చెక్. టుమారో మార్నింగ్ కామ్' అన్నాడు రాజు.

'వెరిగుడ్. సో. ఈ పిక్చరు సాకిస్తారుగా' అన్నాడు ఇద్దరు ముగ్గురు.

'ఎంత మాటండి' అన్నాడు రాజు నవ్వి.

* * *

'మీరు చాలా అన్యాయంచేశారు. డైరెక్షను నాకే ఇస్తానని ముందర చెప్పి, తీరా వాడికి మాటిచ్చారు" అన్నాడు అసిస్టెంట్ డైరెక్టరు రాయుడు కోపంగా, బాధగా.

'మా కేగదోయ్' అన్నాడు రాజు ఆరు బయట గాలిపీల్చి హమ్మయ్య అనుకుంటూ.

'ఏమోనండి మా మామయ్య పోయెం గ్నాపకం వస్తోంది. 'క్షణక్షణముల్ ప్రభు దివ్య చిత్రముల్' అని, అన్నాడు రాయుడు దిగులుగా.

(పై వారం ప్రొడక్షన్‌లో రాజు) ★

## న్యూఢిల్లీ లేఖ

(6-వ పేజీ తరువాయి

విశ్వసించను," అన్నాడు విన్‌స్టన్ చర్చిల్. నిజంగా ప్రజాస్వామ్యమన్నది హేతుబద్ధమయే వుండాలి; న్యాయం, ధర్మం దానికి ప్రాతిపదికలు. దీన్ని కాదనలేము.

అయితే మనదేశంలో - ముఖ్యంగా రాజధానిలో - ప్రజాస్వామ్యం ఎలా నడుస్తున్నదంటారు?

మనుషులు బహిరంగ వీధులలో తివ్వవేసి కూచుంటారు. అమ్మకూడదని నిషేధించిన తినుబండారాలనే అక్కడ బహిరంగంగా అమ్ముతుంటారు. ఈ విధంగా శాసన ధిక్కారం చేసేవారిపై ఎవరూ ఏవిధమైన చర్య తీసుకోరు. అథవా ఏదైనా చర్య తీసుకోవడమే జరిగిందో, పార్లమెంటులో కాంగ్రెస్ సభ్యులేగావు కేకలుపెట్టి గగ్గోలు చేస్తారు!

ప్రభుత్వ స్థలాలను నిస్సంకోచంగా ఆక్రమించుకొని స్థిరనివాసాలు ఏర్పాటుచేసుకుంటుంటే పార్లమెంటులోని ఢిల్లీ ప్రతినిధులు వీరికి అండగా నిలుస్తారు; అందుచేత ఆ స్థలాలను ఖాళీచేయడమంటూ జరగదు. ఈ విధంగా చట్టవిరుద్ధంగా ఢిల్లీలో దాదాపు 40 వేల అక్రమ నివాసాలు ఏర్పడాయి. చటవిరుద్ధమైన ఈ కట్టడాలను ఢిల్లీ పాలకులు చట్టబద్ధం చేసివేస్తున్నారు. భారత ప్రజల ధనాన్ని కోట్లకొలదీ వెచ్చించి ఈ న్యూఢిల్లీ నగరాన్ని నిర్మించారు. దీన్ని సక్రమమైన స్థితిలో వుంచడానికి ఒకవేపు కోటు ఖర్చవుతున్నాయి; మురికికూపాల నిర్మూలనకని మరికొన్ని కోట్లు ఖర్చు చేస్తున్నారు. న్యూఢిల్లీ మొత్తాన్నే ఒక పెద్ద మురికికూపంగా మార్చివేయడానికి ఎన్ని ప్రయత్నాలు జరగాలో అన్నీ మరొకవేపునుంచి జరుగుతున్నాయి. నగరం ఎలా తయారవుతున్నదో ప్రత్యక్షంగా చూడాలేగాని వర్ణించలేము. లిటన్ రోడ్డులోవున్న చైనా రాయబారి కార్యాలయానికి ఎదురుగా ఈమధ్యే ఒక మురికికూపం వెలిసింది; ఇండియా గేట్ ప్రాంతమంతా గత పదేళ్లలో అక్కడ వర్ధిల్లిన హోటళ్ళతో నానా కశ్మలంగానూ తయారైంది. దండిగా తిండి తినడమే పంజాబీ సంస్కృతికంతకూ మూలకందం! కాబట్టి నగరంలో ఇలాటి మురికికూపాల సంఖ్య పెరిగిపోవలసిందేగాని తరగదు.

ఇంతెందుకు? ఒక్కసారి న్యూఢిల్లీ పురపాలక సంఘ కార్యాలయానికి వెళ్లిచూస్తే చాలు అంతా తెలిసిపోతుంది. కార్యాలయ ఆవరణంలోనే ఒకమూల విరిగిపోయిన కుర్చీలు, నిరుపయోగమైన ఇతర కొయ్యసామానూ కొండలలా కుప్పలు పడి వుంటాయి. వచ్చేపోయేవాళ్ళు నడిచే నడవాలలో రాకులమీద కాగితాల ఫైళ్ళు కుప్పలుకుప్పలుగా అడ్డదిడ్డంగా పెట్టివుంటాయి. ఆవరణంలో వున్న ఒక్క చిన్న తోటా అదృశ్యమైపోతున్నది. తమ కార్యాలయాన్నే ఇంత అల్లకల్లోలంగా తయారు చేసిన పురపాలక సంఘం నగరంలో పారిశుద్ధ్యప్రమాణాల నేమి కాపాడగలదు? పురపాలక సంఘంలో సిక్కుల సంఖ్యాధిక్యత యథాప్రకారం వుండాలని ఈమధ్య కొందరు సిక్కు సభ్యులు హోం మంత్రి పంత్ వద్దకు రాయబారం వెళ్ళారు. పంత్ వారికి తగిన సమాధానంచెప్పి పంపించారు! ఇదీ మన రాజధాని స్థితి! ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



విసిరినవల

—ఫొటో: ఎ. వి. రామమూర్తి.

Regd. No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# మీ సౌందర్యమే మీకు భూషణము...

# మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా ఉంచు కొనుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడండి!



తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీము జిగురుగా ఉండదు. అది రాసుకొన్న మరు క్షణములోనే కనపడకుండా పోతుంది మరియు దానిని పౌడరు అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటల తరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

## చర్మమును శుభ్రపరచే క్రీము

ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును పట్టి రాయండి. అది చర్మమును పూర్తిగా శుభ్రపరుస్తుంది మరియు చర్మములోని సూక్ష్మ రంధ్రములు పొడిగా అగుటను అడ్డుటమే కాక చర్మముయొక్క మృదుత్వము పోకుండా కూడ కాపాడుతుంది




## ఉచిత పుస్తకము

*"Lovelier with Pond's"* అనే సౌందర్యమును గురించిన ఇంగ్లీషు పుస్తకము కావాలని వ్రాయండి. దానిలో ముఖవర్చస్సు మరియు సౌందర్య రక్షణను గురించి ఎన్నో ఉపయోగకరమైన సలహాలు ఉన్నాయి. పుస్తకము పంపుటకయే 25 నయా పైసల తపాలా బిళ్లలు పంపుతూ ఈ ఎడ్రసుకు వ్రాయండి: **పి.ఓ. బాక్సు 1612, డిపార్టుమెంట్ 26వి, బొంబాయి 1.**

**చీస్‌బ్రో - పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్** (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ లో సంస్థాపింపబడినది)